# పురాణనామచంద్రిక

తెనుఁగుభాషయందలి
ఇతిహాస పురాణ కావ్యాది గ్రంథములయందు తఱచుగ కానఁబడు
దేవతలు మనుష్యులు పట్టణములు నదులు మొదలగువాని
నామముల వివరణముగల నిఘంటువు.

ఇది

యెనమండ్రం - వెంకటరామయ్య
చే
రచియింపఁబడి,

చెన్నపురి
ఊ. పుష్పరధశెట్టిగారి
కీర్తిరత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1879



[illegible]

**PURANA NAMA CHANDRIKA**

by Yenamandram Venkataramayya

Price Rs 87/-

ISBN 81-7443-004-0

Title Chandra

First Published in 1879
Prachee Reprint 1994, June

Published by P P C Joshi
for Prachee Publications,
1-1-336/73, Vivek Nagar
(Near Sri Thyagaraya Gana Sabha) Chikkadpally,
Hyderabad-500 020, A P
Phone 630703

Processed and Printed at Gayatri Offset Press,
A-66, Sector No 2, Noida

# PREFACE.

The object of this work is to supply in a convenient form, a cheap book to Telugu Students, to aid them in studying the Standard works of Hindu Literature It contains the names of all Hindu deities, saints and sovereigns, places of sanctity and worship, systems of religion and philosophy &c , &c , arranged alphabetically with short explanatory and descriptive notes. Telugu Literature is so replete with these names, and Hindu Mythology and religion are so intimately connected with the literature of the country that it is impossible to acquire any proficiency in the latter without some knowledge of the former Five Tables shewing the genealogy of the principal characters that figure in the Puranas are also appended to the work, and although these may bring out in a striking form, some of the inconsistencies and anachronisms that are so difficult to account for, they will generally be found to throw much light on the accepted lineage of several illustrious personages

The work does not pretend to be complete or exhaustive, but it is hoped that it will be found to contain enough of information for all practical purposes, and be a ready and convenient hand book to the Student

Much time and labor have been expended in bringing to completion this work in its present shape, but notwithstanding all the care bestowed upon it, it cannot be denied that the eye of the critic may detect in its pages many sins of omission and commission The novelty of the undertaking however will, it is humbly hoped, serve to some extent as an extenuation of such shortcomings, and while every effort will be made to profit by criticisms tendered in a liberal spirit, the reception with favor by the public at large of this

first though feeble attempt to supply a long felt want, will be deemed a sufficient recompense for the labor and anxiety that are inseparable from such undertakings

The work which was selfimposed has been a labor of love, and although it was designed many years ago, its progress has been necessarily slow owing to the limited time which could be bestowed upon it at intervals of leisure and in the midst of other avocations.

Y. V.

MADRAS,
*February* 1879.

# జ్ఞాపకము.

---

మనపురాణేతిహాస కావ్యాదులయందు తఱచుగ కానఁబడు ననేక నామములను సులభముగ తెలిసికొనుటకు తగిన ఒక అకారాది నిఘంటువు లదని యోచించి ఆకొఱఁతను కొంతమట్టుకు పూర్తిచేయఁదలఁచి ఈ గ్రంథమును వ్రాసితిని ఇందు మన దేవతలు, ఋషులు, రాజులు, కవులు, దేశములు, పట్టణములు, నదులు, పర్వతములు, గ్రంథములు, మతాచారవ్యావహారిక పదములు మున్నగునవి కూడినంతవఱకు ఏర్పరచి వ్రాయఁబడి ఉన్నవి గ్రంథబాహుళ్య భీతిచే అనేక ప్రదేశములయందు విషయములు మిక్కిలి సంకుచితము చేయఁబడి ఉన్నను ఆవశ్యకములగునవి లోపములయి ఉండవు ఆంధ్రభాషయందలి ప్రాచీన గ్రంథములయందు అభిరుచికల విద్యార్థులకు కొంతసహాయముగా ఉండునను సుద్దేశ్యముతో దీనిని ఏర్పఱచి ఉండుటఁబట్టి ముఖ్యముగ ఆగ్రంథములయందు ఉండు నామములే ఇందు కానఁబడును ఎట్లుండినను ఇందలి లోపములను పాటింపక గ్రంథశోధన చాలమిచే కలుగఁగల దోషములను మన్నించి ఆదరించునట్లు ఎల్లవారిని వేఁడెద.

మొ. వెం.

# సంజ్ఞలు.



అ॥ అణువంశస్థుఁడు
అం॥ అంగదేశపురాజు
ఇ॥ ఇక్ష్వాకువంశస్థుఁడు
కా॥ కాశ్యునివంశస్థుఁడు
కు॥ కురునివంశస్థుఁడు, కౌరవుఁడు
చూ॥ చూడుము
ద॥ దనువంశస్థుఁడు, దానవుఁడు
ది॥ దితివంశస్థుఁడు, దైత్యుఁడు
నరి॥ నరిష్యంతునివంశస్థుఁడు
నా॥ నామాంతరము

పా॥ పాంచాలదేశపురాజు
పు॥ పూరునివంశస్థుఁడు, పౌరవుఁడు
ప్రి॥ ప్రియవ్రతునివంశస్థుఁడు
బా॥ బృహదిముని వంశస్థుఁడు
మ॥ మగదదేశపురాజు
మి॥ మిథిలాధిపతి
య॥ యదువంశస్థుఁడు, యాదవుఁడు.
ర॥ రక్కసుఁడు
ఋ॥ ఋషి
వై॥ వైకృతము

# ఈశ్వర ప్రార్థన.

ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్

ఉ. ఏవిభు వందనార్చనము లేవిభు చింతయు నామకీర్తనం
బేవిభు సమ్యగీక్షణము నెవ్వని సంశ్రవణంబు సేయదో
పాపలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నంద్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్

ఉ. ఏ పరమేశుపాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పరుల్
లోపలిబుద్ధిలో నుభయలోకములందలసక్తిఁ బాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతురే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్

చ. తపములు సేసినైన మఱి దానము లెన్నియుఁ జేసినైన నే
జపములు చేసినైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంతవిలయస్థితి నెప్పుడు నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్

మ. తపముల్ సేసిన నోమనో నియతినో దానవ్రతప్రీతినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్టుల
ప్రపదం బౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వానిన
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁ గాక నాకెప్పుడున్

క. ఒకపరి జగములు వెలి నిడి । యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దా
సకలార్థసాక్షి యగు న । య్యకలంకుని నాత్మమూర్తి నర్థిఁ దలంతున్

క. విశ్వకరు విశ్వదూరుని । విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు । నీశ్వరుని బరమపురుషు నే భజయింతున్

# పురాణనామచంద్రిక.

## అ

అంగజుఁడు మన్మథుఁడు

అంగదపురము హిమవత్పర్వతమునకు సమీపమున ఉండెడి యొకపట్టణము లక్ష్మణుని కొమారుఁడగు అంగదునిచే నిర్మింపఁబడెను

అంగదుఁడు (౧) వాలికొడుకు

(౨) ఇ॥ శ్రీరాముని తమ్ముఁడగులక్ష్మణుని పెద్దకొడుకు - ఇతడు అంగదపురమును నిర్మించెను

అంగదేశము గంగాసరయూనదీసంగమ ప్రాంతదేశము ఇచ్చట రుద్రుఁడు తపముచేయుచుండు సమయమున అతనికి మన్మథుఁడు కామవికారము కలుగఁజేయ ప్రయత్నింప రుద్రుఁడు కోపించి మూఁడవకన్ను తెఱచి చూచి మన్మథుని భస్మము చేసెను - నాఁట [illegible] మన్మథుఁడు అంగములేనివాఁడై అనంగుఁడు అనఁబరఁగె అతనియంగము [illegible] భూమితో కలసి పోయినందున దీనికి అంగదేశము అనుపేరు కలిగె

అంగన ఉత్తరపు దిక్కునందుండు ఆఁడేనుఁగు

అంగమాల[illegible] [illegible]ఁడు

అంగారకుఁడు ఏకాదశరుద్రులలో ఒకఁడు [illegible] కుజుఁడు నవగ్రహములలో ఒక్కఁ[illegible] [illegible] ఇ॥ [illegible]ఁడు,కుజుఁడు,మంగలుఁడు

[illegible] సోమశ్రవతీర్థమున అర్జును[illegible] [illegible] అతనియాగ్నేయాస్త్రముచే దహింపఁబడి ఆవల చిత్రరథుఁడు అను నామముచే పరఁగిన యొకగంధర్వుఁడు ఇతని యుపదేశమున పాండవులు ధౌమ్యుని పురోహితునిఁగా కొనిరి భార్య కుంభీనస

అంగిరసుఁడు, అంగిరుఁడు (౧) బ్రహ్మ మానసపుత్రులలో ఒక్కఁడు ఇతనికి బృహస్పతి, ఉతథ్యుఁడు లేక సంవర్తుఁడు, అనునిరువురు కొడుకులును యోగసిద్ధి అనునొకకూఁతురును కలిగిరి ఈయోగసిద్ధి అష్టవసువులలో ఒక్కఁడగు ప్రభావసుని వివాహముచేసికొని అతనియందు విశ్వకర్మను కనెను తొల్లి అగ్నిదేవుఁడు దేవతలతోడి యలుకచే హవ్యంబుల వహింపనొల్లక వనమునకు చన దేవతలు అధికతపోవిజృంభితుఁడగు అంగిరసుని అగ్నిపదమునందు ఉంచిరి అంత కొంతకాలమునకు వెనుక అగ్ని మరలి రాఁగా అంగిరసుఁడు అతనిని ప్రథమాగ్నియయి ఉండుమని తాను అతనికి ప్రథమపుత్రుఁడయి అగ్నిసారూప్యమున తేజరిల్లె ఈరూపమున ఇతనికి శివ అనుభార్యయందు బృహజ్జ్యోతి బృహత్కీర్తి బృహన్మఖుఁడు బృహన్మతి బృహద్భానుఁడు బృహస్పతి బృహద్బ్రహ్మ అను నేడుగురు కొడుకులును అనుమతి రాక సినీవాలి కుహువు అర్చిష్మతి హవిష్మతి మహామతి అను నేడుగురుకూఁతులును పుట్టిరి వీరును వీరిసంతతివారందఱును అగ్నిస్వరూపులయి ఉందురు

(౨) ఇ॥ ఉల్ముకునికొడుకు అంగునితమ్ముఁడు భార్య స్మృతి

అంగుఁడు (౧) ఉల్ముకుని జ్యేష్ఠపుత్రుఁడు భార్య సునీథ కొడుకు వేనుఁడు

(౨) యయాతి నాలవపుత్రుఁడగు అణువు యొక్క వంశస్థుఁడయిన బలిక పెద్దకొడుకు

అంజన ఒకయప్సరస ఈమె శాపముచే కామరూపిణియగు వానరముగ పుట్టెను ఒకనాడు ఈమె మానుషరూపము ధరించి ఉండునపుడు వాయువుచూచి మోహించి యీమెయందు హనుమంతుని కనెను ఈమె కేసరి అను వానరునిభార్య కుంజరుఁడు అనువానరుని కూఁతురు

అంజనపర్వుఁడు ఘటోత్కచుని కొమరుఁడు ఇతఁడు భారతయుద్ధమున అశ్వత్థామచే చంపఁబడెను

అంజనము పడమటిదిక్కునందలి మగయేనుఁగు

అంజనావతి ఈశాన్యదిక్కునందుండెడి ఆఁడేనుఁగు

అంతకుఁడు యముఁడు

అంతరిక్షుఁడు ద॥ మురాసురునికొడుకు ఇతఁడు శ్రీకృష్ణునిచే చంపఁబడెను

అంతర్ధానుఁడు నా॥ విజయాశ్వుఁడు పృథుచక్రవర్తికొడుకు ఇతనికి ఇరువురు భార్యలు మొదటిభార్యయగు శిఖండి వసిష్ఠుని శాపముచే భూమియందు పుట్టి త్రేతాగ్నులయిన పావకుఁడు పవమానుఁడు శుచి అను ముగ్గురు పుత్రులను కనెను వీరు బాల్యమునందె చనిపోయిరి రెండవభార్యయగు నభస్వతికి హవిర్ధానుఁడు అనుకొమరుఁడు పుట్టె

అంతశ్శిల. వింధ్యపర్వతమునుండి వెలువడెడి యొకనది

అంతిసారుఁడు పు॥ చూ॥ నా॥ మతిసారుఁడు

అంధకుఁడు (౧) య॥ సాత్వతునికొడుకులలో ఒకఁడు ఇతనికి భజమానుఁడు కంకురుఁడు శుచి కంబళబర్హిషుఁడు అను నలుగురు పుత్రులు

(౨) దనుపుత్రుఁడు ఇతఁడు శివునిచే చంపఁబడెను

అంధుఁడు (౧) ద్రుహ్యునిపౌత్రుని పుత్రుఁడు.

(౨) ద॥ విప్రచిత్తికొడుకు

అంధ్రము తెనుఁగుదేశము

అంబ (౧) పార్వతి

(౨) కాశిరాజుకూఁతురు ఈమెకన్యగా ఉండునపుడు తండ్రియగు కాశిరాజుచే స్వయంవరమున సాల్వునకు ఈయంబడియుండినను భీష్ముఁడు బలాత్కారమున ఈమెను ఈమె చెలియండ్రగు అంబికాంబాలికలను యుద్ధమునందు శత్రురాజులనందఱను ఓడించి తెచ్చి తనతమ్ముఁడగు విచిత్రవీర్యునకు వివాహము చేయఁబోవునెడ ధర్మశాస్త్రజ్ఞులు అంబ పూర్వమె తండ్రిచే దత్త అయినందున ఆమెను మరల వివాహమగుట ధర్మము గాదని చెప్పఁగా ఆమెను భీష్ముఁడు సాల్వరాజునొద్దకు పంప సాల్వరాజు తన్ను పెండ్లియాడనని ధిక్కరించినందున ఆమె చచ్చి రెండవ జన్మమున శిఖండిగ ద్రుపదరాజునకు పుట్టి భీష్ముని భారతయుద్ధమున పడవేసెను చూ॥ శిఖండి

అంబరీషుఁడు (౧) ఇ॥ తండ్రి మాంధాత కొడుకు యౌవనాశ్వుఁడు.

(౨) రెండవనాభాగునికొడుకు నభగునిపౌత్రుఁడు ఇతఁడు కేవలము హరిభక్తుఁడు ఒకప్పుడు ఇతఁడు ద్వాదశీవ్రతము చేయుచుండునవసరమున దుర్వాసుఁడను మహర్షి ఇతనియొద్దకువచ్చి భోజనమునకయి ప్రార్థింపఁబడి యమునయందు స్నానమాచరింపఁబోయి అందుండి శీఘ్రముగ రామింజేసి ద్వాదశి గడియలు మీఱకమున్నె ఆహారము

పుచ్చుకొనవలసి యుండుటవలన ఈయంబరీషుఁడు బ్రాహ్మణులయనుమతిని జలపానము చేసె అది తెలిసికొని దుర్వాసుఁడు కోపగించి అంబరీషుఁడు భస్మమగునటులు దన జడయొకటి తీసివైచె అది విష్ణువు ఎఱిఁగి అంబరీషునిని కాపాడుటకు తనచక్రమును పంపెను అంత ఆచక్రము ఆజడను భస్మము చేసినదే కాక దుర్వాసుని తఱుముటకు ఆరంభింపఁగా అతఁడు మూఁడులోకములు తిరిగితిరిగి వేసారి బ్రహ్మరుద్రులచే జాఱ విడువఁబడి భక్తపరాధీనుండగు విష్ణువుచే అంబరీషునిపాలికి పనుపఁబడ అతఁడు చక్రమును స్తుతించి దుర్వాసుని కాపాడెను ఈయంబరీషునకు విరూపుఁడు కేతుమంతుఁడు శంభుఁడు అనుమూవురు కొడుకులు

అంబష్ఠదేశము ఉశీనరుని కొడుకగు సువ్రతుఁడు నిర్మించినరాజ్యము ఈదేశస్థులు అంబష్ఠులు అనఁబడుదురు

అంబాత్రయము జ్ఞానాంబ, భ్రమరాంబ మూకాంబ

అంబాలిక<br>అంబిక } అంబచెల్లెండ్రు కాశిరాజుకూఁతులు విచిత్రవీర్యుని భార్యలు వీరలలో అంబిక జ్యేష్ఠురాలు విచిత్రవీర్యుని మరణానంతరము దేవరన్యాయమున వీరియందు సత్యవతియాజ్ఞనొంది వ్యాసమహర్షి ధృతరాష్ట్ర పాండురాజులను పుట్టించెను

అంబిక పార్వతి

అంశుమంతుఁడు ఇ॥ (౧) తండ్రి అసమంజసుఁడు కొడుకు దిలీపుఁడు
(౨) సూర్యుఁడు

అంశుమాలి సూర్యుఁడు

అకంపనుఁడు ర॥ సుమాలికొడుకు జనస్థానమున ఖరదూషణత్రిశిరసులు రామునిచే చంపఁబడిన వృత్తాంతమును వీఁడు రావణునకు తెలియఁజేసెను లంకను రాముఁడు ముట్టడివేసినపుడు పశ్చిమద్వారమున హనుమంతునిచే వీఁడు చంపఁబడెను

అక్రూరుఁడు య॥ శ్వఫల్కుని పెద్దకొడుకు ఇతఁడును వృష్ణివంశస్థుఁడగు సాత్యకియు పినతాత పెత్తాత బిడ్డలు

అక్రోధనుఁడు కు॥ అయుతాయువుకొడుకు

అక్షమాల అరుంధతి

అగస్త్యభ్రాత అగస్త్యునిసహోదరుఁడు ఇతనికి గర్భమునందే జ్ఞానము కలిగినందున వ్యవహారజ్ఞుఁడు కాఁడాయెను కనుక ఇతనికి వ్యవహారనామము లేదు పేరిచే తెలసికోఁదగనివానిని అగస్త్యభ్రాత అందురు

అగస్త్యుఁడు ఇతఁడొకమహర్షి మిత్రావరుణులు సముద్రపుగట్టున సంచరించుచుండి ఊర్వశిని చూచి కామింప వారికి వీర్యములు స్ఖలితములై ఘటమున ఉనుపఁబడఁగా అందు అగస్త్యవసిష్ఠులు పుట్టిరి ఇతనియాశ్రమము వింధ్యపర్వతసమీపమున

ఈతనికథలనేకములు కలవు వాతాపి ఇల్వలుఁడు అనునిరువురు రాక్షసులు బ్రాహ్మణులను మిగుల హింసించుచుండురు రాక్షసులు కామరూపులు గనుక ఇల్వలుఁడు సాధారణముగ ఒకబ్రాహ్మణరూపము ధరియించి వాతాపిని మాంసముగ వండి తనయింట పితృకార్యమనుచు బ్రాహ్మణుని ఎవ్వనినైనను పిలిచి భోజనముపెట్టి భోజనానంతరము బ్రాహ్మణభుక్తశేషమును భుజియించుటకు రమ్మనువానివలెనే వాతాపిని పిలుచును వాఁడు అపుడ ఆబ్రాహ్మణునిపొట్ట చించుకొని వెలుపలికి వచ్చును ఈసంగతిని అగస్త్యమహర్షి యెఱిఁగి ఒకదినము ఇల్వలునియింటికి బ్రాహ్మణార్థము వచ్చెను అప్పుడు ఎప్పటి

తెఱంగున ఇల్వలుఁడు చేయఁగా అగస్త్యుఁడు "వాతాపే జీర్ణో భవ" అనెను అంత వాతాపి నశించెను ఇల్వలుఁడు అగస్త్యునిపై పడిరాఁగా అతనికోపముచే భస్మమాయెను

మఱియు తొల్లి ఒకప్పుడు మేరువింధ్యపర్వతములకు ఒకనిమిత్తము వివాదము కలిగి వింధ్యపర్వతము సూర్యచంద్రగతులకు అడ్డముగ పొడవెదుగ లోకమునకు అలజడి పొడమ అది తెలిసి దేవర్షులు అగస్త్యునిచెంతకు పోయి పొడమినవిపత్తును విచారింపుఁడని వేఁడఁగా అమ్మహామహుఁడు బయలువెడలి తనశిష్యుఁడగు వింధ్యముకడకు రాఁగా ఆపర్వతశ్రేష్ఠుఁడు అగస్త్యునకు దండప్రణామము ఒనర్చుటకు నేలమట్టమయ్యెను అప్పుడు అగస్త్యుఁడు వింధ్యునిం గని నేను దక్షిణమునకు పోయి మరలి వచ్చుదనుక నీవిచ్చట ఈప్రకారమే ఉండుమని పలికి పోయెను వింధ్యము అదిమొదలు ఇదివఱకును ఆప్రకారముననే క్రింద పడి ఉన్నదని ప్రసిద్ధి

వెండియు ఇతఁడు కాలకేయులనిమిత్తము సముద్రమునందలి జలమును ఆపోశనముగ తీసికొనెనని పురాణకథ చూ॥ కాలకేయులు

మఱియు నహుషుఁడు దేవేంద్రత్వమును అనుభవించుచుండినపుడు ఒకనాడు వేదములం గూర్చియు బ్రాహ్మణులం గూర్చియు నిర్లక్ష్యముగ మాటలాడినందున వానిని సర్పముగునట్లు అగస్త్యుఁడు శపియించెనని చెప్పియున్నది అగస్త్యుఁడు పులస్త్యునికి హవిర్భుక్కు అనుభార్యయందు పుట్టినట్లు కొన్నిచోట్ల అగపడుచున్నది

అగజాత పార్వతి

అగస్తి అగస్త్యుఁడు

అగ్ని అగ్నిదేవుఁడు

అగ్నికంటి శివుఁడు

అగ్నిచూలి కుమారస్వామి

అగ్ని అష్టదిక్పాలకులలో ఒక్కఁడు ఇతని దిక్కు పూర్వదక్షిణము భార్య స్వాహాదేవి పట్టణము తేజోవతి వాహనము మేషము ఆయుధము శక్తి ఇతఁడు అష్టవసువులలో ఒక్కఁడయి వసువుల కందఱకును రాజై ఉండును అనలుఁడు అనియు ఇతనికి నామము కలదు కొందఱు అగ్నిని బ్రహ్మజ్యేష్ఠ పుత్రుఁడందురు అతనినామము అభిమానాగ్ని కుమారస్వామి అగ్నిపుత్రుఁడని కొన్నిచోట్ల చెప్పఁబడి ఉన్నది చూ॥ పార్వతి కాశియందు విశ్వానరుఁడు అను ఋషికి ఇతఁడు కుమారుఁడై పుట్టినందున ఇతనికి వైశ్వానరుఁడు అనునామముకలదు చూ॥ అంగిరసుఁడు

(త్రేతాగ్నులు—ఆహవనీయము దక్షిణాగ్ని గార్హపత్యము ఇవిక్రమముగా వేదికి పూర్వదక్షిణపశ్చిమదిక్కులందు ఉండును) (పంచాగ్నులు — పైమూడగ్నులును సభ్యము అపసథ్యము కడపటి రెండును వేదికి ఈశాన్యదిక్కునందు ఉండును)

అగ్నిచయనము ఇది ఒకయజ్ఞకర్మము శపుఁడు అనువహ్నియొక్క కపటవృత్తినిపుణులయిన పదియేవురు పుత్రులు యజమానుల యజ్ఞఫలములను అపహరించుచుండుటచే ఇది వారిశాంత్యర్థము యాగములయందు చేయఁబడును

అగ్నిదేశ్యుఁడు ఇతనిచే ద్రోణాచార్యుఁడు ధనుర్విద్యాపారంగుఁడయ్యె

అగ్నిద్యోతనుఁడు వివాహనిమిత్తము కృష్ణుని వద్దకు రుక్మిణిచే పంపఁబడిన బ్రాహ్మణుఁడు

అగ్నిభువు కుమారస్వామి

అగ్నిమిత్రుడు పు॥ పుష్యమిత్రునికొడుకు శృంగులలో ఒక్కడు

అగ్నివర్చస్సు సూతునిశిష్యుడు గొప్పపౌరాణికుడు

అగ్నివేశుడు ఇక్ష్వాకునితమ్ముడగు అరిష్యునివంశస్థుడయిన దేవదత్తునికొడుకు ఇతడు కానీనుడై జాతకర్ణుడు అనుమహర్షినై వెలసె ఇతనివలన అగ్నివేశ్యాయనము అను బ్రాహ్మణకులము కలిగెను

అగ్నిష్టోమము వసంతకాలమందు ఐదుదినములలో చేసి ముగించెడియాగము

అగ్నిష్టోముడు చక్షుర్మనువుకొడుకు

అగ్నిష్వాత్తులు పితరులలో ఒకభేదము చూ॥ పితరులు

అగ్రజన్ముడు బ్రహ్మ

అఘాసురుడు బృందావనమున కృష్ణునిచే చంపబడిన బకాసురునితమ్ముడు అజగరాకారమున వీడు కృష్ణుని మ్రింగగా అతడు వీనికంఠద్వారమున ఊపిరి వెడలనీయక శరీరము పెంచి వీనిని చంపెను

అచ్చరలు వై॥ చూ॥ అప్సరసలు

అచ్యుతకృష్ణానిధి సిద్ధాంతకల్పతరువు అను గ్రంథమునకు కృష్ణాలంకారము అనువ్యాఖ్యానము వ్రాసినయొకపండితుడు

అచ్యుతుడు విష్ణువు

అచ్ఛోద ఒకపుణ్యనది ఇది తొలుత మరీచినందనులగు పితృగణములయొక్క మానసకన్యకగా పుట్టి తనపితలచే నిర్మితమగు అచ్ఛోదము అనుసరోవరతీరమున సహస్రదివ్యవర్షములు తపస్సుచేసి పితరుల మెప్పింపగా వారలు దివ్యాలంకారభూషితులయి పొడసూపిరి అంత ఆమె తనతండ్రులగువారలలో మావసుడు అనువానిని తనపతిగా కోరె ఈవ్యభిచారముచే ఆమె యోగభ్రష్టయై స్వర్గమునుండి క్రిందికి పడెనుగాని భూమినంటక మధ్యమున నిలచె ఆది దర్శతిథియై కోరినను ధీరతచే మావసుడు తనమనమును చలింపనీయకుండుటంజేసి యచ్ఛార్యము ప్రవర్తిల్లినదినము అమావాస్య అని పరగె పితృసంబంధమగునది కావున ఆదినము పితరులకు ముఖ్యము ఆదినమునందు వారలకు చేసెడుస్వల్పక్రియలైనను వారు అక్షయములుగ భావించి తృప్తిజెందుదురు అప్డు అచ్ఛోద తలక్రిందుగా పడి పితరులను అందఱను పలుచందముల వినుతించి నావ్యభిచారమును మన్నించి నాకు మరల గతులు కలుగునటులు కరుణింపుడని వేడగా ఆ పితరులు దానిం జూచి నీవిపుడు దేవతలు చేసెడు కర్మఫలములను అనుభవించుచుండి యిరువదియెనిమిదవ ద్వాపరమున మీనయోనియందు పుట్టి సత్యవతి అని పేరొకొనంబడి తొలుత పరాశరమహాముని తేజమున వ్యాసమహామునిని కని పిదప శంతనునిభార్యయై విచిత్రవీర్యుడు చిత్రాంగదుడు అనునిరువురు పుత్రులను కాంచి కడపట అచ్ఛోద అనుపుణ్యనదివి అయ్యెదవని చెప్పి అంతర్హితులయిరి

అచ్ఛోదము ఇది ఒకసరస్సు ఇందు అచ్ఛోద అనునది ఉద్భవిల్లెను ఈనదీతీరమునందు కుబేరునివనమగు చైత్రరథము ఉండును

అజకుడు పురూరవునివంశస్థుడగు జహ్నుని పౌత్రుడు

అజగరుడు రహస్యమయిన పరమహంసధర్మమును ప్రహ్లాదునకు బోధించినయొకమహర్షి ఇతడు కావేరీతీరమున సహ్యపర్వతతటమునందు ఉండెను.

అజగవము   శివునివిల్లు

అజమీఢుఁడు   పు॥ తండ్రిహస్తి   కొడుకులు బృహదిషుఁడు నీలుఁడు ఋషుఁడు ఈ తనివలన బార్హదిష పాంచాల కౌరవ వంశములుకలిగెను

అజాతశత్రువు   (౧) శైశునాగులలో ఆఱవ రాజు తండ్రి విధిసారుఁడు ఇతఁడే యిక్ష్వాకు వంశస్థుఁడగు బృహద్బలునివంశజుఁడైన శాక్యముని

(౨) ధర్మరాజు

అజామిళుఁడు   కన్యాకుబ్జపురమునందు ఉండిన యొకవిప్రుఁడు ఇతఁడు మహాపాతకుఁడును నిర్భాగ్యుఁడును అయ్యును అంత్యకాలమున నారాయణ నామధేయుఁడగు నిజపుత్రస్మరణమూలముగ నారాయణాభిధానము నుడువుటచే యమకింకరులయొద్దనుండి విష్ణుదూతలచే విడిపింపఁబడెను "ఆ॥ బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ।కేళినైన మిగులఁ గేలినైనఁ। బద్యగద్యగీతభావార్థములనైనఁ।గమలనయనుఁ దలఁపఁ గలుషహరము॥"

అజితుఁడు   (౧) బ్రహ్మ

(౨) విష్ణువు

(౩) శివుఁడు

అజుఁడు(౧) ఇ॥ తండ్రి రఘువు  కొడుకు దశరథుఁడు  కొందఱు రఘుమహారాజునకు పృథుశ్రవుఁడు  అనునొకకొడుకు  ఉండినట్లును అతనికి అజుఁడు పుట్టినట్లును చెప్పుదురు విదర్భరాజుకూఁతురగు ఇందుమతీస్వయంవరమునకు పోవునపుడు ఇతఁడుమార్గమున ఒకఋషిశాపముచే ఏనుఁగయి ఉండినయొకగంధర్వుని చంపఁ బోవఁగా అమృగము తనపూర్వగంధర్వరూపమును తాల్చి యితనికి అనేకాస్త్రములను ఉపదేశింపఁగా ఆ యస్త్రముల సాహాయ్యమువలన ఇతఁడు ఎల్లరాజుల జయించి స్వయంవరమున ఇందుమతిని వివాహమాయెను

(౨) మి॥ తండ్రి ధృతుఁడు

(౩) బ్రహ్మ

(౪) శివుఁడు

(౫) విష్ణువు

(౬) మన్మథుఁడు

అడిదముసూరన   ఇతఁడు కవిజనరంజనము అనునొకకృతి తెనుఁగున చేసెను అది తాను పడసిననామమును అన్వర్థము చేయుచున్నది దీనిని పిల్లవసుచరిత్రము అని చెప్పుదురు మఱియు ఇతఁడు ఆంధ్రనామశేషము అనెడియొకనిఘంటువు వ్రాసి ఉన్నాఁడు

అడిదానవుఁడు   అంధకునికొడుకు వీఁడు స్వస్వరూపమున యుద్ధమున మరణమునొందకుండునట్లును వేరురూపము చెందిన మరణము కలుగునట్లును, వరముఁబొంది ఉండెను. కనుక ఒకప్పుడు పార్వతివలె రూపము ధరించి శివుని మోసము చేయరాఁగా అది అతఁడు ఎఱిఁగి వీనిని చంపెను

అణుహుఁడు   చా॥ విభ్రాజునికొడుకు, ఇతఁడు శుకునికూఁతురగు కీర్తిమతిని వివాహమాయెను

అతనుఁడు   మన్మథుఁడు.

అతలము   తెల్లనిచాయకలిగిన యొకయధోలోకము ఇందు కొన్నిపన్నగములు ఉండును.

అతికాయుఁడు   ర॥ రావణునికొడుకు వీఁడు బ్రహ్మవలన అవధ్యకవచమును పొంది ఉండెను. లక్ష్మణునిచే బ్రహ్మాస్త్రముతో చంపఁబడెను

అతిచాంద్రుఁడు   ఇ॥ చూ॥ నా॥ ఇంద్రుఁడు

అతిథి.   శ్రీరామునికొడుకగు కుశునికొడుకు

అతిరథుఁడు   అం॥ సత్యకర్మునికొడుకు ఇతఁడు గంగగట్టున పడియుండిన కుంతీపుత్రుఁడ

గు కర్ణుని తనపుత్రునిఁగా పెంచుకొనెను భార్య రాధ

అత్రి బ్రహ్మమానసపుత్రులలో ఒక్కఁడు భార్య అనసూయ ఇతఁడు తనతపోబలముచే త్రిమూర్తుల యంశములందు సోమ దూర్వాస దత్తాత్రేయులను కొమరులుగ పడసెను

అదితి కశ్యపునిభార్య దక్షునికూఁతురు కొడుకులు ఆదిత్యులు

అదృశ్యంతి (౧) అరుంధతి

(౨) శక్తిభార్య పరాశరునితల్లి

అద్రిక ఒకయప్సరస

అద్వయవాది జైనులదేవత

అద్వైతము ఇది స్మార్తమతము ఇందు బ్రహ్మమని అవిద్యయని రెండుపదార్థములు కలవు అందు బ్రహ్మము, సత్యము జ్ఞానానందాత్మకము నిర్వికారము నిరవయవము నిత్యము - నిర్దోషము విభువు (సత్యము = కాలత్రయముచే బాధింపఁదగనిది నిర్వికారము = రూపాంతరములు లేనిది నిరవయవము = అవయవములు లేనిది నిత్యము = కాలత్రయములయందు ఉండునది విభువు = వ్యాపనము కలిగి ఉండునది )

అవిద్య, అపారమార్థికము సదసద్విలక్షణము జడము సవికారము సావయవము అనాది సాంతము అజ్ఞానరూపము (అపారమార్థికము = మిథ్యాభూతము బ్రహ్మతత్త్వజ్ఞానముచేత నివర్తించునది. ఇది వ్యావహారికసత్త అని చెప్పఁబడుచున్నది. వ్యవహారదశలో సత్తుగా తోఁచును కాని పరమార్థము కాదు. సదసద్విలక్షణము, సత్తనఁగా బ్రహ్మము, అసత్తనఁగా తుచ్ఛమయినశశశృంగాది, పారమార్థికసత్తయిన బ్రహ్మముకంటెను ప్రమాణసిద్ధముగాని తుచ్ఛముకంటెను విలక్షణమైనది బ్రహ్మమువలె పారమార్థికము కాదు. తుచ్ఛమువలె ప్రమాణములకు అవిషయమును కాదు )

ఈయవిద్య సత్త్వరజస్తమోరూపగుణత్రయాత్మకము దీనికి ఆచ్ఛాదకశక్తి విక్షేపశక్తి అని రెండుశక్తులు ఉన్నవి ఆచ్ఛాదకశక్తికల యవిద్యచేత ఆవరింపఁబడిన బ్రహ్మమునకు చీఁకటిలో ఉన్నమనుష్యునకువలె స్వస్వరూపజ్ఞానము చెడి విక్షేపరూపమయిన దేవతిర్యఙ్మనుష్యాది భేదజ్ఞానము కలుగుచున్నది ఈదేవాది భేదములు అన్నియు అవిద్యాపరిణామములుగాని పరమార్థములు కావు

ఈచైతన్యరూపమయిన బ్రహ్మము, శుద్ధచైతన్యము మాయావచ్ఛిన్నచైతన్యము అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము వృత్త్యవచ్ఛిన్నచైతన్యము విషయావచ్ఛిన్నచైతన్యము అని అయిదుభేదములుగలది శుద్ధమైన బ్రహ్మస్వరూపమునకు ఈభేదములు అవిద్యమొదలుగాఁగల యుపాధులచేత కలుగుచున్నవి అందు శుద్ధచైతన్యము అనునది శుద్ధబ్రహ్మస్వరూపము మాయావచ్ఛిన్న చైతన్యము అనునది ఈశ్వరుఁడు అతఁడె జగత్సృష్ట్యాదికర్త సర్వాంతర్యామి సగుణ బ్రహ్మము

అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము అనునది జీవుఁడు ఆకాశగతములయిన సూర్యాదితేజములు తటాకాదులయందు ప్రతిబింబించునట్లు తేజోమయమయిన బ్రహ్మచైతన్యము అవిద్యాపరిణామములయిన అంతఃకరణములయందు ప్రతిఫలించుచున్నది ఇందు బ్రహ్మము బింబము, అంతఃకరణములయందు తోఁచునట్టివి ప్రతిబింబములు, అవియె జీవులు. సూర్యాదిబింబములకును జల

ములయందు తోఁచునట్టి ప్రతిబింబములకు ను భేదము లేనట్లు, బ్రహ్మజీవులకు భేదము లేదు ప్రతిబింబభూతజీవులకును అంతఃకరణ రూపోపాధిభేదమే కాక స్వరూపభేదము లేదు

వృత్త్యవచ్ఛిన్నచైతన్యము అనునది అంతఃకరణ పరిణామరూపవృత్తులయందు ప్రతిఫలించుచైతన్యము ఇదియె జ్ఞానము అని చెప్పఁబడుచున్నది ఇది ప్రత్యక్షాదిభేదములచే అనేకవిధములు కలదిగా ఉన్నది

విషయావచ్ఛిన్నచైతన్యము ఘటపటాదులు

ఇందు మాయావచ్ఛిన్నచైతన్యమైన యీశ్వరుఁడు మొదట సృజింపఁగల ప్రాణివర్గములతారతమ్యమునకు హేతువగు కర్మములను తోడుచేసికొని అపరిమితశక్తి యుక్తమైన మాయనువశపఱచికొని నామరూపాత్మకమైన సకలప్రపంచమును సృజియింప సంకల్పించి మొదట ఆకాశాదిపంచభూతములను అపంచీకృతములను పుట్టించెను అందు ఆకాశమునకు శబ్దమును, వాయువునకు శబ్దస్పర్శములును, తేజస్సునకు శబ్దస్పర్శరూపములును, అప్పునకు శబ్దాదులతోడ రసమును, పృథివికి శబ్దాదులతోడ గంధమును గుణములు.

పృథివి అప్పు తేజము వాయువు ఆకాశము అనునీపంచభూతములును, గుణత్రయాత్మకమయిన యవిద్యయొక్క కార్యములుగాన ఇవియు త్రిగుణాత్మకములు సత్వగుణయుక్తములు అయిన యీభూతములచేత త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అనెడి జ్ఞానేంద్రియములు మనోబుద్ధ్యహంకారచిత్తములు అనెడి యంతఃకరణ పరిణామములును, పుట్టుచున్నవి రజోగుణ యుక్తములు అయిన యీభూతములచేత వాక్పాణిపాదపాయూపస్థములు అనెడి కర్మేంద్రియములు పుట్టుచున్నవి రజోగుణముతోకూడిన భూతములచేత ప్రాణాపాన వ్యానోదానసమానములు అనుపంచప్రాణములు పుట్టుచున్నవి

ఈపంచభూతములచేతను జ్ఞానకర్మేంద్రియములచేతను పంచప్రాణములచేతను మనోబుద్ధులచేతను సూక్ష్మశరీరము పుట్టుచున్నది ఈశరీరము లింగశరీరము అనిచెప్పఁబడును ఈశరీరము పరలోకయాత్రకు అనుకూలమై మోక్షపర్యంతము ఉండునది

తమోగుణముతోడ కూడిన యపంచీకృత భూతములచేత పంచీకృతభూతములు పుట్టుచున్నవి పంచీకరణము అనఁగా ఆకాశాది పంచభూతములను మొదల ప్రత్యేకము రెండుగాభాగించి అందు ఒక్కొక్కయంశమును నాలుగేసిగా భాగించి ఆనాలుగింటిలో ఒక్కొక్కభాగమును భాగింపని యొక్కొక్క సగముతో చేర్చి కలపఁగా పంచీకృతభూతములు ఏర్పడియె అందు ఆకాశార్ధమును కడమభూతములలో ఎనిమిదింట ఒక్కొక్కభాగమును చేర్పఁగా పంచీకృతాకాశము ఇట్లు వాయ్వాదులను ఊహింపవలయును

ఈపంచీకృత భూతములచేతనే అండములును వానికి లోఁబడిన పదునాలుగు లోకములును జరాయుజాది దేహములును పుట్టుచున్నవి (జరాయుజములు=జరాయువువలనపుట్టునవి = మనుష్యాదులు జరాయువు=గర్భముతిత్తి అండజములు=అండమువలనపుట్టునవి=పక్షిసర్పాదులు, అండము=గ్రుడ్డు స్వేదజములు=చెమటవలన పుట్టునవి=నల్లి మొదలయినవి, ఉద్భిజ్జములు=భూమినిచీల్చుకొని పుట్టునవి=వృక్షాదులు )

ఇట్టి ప్రపంచమునకు మూలప్రకృతి పరిణామ్యుపాదానకారణము ఘటమునకు మన్ను వంటిది పరిణామి అనఁగా ఒకరూపము నుండి మఱియొకరూపమును పొందునది బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదానకారణము, అనఁగా వెండి అను భ్రాంతికి శుక్తి వలె ప్రపంచభ్రమమునకు అధిష్ఠానము (అధిష్ఠానము=స్థానము ) పరమార్థమయిన బ్రహ్మమునందు ప్రపంచమునకు అధ్యాసము కలుగుచున్నది (అధ్యాసము=భ్రమము )

ఇట్టి ప్రపంచరూపకార్యముల నాశము ప్రళయము అనఁబడును అది నిత్యప్రళయము నైమిత్తికప్రళయము ప్రాకృతప్రళయము ఆత్యంతికప్రళయము అని నాలుగువిధములు కలది అందు ఆత్యంతికప్రళయము బ్రహ్మసాక్షాత్కారముచేత అవిద్యారూపకారణముతోడ సకలప్రపంచనివృత్తి (బ్రహ్మసాక్షాత్కారము=తనకును బ్రహ్మమునకును ఐక్యప్రత్యక్షము ) ఈసాక్షాత్కారము శ్రవణ మనన నిదిధ్యాసనములతోఁగూడిన వేదాంతవాక్యములచేత కలుగుచున్నది (శ్రవణము=ఆచార్యునివలన న్యాయయుక్తములు అయినయర్థములనువినుట మననము=విన్నయర్థములందు విరోధశంకలు కలుగునప్పుడు వానిని పోఁగొట్టునట్టి మానసికమగు యుక్తివిచారము నిదిధ్యాసనము=అనాదివాసనచేత విషయములయందు ప్రవర్తించి ఉండునట్టిమనస్సును విషయముల నుండి యీడ్చి ఆత్మయందు కదలనీక నిలుపుట ) ఇది సాక్షాత్కారరూపమయిన బ్రహ్మైక్యజ్ఞానమునకు చేరినకారణము ఈజ్ఞానము పాపక్షయముచేత కలుగుచున్నది కర్మానుష్ఠానముచేత పాపక్షయము గలుగును

ఈశ్రవణాదులయందు మోక్షేచ్ఛగలవారికే అధికారము ఆమోక్షేచ్ఛయందు నిత్యానిత్యవస్తువివేకము విషయఫలవైరాగ్యము శమదమోపరతి తితిక్ష సమాధానము శ్రద్ధ అనునవి ప్రయోజకములు (శమము = అంతరింద్రియనిగ్రహము, దమము = బహిరింద్రియనిగ్రహము ఉపరతి=చాంచల్యములేమి తితిక్ష=ఓర్పు సమాధానము=ఒకచోటనే మనస్సునిలుపుట శ్రద్ధ=గురువులయందును శాస్త్రముల యందును విశ్వాసము )

నిర్విశేషమయిన బ్రహ్మమును సాక్షాత్కరింపసామర్థ్యము లేనివారు సవిశేషబ్రహ్మోపాసనము చేయవలయు వీరికి సగుణబ్రహ్మోపాసనముచేత మనస్సు స్వాధీనపడఁగానే నిర్విశేష బ్రహ్మము తానే తోఁచును సగుణబ్రహ్మోపాసనము చేయువారు అర్చిరాది మార్గముగా బ్రహ్మలోకమును పొంది అందు శ్రవణాదులచేత సాక్షాత్కారము కలిగి బ్రహ్మతోడ మోక్షమును పొందుచున్నారు కర్మనిష్ఠులు ధూమాదిమార్గముగా పితృలోకమును పొంది అందు సుఖానుభవములు చేసి మరల పుణ్యపాపానురూపముగ మనుష్యాది యోనులయందు పుట్టుచున్నారు నిషిద్ధకర్మములను ఆచరించువారు రౌరవాదినరకములను పొంది అందు పాపానురూపంబుగా దుఃఖములను అనుభవించి మరల కుక్క నక్క మొదలుగాఁగల తిర్యగ్యోనులయందు స్థావరాదియోనులయందును పుట్టి నశించుచున్నారు. నిర్గుణ బ్రహ్మోపాసనము చేయువారు ప్రారబ్ధ కర్మములనుమాత్రము అనుభవించి కడమ పుణ్యకర్మములను మిత్రులయందును పాప కర్మములను శత్రువులయందును విడిచి కైవల్యమునుపొంది నిరతిశయానందమును అనుభవించుచున్నారు

అద్వైతానందుఁడు వేదాంతసారము అను వేదాంతగ్రంథమునకు వ్యాఖ్యానము చేసిన యతఁడు సదానందునిగురువు

అధర్ముఁడు వరుణునికి జ్యేష్ఠాదేవియందు పుట్టినకొడుకు ఈతనిభార్య నిరృతునికూఁతురయిన హింస, కుమారులు భయుఁడు మహాభయుఁడు మృత్యువు చెల్లెలు సురనిందని

శ్రీభాగవతమున అధర్ముఁడు మృషను వివాహమయినట్లును ఆమెయందు దంభుఁడు అనుకొడుకును మాయ అను కూఁతురును కలిగినట్లును వారికి ఇరువురకు లోభుఁడు అనుకొడుకును నికృతి అనుకూఁతురునుపుట్టినట్లును, వారికి క్రోధుఁడు హింస పుట్టిరనియు, వారికి కలియు దురుక్తియు పుట్టిరనియు, వారికి మృత్యువును భీతియు కలిగిరనియు, ఆమృత్యువునకు భీతియందు నిరయుఁడు యాతనయు పుట్టిరనియు, చెప్పఁబడి ఉన్నగి

విష్ణుపురాణమునందు అధర్మునికిని హింసకును అనృతుఁడు అనుకొడుకును నికృతి అనుకూఁతురును పుట్టినట్లును, నికృతియందు అనృతునికి భయుఁడు నరకుఁడు అనునిద్దఱు పుత్రులును మాయ వేదన అనునిద్దఱు పుత్రికలును జన్మించినట్లును, అందు భయునికి మాయయందు మృత్యువు అనువాఁడును నరకునికి వేదనయందు దుఃఖుఁడు అనువాఁడును పుట్టినట్లును, చెప్పి ఉన్నది మఱియు మృత్యువునకు వ్యాధి జర శోకుఁడు తృష్ణ క్రోధుఁడు అనువారు పుట్టి లోకమును నాశముచేయుచుందురనియు చెప్పి ఉన్నది

అథర్వణాచార్యులు ఈతఁడు ఒకయాంధ్రపండితుఁడు ఇతఁడు తెనుఁగువ్యాకరణమునుగూర్చి అనేకకారికలు వ్రాసినట్టుచెప్పఁబడుచున్నదిగాని ఆగ్రంథము ప్రత్యేకముగా దొరకినది కాదు ఇతఁడు భారతమును తెనిగించినట్లును తెలియఁబడుచున్నది

అధిష్ఠానపురము చేదిదేశమునకు ముఖ్యపట్టణము

అధోక్షజుఁడు విష్ణువు

అధశ్శిరస్సు లంచముతీసికొనువారికై ఉండు నరకము

అధ్యాత్మరామాయణము రామునిని ఆత్మస్వరూపముఁగాను సీతను మాయాశక్తిఁగాను నిరూపించి రామకథను ఆత్మవిషయముగా చెప్పు గ్రంథము ఇది విశ్వామిత్రునిచే చేయఁబడినది ఇది తెనిఁగింపఁబడి ఉన్నది

అధ్యాత్మలు ఇవి పదుమూఁడు విధములగు వాయువులు ఇవి పిండాండమునందును బ్రహ్మాండమునందును ఉండును

అధ్వని బళ్లారిజిల్లాయందు ఉండెడి ఒకపట్టణము దీనిని ఇప్పుడు ఆదవాని అందురు

అనంగుఁడు మన్మథుఁడు చూ॥ అంగదేశము

అనంతకవి ఇతఁడు భోజరాజీయము అను ఒకతెనుఁగుగ్రంథమునువ్రాసి ఉన్నాఁడు

అనంతవిజయము యుధిష్ఠిరునిశంఖము

అనంతవ్రతము ఇది భాద్రపదశుక్లచతుర్దశియందు కాలస్వరూపుఁడయిన అనంతపద్మనాభుని ఉద్దేశించి సలుపఁబడు ఒక వ్రతము. ఇది మహైశ్వర్య ప్రదము అని అరణ్యవాసకాలమున పాండవులకు శ్రీకృష్ణుఁడు చెప్పినట్లు చెప్పఁబడుచున్నది

అనంతుఁడు (౧) ఆదిశేషువు.
(౨) విష్ణువు
(3) రుద్రుఁడు

అనమిత్రుఁడు య॥ యుధాజిత్తుని పుత్రుఁడు- ఇతనికి కొడుకులు నిఘ్నుఁడు శిని వృశ్ని అని మువ్వురు.

అనరణ్యుఁడు (౧) ఇ॥చూ॥నా॥అనేనస్సు
(౨) ఇ॥ తండ్రి త్రసదస్యుఁడు లేక వసుదుఁడు కొడుకు హర్యశ్వుఁడు రావణుఁడు ఇతనితో యుద్ధముచేసి ఇతనిం గూల్పఁగా ఇతఁడు నన్నునొప్పించినందులకై త్రుళ్లికుము నావంశమున పుట్టఁబోవు రాముఁడు నిన్ను చంపును అనిపలికి మృతినొందెను

అనర్ఘరాఘవీయము మురారిచేత చేయఁబడిన ఒకసంస్కృతనాటకము

అనలుఁడు (౧) మాలికొడుకు విభీషణుని యనుచరుఁడు
(౨) అగ్ని
(౩) కుశునివంశజుఁడగు నిషధుని కొడుకు

అనలురు దేవతాభేదము, వీరు నలువదితొమ్మండ్రు అందు అభిమానుఁడు మొదటివాఁడు అతనికొడుకులు పావకుఁడు పవమానుఁడు శుచి అని మువ్వురు వారికొడుకులు నలువది యయిదుగురు చూ॥ అగ్ని

అనసూయ. అత్రిభార్య సీతాదేవి శ్రీరామునితోఁగూడి దండకారణ్యమునందలి అత్రిమహర్షి యాశ్రమమునకు పోయినపుడు ఈమె సీతకు స్త్రీధర్మములు అనేకములు ఉపదేశించి ఆమెనుదీవించి సౌమంగల్యమునకు లోపమురాకుండునట్లు అంగరాగ మాల్యవస్త్రాభరణములను ఇచ్చెను

అనాయువు నా॥ అనుగ. తండ్రి దక్షప్రజాపతి; మ॥ఁడు కశ్యపుఁడు

అనిరుద్ధుఁడు (౧) కల్పాదియందు బ్రహ్మను పుట్టించుటకై నారాయణుఁడు ఎత్తినయవతారము:
(౨) య॥ ప్రద్యుమ్నునకు రుక్మికూఁతువందు పుట్టినకొడుకు ఈతఁడు బాణాసురుని కొమార్తెయగు ఉష అనుదానిని పెండ్లాడెను

అనిలుఁడు (౧) అష్టవసువులలో ఒక్కఁడు
(౨) వాయువు భార్య శైవ కొడుకులు పురోజవుఁడు విజానగతి
(౩) ర॥ మాలికొడుకు విభీషణుని యనుచరుఁడు

అనీకుఁడు య॥ వసుదేవునితమ్ముఁడు

అనుగ చూ॥ నా॥ అనాయువు

అనుగీత ఇది వేదాంతవిషయమైన ఒకగ్రంథము భారతమునందు అశ్వమేధపర్వమున ఉన్నది

అనుతాపకుఁడు దనుపుత్రుఁడు

అనుపదేవుఁడు (౧) య॥ దేవకునికొడుకు
(౨) య॥ అక్రూరునిరెండవ కొడుకు

అనుపమ దక్షిణపశ్చిమమున ఉండెడి ఆఁడేనుఁగు

అనుమఁడు చూ॥ నా॥ హనుమంతుఁడు.

అనుమతి ధాతభార్యలలో ఒకతె

అనువు. (౧) య॥ కురువశునికొడుకు
(౨) య॥ కపోతలోమునికొడుకు

అనుహ్లాదుఁడు ధి॥ హిరణ్యకశిపునికొడుకు

అనూరుఁడు కశ్యపప్రజాపతినికి వినతయందు పుట్టినకొడుకు ఈతనితమ్ముఁడు గరుడుఁడు—అనూరుఁడును గరుడుఁడును అండజములు అందు అనూరుఁడు ఉండిన యండమును అతనితల్లియైనవినత తనసవతి కద్రువకుతనకంటెముందు పుత్రులుకలిగిరి అనునసూయచే త్వరపడి అవియించినందున దేహము సంపూర్ణముగాక తొడలుమొదలుక్రింది భాగము లేనివాఁడై పుట్టెను ఇట్లు తన్ను వికలాంగునిఁగా చేసినందులకు ఆతఁడు కోపగించి తల్లిని ఆమెసవతికిదాసియగునట్లు

శపించి, ఆశాపమును గరుడుఁడు మాన్పెను అని వెంటనేపలికి సూర్యునిరథముతోలుటకు వెళ్లెను నా॥ అరుణుఁడు భార్య శ్యేని కొడుకులు సంపాతి జటాయువు

అనేనస్సు (౧) ఆయువుయొక్క పుత్రుఁడు కొడుకు శుద్ధుఁడు తమ్ముఁడు నహుషుఁడు
(౨) ఇ॥ కకుస్థునికొడుకు నా॥ అనరణ్యుఁడు, సుయోధనుఁడు

అన్నంభట్టు ఈతఁడు తర్కసంగ్రహము అను ఒకగ్రంథమును చేసెను దానికి నీలకంఠదీక్షితులు వ్యాఖ్యానముచేసి ఉన్నారు

అన్నపూర్ణ కాశియందు ఉండువిశ్వేశ్వరుని భార్య

అపభ్రంశము గొల్లలు మొదలగువారు మాటలాడు ప్రాకృతభాషాభేదము

అపర్ణ పార్వతి ఈమె ఆకులుగూడ భుజింపక అనేకవేలసంవత్సరములు రుద్రునికూర్చి తపము ఆచరించినందున ఈమెకు ఈపేరు కలిగెను

అప్పకవి ఇతఁడు నన్నయభట్టీయమును అనుసరించి విరివిగా తెనుఁగు వ్యాకరణమును పద్యకావ్యముగా రచించెను ఇతఁడుశాలివాహనశకము ౧౬ శతాబ్దమున కృష్ణాతీరమునందలి కామెపల్లియందు ఉండెను

అప్పాజి ఈతఁడు కృష్ణదేవరాయలమంత్రి తిరుపతిసమీపమున వసించి ఉన్నట్లు తెలియును ఇతఁడు బాల్యముననే తలిదండ్రులను పోఁగొట్టుకొని నిరాధారుఁడై ఎచ్చటనైన భుజించుచు ఇచ్చవచ్చినచోట పవళించుచు పసులగాపరులనుగూడి కాలంబు కడపుచు విద్యాభ్యాసము ఎఱుంగక సంచరించుచు ఉండెను అట్టియెడ ఒక్కనాడు అడవియందు పసులమేపి మిగులడస్సి ఒకచెట్టునీడను మయిమఱచినిద్రించుచు ఉండగా ప్రొద్దుతిరిగినందున ఆచెట్టునీడతొలంగి ఎండపడవేడిమిచే మెండుగ తాపంబుగలిగినను ఆతనికి మెలకువ రాదయ్యె అట్టిసమయంబున ఒకమహాసర్పము అచటికివచ్చి తనఫణంబువిచ్చి ఈచిన్నవాని ముఖమునకు ఎండ సెగ తగులకుండునటుల ఆచ్ఛాదించుకొని ఉండెను ఈవిచిత్రమును దారిపట్టిపోవు బాటసారులలో ఒకభట్రాజు చూచి ఆశ్చర్యపడి వీఁడు కొన్నాళ్లలోనే మహైశ్వర్యమును పడయును అనియెంచి వానిసమీపమునకువచ్చి చప్పుడుచేయగా సర్పంబుపాఱిపోయె అనంతరము ఆభట్రాజు అప్పాజి మేల్కొనువనుక సమీపమున ఉండి అతని కులగోత్రనామములను అప్పటిస్థితులను విచారించుకొని అయ్యా నీకు శీఘ్రకాలములో గొప్పదశ రాఁబోవుచున్నది, అట్టిసమయమున నన్నువిస్మృతినొందకుమీ, అనిచెప్పఁగా అతఁడు అద్భుతపడి నాకనఁగానేమి అదృష్టమనఁగానేమి వచ్చుటయనఁగా నేమి వినువారునవ్వరా అట్లయినకానిమ్ము పోయిరమ్ము అని చెప్పిపంపి తాను తనగ్రామంబునకు వెళ్లిపోయెను ఆవలకాలాంతరంబున అతఁడు రాజకీయోద్యోగీయులను అనుసరించి ఒకచిన్నయుద్యోగము సంపాదించుకొని క్రమక్రమముగ తనబుద్ధియుక్తులను ప్రకటింపఁజేసి తుదకు రాజమంత్రిత్వమును సంపాదించుకొనెను అనివాడుకొనెదరు

అప్రతిరథుఁడు పు॥ మతిసారుని మూఁడవకొడుకు కణ్వునితండ్రి

అప్రతిష్ఠము ఇది ఒకనరకము ఇందుసంఖ్యాతీతంబులగు ఘటీయంత్రములు ఉన్నవి వానిచేపాపులు అనేకసంవత్సరంబులు త్రిప్పంబడుచు రక్తమాంసంబులను క్రక్కుచు

౧౫ గు

అప్సరసలు దేవతాభేదము మేనక రంభ ఘృతాచి తిలోత్తమ మొదలగువారు అప్సరసలు కశ్యపునికి మునియందు పుట్టినట్లును పాలసముద్రమునందు పుట్టినట్లును చెప్పుదురు

అబ్బయామాత్యుఁడు ఆంధ్రకవులలో నొకఁడు ఇతఁడు అనిరుద్ధచరిత్రమును పురూరవశ్చరిత్రమును కూర్చెను

అబ్జజుఁడు (చూ) బ్రహ్మ

అబ్జుఁడు (౧) చంద్రుఁడు

(౨) ధన్వంతరి

సముద్రమునందుపుట్టినందున వీరికి ఈనామము కలిగెను.

అభయుఁడు ధర్మునికొడుకులలో ఒకఁడు

అభిజిత్తు య॥ చూ॥ నా॥ దవిద్యోతుఁడు

అభిధానచింతామణి జైనులసిద్ధాంతములకు ఒకనిఘంటువు ఇది హేమచంద్రునిచే వ్రాయఁబడినది

అభిధానరత్నమాల హలాయుధునిచే రచియింపఁబడిన ఒకనిఘంటువు

అభిమన్యుఁడు అర్జునునికి సుభద్రయందు చంద్రునియంశమున పుట్టినకొడుకు; విరటునికూఁతురు అగు ఉత్తరను పెండ్లాడెను ఈతఁడు భారతయుద్ధమునందు మూఁడవనాఁడు పద్మవ్యూహము భేదించి లోపలదూఱి యుద్ధముచేయ నవసరమున అసహాయుఁడైనందున అనేకశత్రువులచే ఏకకాలమున ఎదిరింపఁబడి చంపఁబడెను ఈతఁడు చనిపోయిన కాలమున భార్య గర్భిణిగనుండి ఆవల పరీక్షిత్తును కనెను.

అభిసారులు వీరు కాశ్మీరమునకు సమీపమున ఉండిన ఒకదేశపుకాఁపులు.

అభ్రముపు తూర్పుదిక్కున ఉండెడి ఆఁడేనుఁగు

అమరసింహుఁడు నామలింగానుశాసనము చేసిన ఒకజైనపండితుఁడు ఈతఁడు విక్రమార్కునికాలమున ఉండినట్లు తెలియఁబడుచున్నది

అమరనసూరన ఒక ఆంధ్రకవి ఈతఁడు కృష్ణదేవరాయల ప్రభుత్వ ప్రారంభమునందు ఉండినట్లు ఊహింపఁబడుచున్నది ఇతఁడు పింగలివంశస్థుఁడు ఇతఁడు రచించిన కావ్యములు రాఘవపాండవీయము కళాపూర్ణోదయము ప్రభావతీప్రద్యుమ్నము అనునవి అందు మొదటిది రాఘవపాండవుల చరిత్రములను శ్లేషభంగిచే చెప్పుచు సులభశైలిచే శోభిల్లుచు ఉన్నది రెండవది అతివిచిత్రమగు కానుకకల్పితకథచే కొనియాడఁదగి మృదుశైలియును కలిగి వఱలుచు ఉన్నది కడపటిది, మృదుపాకమును చక్కని స్వభావోక్తులును కలిగి వినువారివీనులకు తేనియలొలుకుచు ఉన్నది వెనుకటికవులలో ఇతఁడు సర్వతోముఖచాతుర్యుఁడు అనిచెప్పనొప్పును

అమరావతి దేవేంద్రునిరాజధాని

అమరుకము ఇది ఒకసంస్కృత శృంగారకావ్యము. కొందఱు దీనిని అమరుకకవి చేసినట్లు చెప్పుదురు మఱికొందఱు ఆదిశంకరులు సరస్వతీదేవిని జయించునిమిత్తము పరకాయప్రవేశము చేసి శృంగారశాస్త్రజ్ఞానము కనినపుడు ఈగ్రంథము చేసినట్లు చెప్పుదురు. ఇందు కొన్నిశ్లోకములు తెనిగింపఁబడియున్నవి

అమవసువు నా॥ విజయుఁడు. పురూరవుని కొడుకు

అమావాస్య పితృదినము చూ॥ అచ్ఛోద

అమిత్రాఖ్యుఁడు. ఇ॥ చూ॥ నా॥ బర్హిణాఖ్యుఁడు.

అమ్మిక చూ॥ నా॥ అంబిక పార్వతి

అమృతమథనము కృతయుగమున ఒకప్పుడు దేవతలును అసురులును కూడుకొని మంద రపర్వతము కవ్వముగాచేసి దానిక్రిందికి ఆధారముగ విష్ణువును ప్రార్థించి కూర్మము గానునిచి వాసుకిని కవ్వపుత్రాడుగా అమ ర్చి చిలికిరి అందు తొలుత విషముపుట్టి నాలుగుదిక్కుల నిప్పులుచల్లుచు వ్యాపింపఁ గా దాని రుద్రుఁడుమ్రింగి గొంతులోపల కదలకుండ నిలిపెను మఱియును అందు లక్ష్మి చంద్రుఁడు ఉచ్చైశ్శ్రవము కౌస్తుభ ము పారిజాతకల్పవృక్షములు కామధేనువు, అమృతమునుకమండలమునందు ఉంచికొ నిన వైద్యశాస్త్రగురువు అగుధన్వంతరియు, బయలువెడలివచ్చిరి ఇంతకుముందు ఒక ప్పుడు ఐరావతమును ఎక్కుకొని ఇంద్రుఁ డు పోవుచుండ, అతనికి ఐశ్వర్యప్రదాయక మయిన ఒకపూలదండను దుర్వాసుఁడు ఇయ్య, దానిని తగినట్లు గౌరవముగా ఇంద్రుఁడు పుచ్చుకొననందున, అతనికి కోప ముగలిగి ఇంద్రునకును దేవతలకును ఐశ్వర్య పదవితప్పిపోవునట్లు శపియించెను అందు మీఁద దైత్యులు దేవతలను బలహీనులుగ ఎ ఱింగి తొందరపెట్ట, దేవతలు పోయి విష్ణువుతో మొఱలిడిరి అపుడు విష్ణువు దేవతలకు బలముకలుగఁజేయుటకై పాలస ముద్రమును చిలికి అమృతము వారికిప్పించె ను, అని పురాణప్రసిద్ధము

అమృతాంశుఁడు చూ॥ చంద్రుఁడు ఈతనిదేహ ము అమృతస్వరూపమనియు, ఆయమృత మును కళలరూపముగ దేవతలుపానము చే యుదురనియు ప్రసిద్ధి

అయుతజిత్తు య॥ సహస్రజిత్తుతమ్ముఁడు

అయుతాయువు. (౧) కు॥ రథికునికొడుకు

(౨) సింధుద్వీపుని కొడుకు

బుతుపర్ణునితండ్రి నా॥ భంగాసురుఁడు.

అయోధ్య ఇది కోసలదేశమున సూర్యవంశ పురాజులకు రాజధాని ఇది సరయూనదీ తీరమున ఉండెను

అయోముఖి దండకారణ్యమందు ఉండిన ఒకరక్కసి లక్ష్మణుఁడు దీనిముక్కు చెవు లు స్తనములు గోసి పంపెను

అయోముఖుఁడు దనుపుత్రులలో ఒక్కఁడు

అయ్యలార్యుఁడు ఒక ఆంధ్రకవి ఇతఁడు భాస్కరకవికి మిత్రుఁడు భాస్కరరామా యణమున యుద్ధకాండశేషము ఇతనిచే తెనిఁగింపఁబడెను

అరజ శుక్రునికొమార్తె చూ॥ దండకార ణ్యము

అరిచ్ఛత్రము భారతయుద్ధమపుడు కురుసేన కు ఇది ఒకవిడిదల

అరిష్టనేమి (౧) ఇతఁడు ఒకప్రజాపతి, సగ రచక్రవర్తికి అనేకమోక్షధర్మములు ఉపదే శించెను అని ప్రసిద్ధి

(౨) మి॥ కురుజిత్తు కొడుకు

అరిష్టుఁడు (౧) దనుపుత్రుఁడు

(౨) వృషభరూపియైవచ్చి కృష్ణుని చే చంపఁబడిన ఒకయసురుఁడు

(౩) మిత్రునకు రేవతియందు పుట్టిన పెద్దకొడుకు

అరుంధతి (అరంజోతి) కర్దమునికూఁతురు వశిష్ఠునిభార్య మహాపతివ్రత కనుక ఇప్పటి కిని పెండ్లినాటిరాత్రి ఔపాసనానంతరము నక్షత్రరూపమున ఉండునీమెను పాతివ్రత్య నిష్ఠకై పెండ్లికొమార్తెకు చూపుదురు

అరుణాచలము పంచలింగక్షేత్రములలో ఒ క్కటి దీనినె తిరుణామలె అందురు

అరుణాశ్వుఁడు ఇ॥ బర్హిణాశ్వుని పెండెం కొడుకు

అరుణాస్పదము  ఆర్యావర్తమున వరుణాది [illegible] ఉండెడి యొకపట్టణము

అరుణి  దనుపుత్రుఁడు

అరుణుఁడు  (౧) దా॥ మురాసురునికొడుకు శ్రీకృష్ణునిచే చంపఁబడెను
(౨) అనూరుఁడు
(౩) సూర్యుఁడు

అర్యముఁడు  (౧) వ॥ మా॥ నా॥ ఋషుఁడు
(౨) సూర్యుఁడు
(౩) ఇంద్రుఁడు

అర్చి  పృథుచక్రవర్తిభార్య

అర్చికపర్వతము  వైదూర్యపర్వతమునకు నామాంతరము

అర్చిరాదిమార్గము  ఇది సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునకు పోవుమార్గము ఆమార్గము మొదట సూర్యలోకముగుండను ఆవల చంద్రలోకముగుండను ఆవల విద్యుల్లోకముగుండను ఉండును

అర్జుని  (౧) బాణాసురునికూఁతురు.
(౨) బాహుద అనునది

అర్జునుఁడు  (౧) కు॥ పాండుమహారాజునకును కుంతీదేవికిని దేవేంద్రప్రసాదమున పుట్టినకొడుకు, పాండవ మధ్యముఁడు, విలువిద్యయందు మిక్కిలి నేర్పరి ఇతఁడు భారతయుద్ధమునందు ఒకనాఁడు ఏఁడు అక్షౌహిణులబలమును చంపినట్లు చెప్పుదురు ఈతనికిధనువు గాండీవము, శంఖము దేవదత్తము, నరుఁడనుదేవర్షి భూభారనివృత్తికొఱకు అర్జునుఁడయి భూమియందు అవతరించినట్లుచెప్పుదురు ఇతనికి అర్జునుఁడు ఫల్గునుఁడు పార్థుఁడు కిరీటి శ్వేతవాహనుఁడు బీభత్సుఁడు విజయుఁడు కృష్ణుఁడు సవ్యసాచి ధనంజయుఁడు అని పదినామములు అర్జునుఁడు ద్రోణాచార్యునివద్ద విలువిద్యనే[illegible]ండుకాలమున ఆతనికొడుకు అగు అశ్వత్థామ [illegible] చీకటిలో అన్నము పెట్టవద్దని వంటవానికి [illegible] చేసి ఉండెను ఒకప్పుడు అర్జునుఁడు భోజనముచేయునవసరమున ఆకస్మికముగ గాలిచే దీపము ఆరిపోయెను అంత అర్జునుఁడు భోజనమునిలుపక భుజించి అభ్యాసమువలన విలువిద్యయు చీకటియందు సాధింపవచ్చును అనితలంచి అట్లే చీకటియందు విలువిద్యను సాధకము చేసెను పాండవులు అరణ్యవాసము చేయుచు ఉండుకాలమున అర్జునుఁడు పాశుపతాస్త్రమునకై రుద్రునింగూర్చి ఘోరతపంబు ఒనరించుచు ఉండఁగా, ఆయన కోరికను తీర్ప రుద్రుఁడు కిరాతవేషమును తాల్చికొని అతఁడు ఉండువనమునకు వచ్చి మూకుఁడు అనుదైత్యుని సూకరరూపమును తాల్చి చని అర్జునుని బాధింపుమనఁగా వాఁడు అట్లే చేసెను అప్పుడు అర్జునుఁడు ఆకిరాతవేషమును ధరించినరుద్రుఁడు వలదు వలదు అని చెప్పుచుండఁగా ఆమాటలు చెవిని పెట్టక వెంట బాణముసంధించి దానిని వేసెను అందులకు రుద్రుఁడు అలిగి అర్జునునితో కొంతసేపుపోరాడి అతనిసాహసమునకుమెచ్చి అతఁడు కోరిన పాశుపతాస్త్రమును ఇచ్చి చనియెను.

(౨) కృతవీర్యునికొడుకు చూ॥ కార్తవీర్యార్జునుఁడు

అర్ధనారీశ్వరి  శివునియర్ధాంగమును తానై కొన్న యీశ్వరి తొల్లి భృంగి అనుగణనాథుఁడు మోక్షాపేక్ష కలవాఁడై పార్వతిని విడిచి శివునకుమాత్రము సేవచేయుచుండఁగా పార్వతి భర్తయుం తన్ను అవమానించెను అని కోపించి శక్తిస్వరూపిణియై అతనిశరీరమునందలి రక్తమాంసముల పీల్చి మూర్ఛిల్ల చేసెను అదిచూచి భక్తపరాధీనుఁడు అగు [illegible] అనుగ్రహించి [illegible]

డాయుధమును ఊఁతకోలగా ఇచ్చి లేపెను అంతట పార్వతి దేవునికి భర్తునియందు కల ప్రేమ తనయందు లేకపోయెను కదా అని ఖిన్నురాలై కేదారము అను పుణ్యక్షేత్రమునందల గౌతముని యాశ్రమమునకు పోయి ఆయన యుపదేశమువలన అచ్చట ఆవిర్భవించి ఉండెడు కేదారేశ్వరుని ఉపాసించి ఆదేవునియనుగ్రహముచే సాక్షాత్కరించిన పెనిమిటిచే అర్ధాంగమును పొంది అర్ధనారీశ్వరి అయ్యెను

అర్ధనారీశ్వరుఁడు అర్ధదేహము స్త్రీరూపముగా కల ఈశ్వరుఁడు చూ॥ అర్ధనారీశ్వరి

అర్బుదపర్వతము ఇది ఆనర్తదేశములకు సమీపమున ఉండును ఇందుండుజనులు అర్బుదులు అనఁబడుదురు

అలంబస ఇక్ష్వాకువంశస్థుఁడైన తృణబిందుపుభార్య విశాలునితల్లి

అలంబసుఁడు (౧) రా॥ బకాసురునితమ్ముఁడు, ఘటోత్కచునిచే చంపఁబడెను

(౨) రా॥ జటాసురుని కొడుకు, ఘటోత్కచునిచే చంపఁబడెను

అలకనంద గంగాశాఖలలో ఒక్కటి

అలకాపురము కుబేరునిరాజధాని

అలర్కుఁడు కా॥ కువలయాశ్వుని కొడుకు మిక్కిలి ప్రసిద్ధికి ఎక్కినరాజు ఇతనికి దత్తాత్రేయుఁడు యోగమార్గమును ఉపదేశించెను కొడుకు సన్నతి

అల్లసానిపెద్దన ఒకగొప్పయాంధ్రకవి ఇతఁడు బల్లారి కడప జిల్లాలప్రాంతములయందు దూపాడు అనుదేశంబున దోరాళ అనుగ్రామము వాసస్థలముగా కలవాఁడు ఈయన శాలివాహనశకము ౧౪౩౦ సంవత్సరమున ఉద్భవించినట్లు తెలియఁబడుచున్నది కృష్ణదేవరాయలవారి ఆస్థానపండితులు ఎనమండ్రలోను ఈతఁడు ఒక్కఁడు అయి ఉండినదికాక ఆరాజుచే ఆంధ్రకవితాపితామహుఁడు అనుబిరుదాంకము సహితము పడసెను. ఈతనికృతి స్వారోచిషమనుసంభవము ఇది మిక్కిలి ప్రౌఢకావ్యము

అవంతి ఉజ్జయినికి నామాంతరము

అవక్రీతుఁడు రు॥ భరద్వాజునికొడుకు ఇతఁడు గురుముఖముగ చదువక తపస్సుచేసి వేదములనేర్చి కడుగర్వితుఁడై రైభ్యుని కోపానలమున పుట్టిన రాక్షసునిచే చంపఁబడి రైభ్యపుత్రుండు అగు అర్వావసునిప్రార్థనచే దేవతలవలన పునర్జీవితుఁడు అయ్యెను

అవీక్షిత్తు కరంధమునికొడుకు, ఈతనిజననకాలమున లగ్నమునకు దుష్టగ్రహవీక్షణలేనందున ఇతనికి అవీక్షిత్తు అనుపేరుపెట్టిరి. ఈతనికొడుకు మరుత్తు అను చక్రవర్తి

అశన బలిభార్య, బాణాసురునితల్లి

అశోకవర్ధనుఁడు. చంద్రగుప్తుని పౌత్రుఁడు అగు మగధదేశపురాజు

అశోకుఁడు దశరథునిమంత్రులలో ఒక్కఁడు.

అశ్మకుఁడు. (౧) ఇ॥ ఇతనితండ్రి కల్మాషపాదుఁడు ఈతనితల్లి ఇతని ప్రసవింప ప్రయాసపడుచుండ వసిష్ఠుఁడు ఱాతితో గర్భముగీఁచి శిశువును బయట తీసినందున ఇతనికి అశ్మకుఁడు అనుపేరుకలిగెను కొడుకు మూలకుఁడు లేక నారీకవచుఁడు.

(౨) ఒక విప్రవరుఁడు, ఒకప్పుడు విదేహరాజు అగు జనకుఁడు బంధువియోగమున విషాదమునొంది గృహంబు తొఱంగి వెడలుచుఁడు అయ్యెను. అప్పుడు అతనికి ఈయశ్మకుఁడు సంసారస్వరూపము ఎఱింగించి ఆత్మతత్వము బోధించి స్వకర్మప్రవ

త్తనయందు అనురాగము పుట్టించెను అని ప్రసిద్ధి

అశ్వతీర్థము గంగతోడ కాల అనెడునది సంగమము అగుస్థానమున ఉండు నొకతీర్థము ఇది రుచికునకు సత్యవతిని ఇచ్చుటకయి గాధికోరిన వేయిహయములు ఉత్పత్తినైనచోటు కనుక దీనికి ఈపేరు కలిగెను

అశ్వత్థామ ద్రోణునికొడుకు ఇతనితల్లి కృపి ఇతఁడు చిరంజీవి, భారతయుద్ధమున కడపటినాటిరేయి పాండవులశిబిరము చొచ్చి నిద్రించువారలను అందఱను దయలేక హత్యచేసెను అందు ద్రౌపదీపుత్రులైన ఉపపాండవులు ఏవురు చచ్చిరి అందునిమిత్తము ఈతఁడు అర్జునునిచే వెనుక అవమానింపఁబడెను ఇతఁడు బాలవధ చేసినందులకై వ్యాసునిచే దుర్గంధ రక్త దిగ్ధ దేహుండు అగునట్లు శపింపఁబడెను పాండవులమీఁది క్రోధముచే ఇతఁడు లోకమునందు ఎక్కడ పాండవులు అనుపేరులేక ఉండునట్లు ఒక యస్త్రము ప్రయోగింపఁగా, అది ఉత్తరగర్భమందు ఉన్నయభిమన్యునికొడుకు అగు పరీక్షిత్తుని దహింపను ఆరంభించెను, అపుడు పరీక్షిత్తు నాశము ఒందకుండునట్లు శ్రీకృష్ణుఁడు రక్షించెను ఇతఁడు కామక్రోధాదుల యంశమున జనించినవాఁడు

అశ్వపతి (౧) మద్రదేశపురాజు ఇతఁడు సంతానకాంక్షచే పదునెనిమిది ఏండ్లు సావిత్రిని కొలిచి అద్దేవియనుగ్రహంబున సావిత్రి అనుకొమార్తెను పడసెను చూ॥ సావిత్రి

(౨) కేకయదేశపురాజు కూఁతురుకైకేయి కొడుకు యుధాజిత్తు

అశ్వసేనుఁడు, తక్షకునికొడుకు వీనిని ఖాండవదహన సమయమున చావకుండ దేవేంద్రుఁడు రక్షించెను. పిదప వీఁడు నాగాస్త్రమై కర్ణునిచే విడువఁబడి అర్జునుని కిరీటమును అపహరించి అర్జునునిచే చంపఁబడెను

అశ్వినీదేవతలు సూర్యుని కూఁతురు అగు బడబారూపమును ఒందిన సంజ్ఞాదేవియొక్క నాసికయందు పుట్టిన అమడలు వీరు దేవవైద్యులు అతిరూపవంతులు అని ప్రసిద్ధి

అష్టకాదులు అష్టకుఁడు ప్రతర్దనుఁడు వసుమనుఁడు ఔశీనరుఁడైనశిబి అను నలువురు, వీరు యయాతిదౌహిత్రులు, యయాతివలన అనేకనీతులను ఎఱింగిరి

అష్టకుఁడు విశ్వామిత్రునికొడుకులలో ఒక్కఁడు

అష్టగ్రామము మైసూరుసీమలోనుండు ఒక జిల్లా

అష్టదిక్పాలకులు ఇంద్రుఁడు తూర్పు: అగ్ని పూర్వదక్షిణము యముఁడు దక్షిణము: నిరృతి దక్షిణపశ్చిమము. వరుణుఁడు పడమర వాయువు పశ్చిమోత్తరము కుబేరుఁడు ఉత్తరము ఈశానుఁడు పూర్వోత్తరమును పాలించువారు

అష్టదిగ్గజములు ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము, అనుమగయేనుఁగులును; అభ్రముపు, కపిల, పింగళ, అనుపమ, తామ్రపర్ణి, శుభదంతి, అంగన, అంజనావతి, అను ఆఁడేనుఁగులును, క్రమముగా తూర్పుమొదలగు ఎనిమిది దిక్కులయందును ఉండును

అష్టపది ఇది జయదేవునిచే సంస్కృతమున రచింపఁబడిన గోవిందగీత కృష్ణలీలల గుఱించి చెప్పును నా॥ గీతగోవిందము

అష్టమూర్తులు బ్రహ్మయొక్క భ్రూమధ్యము నుండి వెలువడిన రుద్రునియొక్క రూపములు ఈ యష్టమూర్తులకు వేర్వేఱునామములును స్థానములును కలవు.

| నామము | స్థానము లేక-రూపము | భార్య | పుత్రుఁడు |
|---|---|---|---|
| భవుఁడు | జలము | ఉష | శుక్రుఁడు |
| శర్వుఁడు | మహి | సుకేశి | అంగారకుఁడు |
| ఈశానుఁడు | వాయువు | శివ | హనుమంతుఁడు |
| పశుపతి | వహ్ని | స్వాహా | స్కందుఁడు |
| భీముఁడు | ఆకాశము | దిశ | స్వర్గము |
| ఉగ్రుఁడు | స్వధర్మనిష్ఠుఁడైన బ్రాహ్మణుఁడు | దీక్ష | సంతానుఁడు |
| మహాదేవుఁడు | సోముఁడు | రోహిణి | బుధుఁడు |
| రుద్రుఁడు | సూర్యుఁడు | సువర్చల | శనైశ్చరుఁడు |

అష్టవసువులు (భారతమున చెప్పియుండు ప్రకారము) ప్రజాపతియొక్క కొడుకులు, వీరు, ధరుఁడు ధ్రువుఁడు సోముఁడు అహుఁడు అనిలుఁడు అగ్ని ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు అనునామములు కలవారు (ఇతర పురాణములప్రకారము) వీరు, దక్షప్రజాపతి కొమార్తెలలో పదుగురు ఐన ధర్మునిభార్యలలో ఒక్కరగు వసువునకు పుట్టిన యెనమండ్రు కొడుకులు భారతమున "ఆపుడు" అనువానికి బదులు "ధరుఁడు" అనియు, "దర్మఁడు" లేక అధ్వరుఁడు అనువానిబదులు అహుఁడు అనియు చెప్పి ఉన్నది వీరు ఒకప్పుడు వసిష్ఠునిహోమధేనువును అపహరించి అతనిచే శపింపఁబడి మర్త్యలోకమునందు మనుష్య స్త్రీరూపధారిణియై శంతనుని భార్యగానుండిన గంగాదేవికి జన్మించిరి అపుడు వారిలో మిక్కిలి అపరాధి అగు ప్రభాసుఁడు తక్కినయేడుగురి చతుర్థాంశమును పూని భీష్ముఁడు అనుపేర బహుకాలముజీవించి మహాశూరుఁడును ధర్మవేత్తయును అయి ఉండెను

అష్టావక్రుఁడు ఋ॥ ఏకపాదునికి సుజాతయందు పుట్టినకొడుకు ఇతఁడు గర్భమున ఉండుకాలమున అనవరతము శిష్యులచే వేదాధ్యయనము చేయించుచు ఉండ,తనతండ్రితో శిష్యులు నిద్రలేమింజేసి జడమతులై చదువు తప్పఁజదువుచున్నారు అనిన, తండ్రి కోపగించి నీవు అధ్యయనంబునకు వక్రముగా పలికితివి కావున అష్టవక్రుండవై జన్మింపుము అనికొడుకునకు శాపము ఇచ్చెను ఇతఁడు అతితేజస్వియును లోకపూజితుఁడును అయి ఉండెను ఈతని కురూపము చూచి ఒకప్పుడు రంభాద్యప్సరసలు నవ్వినందున, వారు దొంగలచే పట్టువడునట్లు శపింపఁబడిరి అది కారణముగ కృష్ణనిర్యాణానంతరము గోపికారూపులై ఉండిన అతని భార్యలు అగునప్సరసలు అర్జునునివెంట వచ్చునవసరమున దొంగలచే పట్టువడిరి

అసంగుఁడు యా॥ అక్రూరునితమ్ములలో ఒకఁడు

అసమంజసుఁడు. సగరునికిని సుకేశికిని పుట్టినకొడుకు కడుదుర్మార్గుండైనందున తండ్రిచే రాజ్యభ్రష్టుఁడుగ చేయఁబడియెను కొడుకు అంశుమంతుఁడు

అసి, కాశిప్రక్కను ప్రవహించునట్టి ఒకనది

అసిక్ని (౧) రెండవదక్షునిభార్య ఈమెకు అఱువండ్రు కొమార్తెలు.

(అ) ఏకానేకనామములు

అసితుఁడు ఒకపౌరాణికుఁడు

అసురులు / సురులు } అమృతములేనివారు దేవతలకు విరోధులు వీరు దైత్యులు లేక దానవులుగ ఉందురు దైత్యులు హిరణ్యాక్షుఁడు, హిరణ్యకశిపుఁడు, బలి, బాణాసురుఁడు, మొదలగువారు దానవులు శంబరుఁడు, తారకుఁడు, విప్రచిత్తి, నముచి, అంధకుఁడు, మొదలగువారు

అసిపత్రము ఇది వేయి యోజనముల వలయముగల ఒకనరకము అతితీక్ష్ణములు అగు సూర్యకిరణములును అగ్నికుండములును ఖడ్గములను పోలు పత్రములుకల వృక్షములును కలిగి ఉండును ఈనరకము అనుభవించువారు అక్కడి క్రూరమృగపక్ష్యాదులచే పీడింపఁబడి ఆయసిపత్రంబులచే తునుకలుగా చేయఁబడుదురు

అస్తి జరాసంధునికూఁతురు కంసుని పెద్ద భార్య

అస్తీకుఁడు జరత్కారునికి వాసుకి అను సర్పరాజుచెల్లెలయిన జరత్కారువునందు పుట్టినముని జనమేజయుని సర్పయాగమున నుండి ఉడిగించి తక్షకాదులను కాపాడెను తక్షకుఁడు జనమేజయుని సర్పయాగమునకు భయఁపడి (చూ పరీక్షిత్తు) ఇంద్రునియొద్దకు పోయి శరణువేడఁగా, అతఁడు తక్షకునికి అభయము ఒసంగి తన వద్ద ఉంచికొని ఉండెను అట్లయినను మంత్రబలము దైవబలమునుగూడ మించి ఉండును కనుక ఈసర్పయాగహోతల మంత్రములు హోమములోనికి ఇంద్రునితో కూడ తక్షకునిని ఈడ్చెను అపుడు అస్తీకుఁడు జనమేజయుని ప్రార్థించి తక్షకుని నిలిపెను

అస్త్రహృదయము సకలశత్రునాశమును జయశస్కరమును అయిన ఒకవిద్య ఇది రుద్రుఁడు స్వాయంభువునకు ఇచ్చినట్లను, అతఁడు వసిష్ఠునకు ఇచ్చినట్లను, అతఁడు చిత్రాయుధుఁడను ఒకగంధర్వునకు ఇచ్చినట్లను, అతఁడు తనదౌహిత్రి అగు మనోరమకు ఇయ్యఁగా ఆమె స్వరోచికి ఇచ్చినట్లును స్వారోచిష మనుసంభవమునందు చెప్పఁబడి ఉన్నది

అహంయాతి పూ॥ సంయాతికొడుకు భార్య కార్తవీర్యార్జునిచెల్లెలు అగు భానుమతి

అహల్య ఈమె ముద్గలునికూఁతురు, గౌతమమహర్షిభార్య దేవేంద్రునితో జారత్వము చేసినందున భర్త ఈమెను శిలయగునట్లు శపించెను తరువాత బహుకాలమునకు శ్రీరాముఁడు సీతనుపెండ్లాడుటకై మిథిలాపట్టణమునకు పోవుచుండి గౌతమాశ్రమము ప్రవేశించి ఆపాషాణమును మెట్టఁగానే ఆశాపము తీరెను

అహిక్షేత్రము ఉత్తరపాంచాలములకు రాజధాని

అహుఁడు అష్టవసువులలో ఒక్కఁడు ఇతనికొడుకు జ్యోతి విష్ణుపురాణమున అహుని ఒకవసువుగా చెప్పలేదు ఆపుని చెప్పి ఉన్నది అపునికొడుకులు, [illegible] శ్రముఁడు శ్రాంతి ధుని అని ఉన్నది

అహోబలపతి ఇతఁడు ఒకపండితుఁడు, ఆంధ్ర వ్యాకరణమునకు సవిస్తరముగా సంస్కృతభాషలో వ్యాఖ్యానము వ్రాసి ఉన్నాఁడు అది అహోబల పండితీయము అనియు కవిశిరోభూషణము అనియు చెప్పఁబడును

అక్షిత్రయము మీనాక్షి కామాక్షి విశాలాక్షి

అక్షుఁడు ర॥ రావణునికొడుకు, హనుమంతునిచే చంపఁబడెను

## ఆ

ఆంగిరసుఁడు చూ॥ బృహస్పతి

ఆంజనేయుఁడు చూ॥ నా॥ హనుమంతుఁడు

ఆంధ్రదేశము గోదావరీ కృష్ణానదులకు నడుమను ఉండు దేశము: దీనినే త్రిలింగ దేశము అందురు

ఆంధ్రభృత్యులు శూద్రకుని వంశస్థులయిన మగధదేశపురాజులు, వీరు శాలివాహన శక ప్రారంభమున నన్నూఱు సంవత్సరములు రాజ్యముచేసినట్లు తెలియఁబడుచున్నది వీరి యనంతరము ఆభీరులు గర్దభులు శకులు యవనులు మొదలైనవారు ఏలుచుండిరి

ఆంధ్రము ఆంధ్రదేశవ్యవహారభాష. దీనినే తెనుఁగు లేక తెలుఁగు అందురు ఈ భాష కణ్వమహర్షి మొదలగువారిచే ప్రవర్తితము ఐనది అని చెప్పుదురు

ఆంధ్రశబ్దచింతామణి. ఇది ఆంధ్ర భాషకు నన్నయ భట్టారకునిచే రచియింపఁబడిన వ్యాకరణము ఇది సంస్కృతభాషయందు ఉండును

ఆంధ్రులు ఆంధ్రదేశస్థులు పంచద్రావిడులలో ఒకతెగవారు

ఆంబికేయుఁడు చూ॥ ధృతరాష్ట్రుఁడు

ఆకూతి. (౧) సర్వతేజస్సునిభార్య, చక్షుర్మనువుతల్లి.

(౨) స్వాయంభువునకు శతరూపవలన పుట్టిన కొమార్తె. ఈమెయక్క ప్రసూతి. ఆకూతి, ప్రజాపతిని పెండ్లాడి అతనివలన యజ్ఞుఁడు అనుకుమారుని దక్షిణ అనుకూఁతును కనియెను

ఆగమములు ఈశ్వరప్రోక్తములు అయి విశేష ధర్మములను చెప్పునట్టి శాస్త్రములు. అవి శైవాగమములు, వైష్ణవాగమములు, అని రెండువిధములు కలవి. ఈయాగమములయందు ముఖ్యముగా దేవాలయాది ప్రతిష్ఠలును దేవార్చనాదిక్రమములును చెప్పఁబడుచున్నవి శైవాగమము "పాశుపతము" అని, వైష్ణవాగమములు "పాంచరాత్రము" "వైఖానసము" అని చెప్పంబడును

సోమకాసురుఁడు వేదములను సముద్రములోనికి ఎత్తికొని పోయిన యవసరమున విష్ణువు తనపూజార్థమై పూజావిధమును శాండిల్యఋషికి అయిదు రాత్రులలో ఉపదేశము చేసినందున ఆయాగమములకు పాంచరాత్రము అనుపేరు కలిగెను శైవాగమమునందు, శివుఁడు (పశుపతి) లోకులు తన్ను పూజచేయువిధమును పార్వతికి తెలియ చేసినట్లు చెప్పి ఉన్నది

ఆగ్నీధ్రుఁడు ప్రియవ్రతునికిని సుకన్యకును పుట్టిన పదుగురు కొడుకులలో పెద్దవాఁడు, ఇతనిభార్య పూర్వచిత్త (ఇతని సహోదరులనుగుఱించి చూ ॥ ప్రియవ్రతుఁడు ) ఇతనికి తనతండ్రి జంబూద్వీపమును ఇచ్చెను దానిని ఇతఁడు తనకొడుకులగు నాభి, కింపురుషుఁడు, హరి, ఇలావృతుఁడు, రమ్యుఁడు, హిరణ్మంతుఁడు, కురువు, భద్రాశ్వుఁడు, కేతుమాలుఁడు, అను తొమ్మండ్రకు పంచి ఇచ్చెను అదెట్లనిన నాభికి హిమవంతమునకు దక్షిణదేశము అగు భరతఖండము, కింపురుషునికి దానికి ఉత్తరమున హేమకూట పర్వతమునకు దక్షిణమున ఉండు ఖండము, హరికి హేమకూట పర్వతమునకు ఉత్తరమున నిషధపర్వతమునకు దక్షిణమున ఉండు నైషధము, ఇలావృతునికి నిషధపర్వతమునకు ఉత్తరమున మేరువును మధ్యప్రదేశముగాఁగల ఇలావృతము అను

ఖండము, రమ్యునికి ఇలావృతమునకును నీలాచలమునకును నడుమ ఉండు ఖండము, హిరణ్వంతునికి దానికి ఉత్తరమున శ్వేతపర్వతమునకు ఈవల ఉండు శ్వేతఖండము, కురువునకు శ్వేతపర్వతమునకు ఉత్తరమున శృంగవంతముచే చుట్టఁబడిన ఖండము, భద్రాశ్వునికి మేరువునకు తూర్పున ఉండు ఖండము, కేతుమాలునకు మేరువునకు పశ్చిమమున ఉండు ఖండమును ఇచ్చెను. ఇవియె నవఖండములు ఇవి నవవర్షములు అనియు అనఁబడును

ఆగ్నేయపురాణము. ఉపపురాణములో ఒకటి ఇది భృగుప్రోక్తము యజ్ఞాది అగ్నివిషయములు కలది దీనిగ్రంథసంఖ్య ౧౫౦౦౦

ఆచారకాండము ఇది విజ్ఞానేశ్వరీయము అనెడు ధర్మశాస్త్రములో ఒకకాండము ఇందు నాలుగువర్ణములవారును ఆచరింపవలసిన ధర్మములు చెప్పఁబడి ఉండును బ్రాహ్మణునకు యజనము యాజనము అధ్యయనము అధ్యాపనము దానము ప్రతిగ్రహము అను షట్కర్మములను నియమించి ఉండును క్షత్రియునకు ప్రజాపాలనము దానము యజ్ఞము వేదాధ్యయనమును ఏర్పఱిచి ఉండును వైశ్యునకు పశుపాలనము, దానము యజ్ఞము వేదాధ్యయనము, స్థలజలములయందు ధాన్యరత్నముల వ్యాపారము, ధనమును వడ్డిరూపమున పెంచుట, పైరుపెట్టుట అనునీయాఱు కర్మములు ఏర్పఱిచి ఉండును శూద్రునకు మీఁద చెప్పిన మూఁడువర్ణముల వారికిని శుశ్రూషచేయుట ముఖ్యమగు ధర్మముగా కావించి ఉండును వేదమంత్రములచేతను గర్భాధానమంత్రములచేతను సీమంతహోమముచేతను జాతకర్మము నామకరణము అన్నప్రాశనము చౌలము ఉపనయనము మొదలగు కర్మములచేతను ద్విజులకు మాతృ గర్భవాసాదిదోషములు తొలఁగును బొడ్డుకోయకమునుపు పురుషప్రజకు జాతకర్మము అను సంస్కారము చేయవలసినది (జాతకర్మము=పుట్టుకనుగూర్చి శిశువునకు చేయునొకసిద్ధి) బిడ్డపుట్టిన పదియవనాఁడుగాని పండ్రెండవనాఁడుగాని పుణ్యతిథియందు సుముహూర్తమున సునక్షత్రమున నామకరణము చేయవలయును నాలవమాసమున శిశువునకు సూర్యదర్శనము చేయింపవలయును ఆఱవమాసమున అన్నప్రాశనము చేయింపవలయును ద్విజాదులకు పుట్టిన సంవత్సరముననైనను, మూఁడవ సంవత్సరముననైనను, వేదోక్తప్రకారము చౌలకర్మను చేయవలసినది (చౌలము=సిగను ఉంచుట) గర్భధారణము మొదలుకొని బ్రాహ్మణునకు ఎనిమిదవ సంవత్సరమునకు, క్షత్రియునకు పదునొకండవ సంవత్సరమునకు, వైశ్యునకు పండ్రెండవ సంవత్సరమునకు, ఉపనయనము చేయవలయును పైచెప్పిన కాలములయందు ఉపనయనము చేయ సరిపడనియెడల బ్రాహ్మణునకు పదియాఱేండ్లవఱకును, క్షత్రియునకు ఇరువది రెండు సంవత్సరములవఱకును, వైశ్యునకు ఇరువదినాలుగు సంవత్సరములవఱకును, ఉపనయనము రెండవపక్షమున చేయవచ్చును మొదటి మూఁడువర్ణములవారికి మీఁదచెప్పిన కాలములయందు ఉపనయనము చేయనియెడల వారు గాయత్రికి అర్హులుగాక వ్రాత్యులు అగుదురు, అట్టివారు వైదిక కార్యములకును ఉపయోగింపరు మఱియు అట్టివారితో ఇచ్చుకోలుపుచ్చుకోలు చేయతగదు

ఆణిమాండవ్యుఁడు చూ॥ నా॥ మాండవ్యుఁడు

ఆత్రేయుఁడు చూ॥ చంద్రుఁడు

ఆత్రేయులు అదితిసంతతివారు ఇది దేవతలకు నామాంతారము

ఆదిత్యహృదయము ఇది ఒకస్తోత్రవిశేషము దీనిని పఠించువారికి సూర్యానుగ్రహము కలుగును ఇది రావణుని చంపుటకై అగస్త్యులు రామునికి ఉపదేశించెను

ఆదిత్యుఁడు చూ॥ సూర్యుఁడు

ఆదిత్యులు అదితియందు కశ్యపప్రజాపతికి పుట్టినకొడుకులు వీరుపన్నిద్దఱు, ధాత, మిత్రుఁడు, అర్యముఁడు, శక్రుఁడు, వరుణుఁడు, అంశుమంతుఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, పూషుఁడు, సవిత, త్వష్ట, విష్ణువు వీరలలో విష్ణువు ఇంద్రుఁడు వీరు వైవస్వత మన్వంతరమున ఆదిత్యులుగా ఉండి చక్షుర్మన్వంతరమున తుషితులుగా ఉండునట్లు తెలియవచ్చుచున్నది కల్పాదియందు బ్రహ్మచేసృజింపఁబడిన జయులు అనఁబడు ఈపన్నిద్దఱు సృష్టియందు ఇచ్ఛలేక బ్రహ్మయాజ్ఞను అతిక్రమించినందున వీరుప్రతిమన్వంతరమున పుట్టునట్లు శపింపఁబడిరి ఈద్వాదశాదిత్య నామములు సూర్యునికి నామాంతరములై ఉండును

ఆదినాథుఁడు జైనగురువు, మొదటితీర్థకారుఁడు.

ఆదిశేషుఁడు కశ్యపప్రజాపతికిని కద్రువకును పుట్టిన పుత్రులలో జ్యేష్ఠుఁడు ఇతఁడు తన తల్లియైన కద్రువ వినతయెడల చేసినయక్రమమునకు ఓర్వ చాలక, (చూ॥ కద్రువ) గంధమాదనము బదరికాశ్రమము గోకర్ణము మొదలగు దివ్యక్షేత్రములయందు మహాతపమాచరింపఁగా బ్రహ్మ అతని సత్యనిష్ఠకును ధైర్యమునకును మెచ్చి భూభారమును వహించునట్టిశక్తిని ప్రసాదించి గరుడునితో సఖ్యముగలిగి ఉండుము అని చెప్పెను అతఁడు అట్లే చేయుచు ఉండెను మఱియు అతఁడు ఈశ్వరప్రసాదముచే విష్ణువునకు పానుపై వేయిపడగలతో భూమినిమోయుచు నాగులకు అందఱకు రాజై ఉండును ఇతనికి భృగుమహర్షి శాపమువలన బలరామావతారము కలిగెను

ఆధూర్తరజుఁడు కుశుని మూఁడవకొడుకు ధర్మారణ్యమును కట్టినవాఁడు ఇతనికొడుకు రాజర్షి ఐన గయుఁడు.

ఆనందగిరి శాలివాహనశకము తొమ్మిదవ శతాబ్దమునందు ఉండిన ఒకసంస్కృత గ్రంథకర్త ఇతఁడు శంకరదిగ్విజయమును వ్రాసెను ఇది తెనిఁగింపఁబడి ఉన్నది

ఆనకదుందుభి చూ॥ నా॥ వసుదేవుఁడు.

ఆనకుఁడు య॥ వసుదేవునితమ్ముఁడు

ఆనర్తము ఇది యవనసముద్రతీరమున ద్వారకకు సమీపమున ఉండు నొకదేశము. ఇందు శర్యాతికొడుకు అగు ఆనర్తుఁడు కుశస్థలి అనుపట్టణమును నిర్మించెను అతనిపేర ఈప్రాంతము ఆనర్తము అనఁబడెను

ఆనర్తుఁడు శర్యాతికొడుకు ఇతనికొమరుఁడు రైవతుఁడు. అతఁడు కుశస్థలి అనుపురమును నిర్మించెను

ఆనీకుఁడు య॥ వసుదేవునితమ్ముఁడు అగు అనీకుని రెండవకొడుకు.

ఆనగొంది ఋష్యమూకపర్వత సమీపమునందు ఉండునొకపట్టణము.

ఆపస్తంబుఁడు ఇతఁడు ఒకమహర్షి యజుర్వేదవిహిత కర్మములనుగుఱించి సూత్రము చేసెను అది ఆపస్తంబసూత్రము అనఁబడును

ఆపుఁడు అష్టవసువులలో ఒక్కఁడు చూ॥ వసువులు

ఆభీరము సింధునదికి పడమట ఆర్యావర్తముతో చేరికగా ఉండునొకదేశము

ఆభీరులు ఆభీరదేశస్థులు

ఆయతి మేరువుకొమార్తె మగఁడు ధాత కొడుకు మృకండుఁడు

ఆయువు పురూరవునికొడుకు, ఇతనిపుత్రులు నహుషుఁడు, క్షత్రవృద్ధుఁడు, రజి, రంభుఁడు, అనేనస్సు, అని అయిదుగురు

ఆయుష్మంతుఁడు ది॥ ప్రహ్లాదునికొడుకులలో ఒక్కఁడు

ఆరంజ్యోతి చూ॥ అరుంధతి

ఆరాధ్యులు లింగధారిబ్రాహ్మణులు చూ॥ బసవుఁడు వీరుబసవపురాణమును ప్రమాణముగా కొని వీరభద్రుని ఉపాసింతురు

ఆరుణి అయోదుఁడు అగు ధౌమ్యునిశిష్యుఁడు

ఆర్య పార్వతి.

ఆర్యభట్టు శాలివాహనశకము మూఁడవశతాబ్దమునందు ఉండిన ఒక గొప్పజ్యోతిష్కుఁడు

ఆర్యావర్తము హిమవద్వింధ్యమధ్యగత దేశము ఆర్యులు ఉండినతావు. పూర్వమునందలి భరతఖండపురాజులెల్ల ఇందే ఉండిరి

ఆర్యులు వేదములయందు చెప్పఁబడినవారు వీరుతొలుత సరస్వతీదృషద్వతీ నదులమధ్యప్రదేశమునందు ఉండి పిదప 'ఆర్యావర్తమునందు ఎల్లవ్యాపించిరి ఈదేశమునందలియాచారవ్యవహారములు అన్నియు వీరే కల్పించినవారు

ఆశౌచము ఇది రెండు తెఱఁగులు, జాతాశౌచము, మృతాశౌచము జాతాశౌచము సవృద్ధి పురుఁడు అనియుచెప్పుదురు బ్రాహ్మణులలో పితృాదిసపిండులు మృతులైరేని ఆశౌచము పదిదినములు, క్షత్రియులకు పంద్రెండుదినములు; వైశ్యులకు పదునైదు దినములు, శూద్రులకు ముప్పది దినములు చూడాకర్మవిహీనులు అగుశిశువులు మృతిపొందిన ఆశౌచము ఒకదినము, చూడాకర్మము ఒనర్చినపిదప ఆశౌచము మూఁడుదినములు త్రైవర్ణములవారు జాతాశౌచమును కూడ మృతాశౌచమువలెనే ఆచరింతురు మృతుఁడు యమపురమునకు నయింపఁబడెడి పంద్రెండుదినములవఱకు ప్రథమదివసము మొదలు పిండప్రదానము చేయవలయు అది వానికి పాథేయము అగును ఆపంద్రెండుదినములవఱకు వాఁడు మృతిపొందినస్థలమునుండి గృహపుత్రకళత్రాదులను వీక్షించుచు ఉండును. అట్టిస్థలమునందు ఉట్టికట్టి అందు పదిదినములవఱకు ప్రేతతృప్త్యర్థము ప్రత్యహము పాలు ఉంచవలయును పదునొకొండవదినమున పైశాచాదికబాధానివృత్త్యర్థము వృషోత్సర్జనము చేసి పదునొకండు బ్రాహ్మణులకు భోజనముపెట్టుదురు

ఆశ్రమములు. చూ॥ వర్ణాశ్రమములు

ఆశ్రితుఁడు దిష్యంతునిపౌత్రుఁడు ఇతనికి పాండ్యుఁడు చోళుఁడు కేరళుఁడు అనిమువ్వురుపుత్రులు వీరుప్రత్యేకవంశకర్తలై నిజనామములు వెలయ జనపదముల కావించిరి

ఆశ్వలాయనుఁడు ఇతఁడు ఒకమహర్షి ఋగ్వేదవిహితకర్మములను గుఱించి సూత్రములుచేసెను అది ఆశ్వలాయనసూత్రము అనఁబడు

ఆసవభాండేశ్వరుఁడు కాశియందలి యొక దేవత ఒకప్పుడు కాశివిశ్వేశ్వరుఁడు ఒక కల్లుకుండనుండి ప్రత్యక్షము అయి ఒక ఈడిగవానికి వానిభార్యకును మోక్షము ఇచ్చినట్లు చెప్పి ఉన్నది.

ఆహుకి దేవకునిమేనయత్త

ఆహుకుఁడు య॥ దేవకునితండ్రి

## ఇ

ఇందీవరాక్షుఁడు నలనాభుఁడు అనుగంధర్వరాజుకొడుకు వరూధినితమ్ముఁడు ఇతఁడు కపటోపాయముచే ఒకఋషియొద్ద ఆయుర్విద్యనేర్చుకొని గురువును పరిహసించినందున అతఁడు ఇతనిని అసురుఁడు అగునట్లు శపించెను ఆశాపము స్వరోచివలన వదలెను

ఇందుఁడు చూ॥ నా॥ (౧) చంద్రుఁడు
(౨) అతిచాంద్రుఁడు
శాశ్వతునికొడుకు

ఇందుమతి విదర్భరాజుకూఁతురు అజునిభార్య దశరథునితల్లి

ఇంద్రజి
ఇంద్రజిత్తు
ఇంద్రజితుఁడు } ర॥ రావణునికొడుకు అతిమాయావి పదునాలుగుసంవత్సరములు నిద్రాహారములులేనివారిచేతనే ఇతఁడు చంపఁబడునటులు వరమును పొందియుండెను కాన అట్లుయుండిన లక్ష్మణునిచే ఇతఁడు చంపఁబడియెను చూ॥ మేఘనాదుఁడు

ఇంద్రద్యుమ్నము ఒకానొకసరస్సు ఇది యింద్రద్యుమ్నుఁడు అను రాజుదానము చేసిన గోవులగొరిసెల త్రొక్కుడుచేత ఏర్పడినది ఇంద్రద్యుమ్నుఁడు ఇంద్రసదనమున ఉండఁగా బహుకాలమునకు ఆతని కీర్తి లోకమున మాసెను అంత అతనిని అమరులు భూమికి త్రోయఁగా అతఁడు మార్కండేయునిపాలికి చని నన్నెఱుంగవే అని అడుగఁగా అతఁడు తాను ఎఱుఁగననియు, తనకంటె పెద్దయయి హిమశృంగశైలవాసియయియుండు ప్రవాళకుండు అనుఘూకము ఎఱుంగవచ్చుననియు చెప్ప, అతనివద్దకు పోయిరి అంత అతఁడును తాను ఎఱుంగను అనఁగా ఆతనిప్రేరణచే ఈయింద్రద్యుమ్న సరస్సునందు ఉండిన నాళీకజంఘుఁడు అను ఒకబకముచెంతకు పోయి అతనిమూలముగ ఆకొలనియందుండు యుగంధరుఁడు అనుకచ్ఛపమును అడుగ అదికొంతసేపు తలఁచుకొని కన్నుఁగవయందు అశ్రుతతులు తొరఁగ "ఉ॥ అక్కట నేనెఱుంగనె మహాగుణభూషణునమ్మహాత్మున, న్నిక్కడఁ బెక్కుమాఱులనేక భయంబులఁ బొందుచుండఁగా, నక్కటికంబుతోడఁ దగనాతఁడు గైకొని కాచెఁగాదె పెం, పెక్కినయన్నరేశ్వరుని నెన్నటికిన్మఱువంగ వచ్చునే తే. అమ్మహాత్ముండు బహువిధయజ్ఞదక్షి, ణార్థముగ విప్రవరులకు నర్థినిచ్చు, గోగణంబుల గొరిజలగ్రాస్సియయ్యెఁ, గాదెయీసరోవరము జగన్నుతముగ" అని పలికెను ఇది జగన్నాథమునందు ఉండును

ఇంద్రద్యుమ్నుఁడు ఋషభుని పౌత్రుఁడు భరతునిపుత్రుఁడు అగుసుమతి కొడుకు ఇతఁడు ఒకనాఁడు కడునిష్ఠతో ఉండు వేళ అగస్త్యుఁడు అచ్చటికిరాఁగా అతనికి లేచి ప్రత్యుత్థానము ఒనరింపనందున అతఁడు ఇతనిని మత్తగజేంద్రుఁడు అగునట్లు శపియించె అట్లు గజమై సంచరించుచుండి ఒకదినము పిపాసాతురుఁడై ఒకకొలనిలోనికి నీరు త్రావ దిగఁగా అందు ఒకమకరిచే ముంగాళ్లు రెండుపట్టువడి నీటిలోనికీడ్వఁబడెను అంత ఆగజము పూర్వజన్మజ్ఞానముచే విష్ణుపరాయత్తచిత్తమై అతనిని నుతిచేయ అతఁడు తనచక్రముచే ఆమకరిని చంపి గజేంద్రుని కాపాడెను గజేంద్రుఁడును తనపూర్వరూపమును పొందెను

ఇంద్రప్రమితి రు॥ వ్యాసశిష్యుఁడు అగు పైలుని శిష్యుఁడు. ఇతఁడు ఋగ్వేదసంహితను చతుర్విధము కావించి, బాష్కలుఁడు

బోధ్యుఁడు యాజ్ఞవల్క్యుఁడు పరాశరుఁడు మాండూకేయుఁడు అగ్నిమతి అను వారికి ఉపదేశించెను

ఇంద్రప్రస్థము పాండవులకు రాజధాని ఢిల్లీ పట్టణమునకు కొంతదవ్వున ఉండును నా॥ ఖాండవప్రస్థము

ఇంద్రవతి గోదావరితో కలిసెడి ఒక ఉపనది

ఇంద్రవాహనుఁడు ఇ॥ చూ॥ కకుత్స్థుఁడు

ఇంద్రసేన (౧) మౌద్గల్యమహర్షి భార్య
(౨) చూ॥ ద్రౌపది
(౩) నలుని కూఁతురు

ఇంద్రసేనుఁడు (౧) నలునికొడుకు
(౨) ధర్మరాజు సారథి
(౩) నరి॥ శర్యునికొడుకు

ఇంద్రావరజుఁడు చూ॥ ఉపేంద్రుఁడు

ఇంద్రుఁడు దేవతలకురాజు పూర్వదిక్పాలకుఁడు ఇతఁడు కశ్యపప్రజాపతికిని అదితికిని పుట్టినకొడుకు ఈయనరాజధాని - అమరావతి, ఆయుధము - వజ్రము, భార్య - శచీదేవి, ఏనుఁగు - ఐరావతము, సభ - సుధర్మ, గుఱ్ఱము - ఉచ్చైశ్శ్రవము, సారథి - మాతలి, ఉద్యానవనము - నందనము, కొడుకు జయంతుఁడు

ఒకప్పుడు ఇంద్రునకు కీడుచేయతలంచి త్వష్ట మూఁడుతలలవానిని ఒక్కని సృజియించి విశ్వరూపనామధేయుంజేసి పంపఁగా అతఁడు ఇంద్రపదవికోరి ఘోరతపంబు చేయుచు ఉన్నదానికి భయంపడి ఇంద్రుఁడు అతనిని తెగఁజూచెను (ఈబ్రహ్మహత్యపాపమును ఇంద్రుఁడు ఒకవిషమవ్రతంబు ఆచరించి సముద్ర, తరు, ధరణీ, స్త్రీజనంబులయందు విభాగించి పెట్టెను అది సముద్రమందు నురుగు, చెట్లయందు బంక, భూమియందుచవుఁడు, స్త్రీలయందు రజస్సును, అయి ఉండు ) అంత త్వష్ట మిగుల అలిగి ఇంద్రుని మ్రింగజాలెడు వానిని ఒకయసురుని వృత్రుఁడనువాని పుట్టించి వానినితన తపోమహిమచే మహాతేజోవంతునిజేసి ఇంద్రునితో యుద్ధముచేయ పంపఁగా వాఁడు పోయి ఇంద్రుని మ్రింగెను అపుడు ఇంద్రుఁడు తనశరీరమును సంకుచితముగా చేసి వెడలివచ్చియు వానితేజస్సును చూచివెఱచి వృత్రునితోడ సఖ్యంబుకల్పింప ముని గణంబులను పంపెను అంత వృత్రుఁడును మునిజనంబులచే ఆర్ద్రింబైనదానను శుష్కంబైనదానను తరువునను పాషాణమునను అస్త్రశస్త్రంబులను దివంబునను నిశిని వధ్యుండు కాకుండునటుల వరముపొంది ఇంద్రునితో మిత్రభావంబును చెందియుండెను. పదపడి ఇంద్రుఁడు ఒకనాడు సంధ్యాకాలమున సముద్రతీరమున వృత్రునితోడ విహరించుచు ఉండునపుడు ఆర్ద్రమును శుష్కమును గాని సముద్రపునురుగును తనవజ్రాయుధమునందు చేర్చి తనకు సహాయముగ విష్ణువు అందుప్రవేశింపఁగా రేయును పగలునుగాని సంధ్యాసమయంబున ఆయసురుని చంపెను. అట్లు శత్రుసంహారము చేసినను అది కపటస్వభావంబున కావించినవధంబుగాన ఇంద్రునకు బ్రహ్మహత్యాపాతకంబు సంప్రాప్తంబై దేవరాజ్యమునకు అర్హుఁడు కాకపోయెను. అప్పుడు కొంతకాలము నహుషుఁడు ఇంద్రత్వమును పొంది దేవరాజ్యమును పాలించుచుండెను. పిమ్మట ఇంద్రుఁడు అశ్వమేధయాగముచేసి ఆబ్రహ్మహత్య పోఁగొట్టుకొని దేవరాజ్యాధిపత్యమును మరల పొందెను.

మఱియు ఇంద్రుఁడు గౌతమముని భార్యయయిన అహల్యతో జారత్వము చేసినందున గౌతమమహర్షి ఇంద్రునిదేహమున సహస్రయోనులు ఏర్పడునట్లును వృషణహీనుఁడు అగునట్లును శపియించెను అంత ఆ ఋషిని ఇంద్రుఁడు మిగులవేడికొనఁగా అతఁడు అనుగ్రహించి చూచువారికి ఆయోనులు కన్నులుగా అగపడునట్లు ప్రసాదించెను అది కారణముగ ఇతఁడు సహస్రాక్షుఁడు అనఁబరఁగె మఱియు దేవతలు ఇంద్రునకు నిర్గతములైన వృషణములకు బదులు మేషవృషణములను తెచ్చి అంటించిరి అని పురాణప్రసిద్ధి దీనినిబట్టియే ఏదేని తొందరపొసఁగినప్పుడు ఇదియేమి మేషాండము అనిజనులు వాడుదురు

తొల్లి పర్వతములకు అన్నిటికిని ఱెక్కలు కలిగి ఉండెను అనియు, వానివలన కలిగెడు బాధల సహింపఁజాలక ఇంద్రుఁడు ఆఱెక్కలను తెగఁగొట్టెను అనియు, పురాణ ప్రసిద్ధి కనుక ఇంద్రునకు గోత్రభిత్తు అను పేరు కలిగెను

చ్యవనుఁడు అశ్వినీదేవతలకు యజ్ఞభాగమును కల్పించినపుడు ఇంద్రుఁడు అతనిపై వజ్రాయుధము వేయఁబూనఁగా అది ఆ ఋషి తపోమహిమవలన ఇంద్రుని చేయి వదలదయెను కనుక ఇంద్రునికి దుశ్చ్యవనుఁడు అను పేరుకలిగెను ఈతఁడు వాస్తుశాస్త్రమునకు అధిదేవత

ఇతిహాసములు రామాయణభారతములు. ఇవి ఛందోబద్ధములయినను కావ్యనాటకాదులవలె కఠినశైలి కలవి కావు. ఇవి సాధువిధిరూపములుగాక చరిత్రములను చెప్పుచు మనుష్యులకు తెలివి పుట్టించుచు ఉన్నవి

ఇధ్మవాహుఁడు. ఋ॥ అగస్త్యునిపౌత్రుఁడు అగు తేజస్వి

ఇనుఁడు చూ॥ నా॥ సూర్యుఁడు

ఇల (౧) దక్షప్రజాపతి కూఁతురు కశ్యపునిభార్య

(౨) వైవస్వతమనువుకూఁతురు బుధుని భార్య పురూరవునితల్లి ఈపె వసిష్ఠుని ప్రయత్నంబున హరికరుణచే పురుషుండై సుద్యుమ్నుఁడు అనఁబరఁగెను చూ॥ సుద్యుమ్నుఁడు.

(౩) వసుదేవునిభార్య

ఇలబిల తృణబిందువునకు అలంబుసయందు పుట్టినకూఁతురు మగఁడు విశ్రవసుఁడు కొడుకుకుబేరుఁడు

ఇలావంతుఁడు అర్జునునకు ఉలూపియందు పుట్టినకొడుకు

ఇల్వలుఁడు విప్రచిత్తికిని సింహికకును పుట్టినదానవుఁడు వాతాపితమ్ముఁడు అగస్త్యునిచే భస్మమాయెను చూ॥ అగస్త్యుఁడు, వాతాపి

ఇషుమంతుఁడు య॥ వసుదేవునితమ్ముఁడైన దేవశ్రవసుని రెండవకొడుకు

ఇళ చూ॥ ఇల

ఇక్షుమతి ఒకానొకనది ఈనదిమీఁద కుశధ్వజుని రాజధాని అగుసాంకాశ్యపురి ఉండెను.

ఇక్ష్వాకువు ఇతఁడువైవస్వతమనువుకొడుకు ఇతనికి వికుక్షి, నిమి, దండకుఁడు, విశాలుఁడు, మొదలగు పుత్రులు అనేకులు పుట్టిరి

## ఈ

ఈశానుఁడు. (౧) శివునికినామాంతరము అష్టమూర్తులలో ఒక్కమూర్తి

(౨) అష్టదిక్పాలకులలో ఒక్కఁడు ఇతని దిక్కు పూర్వోత్తరము

ఈశ్వరరాజు కృష్ణదేవరాయని పితామహుఁడు

ఈశ్వరుఁడు సర్వాంతర్యామి అయినభగవంతుఁడు ఈపేరుసాధారణముగ సగుణబ్రహ్మ స్వరూపమును తెలియఁజేయును వైష్ణవులు విష్ణువునకు ఈశత్వము కలుగఁజెప్పుదురు అప్పుడు మోక్షస్థలము వైకుంఠము శైవులు శివునకు ఈశత్వము కలుగఁజెప్పుదురు అప్పుడు మోక్షస్థలము కైలాసము స్మార్తులు బ్రహ్మకు ఈశత్వము కలుగఁజెప్పుదురు అప్పుడు మోక్షస్థలము బ్రహ్మలోకము శాక్తేయులు శక్తికి కలుగఁజెప్పుదురు వీరిమోక్షలోకములు ఆయాయుపాసనాదేవతంబట్టి ఉండును

ఈశినుఁడు పు॥ నా॥ వైభ్యుఁడు

## ఉ

ఉగ్రశ్రవసుఁడు / ఉగ్రశ్రవుఁడు } రోమహర్షణుని కొడుకు సూతకులజుఁడు ఇతఁడు శౌనకాది మహర్షులకు సకలపురాణేతిహాసములు చెప్పినవాఁడు మఱియు ఇతఁడు నైమిశారణ్య వాసులగు మహామునులవలన బ్రహ్మాసనంబు పడసి పురాణములు చెప్పుచుండఁగా అచ్చటికి తీర్థయాత్రచేయుచు బలరాముఁడు వచ్చి తన్నుచూచి ప్రత్యుత్థానము చేయక కూర్చుండియున్న యాతనిపై కోపించి తనచేతి దర్భలతో గొంతుకోసి చంపి బ్రహ్మాసనస్థుఁడు అగుటచేత లేవకున్నవాఁడు కావున ఇతనిని చంపుట పాతకంబు ఇందులకు ప్రతిక్రియ విచారింపుము అని మునులు తన్ను వేఁడుకొనఁగా మరల బ్రదికించి వాని చే మన్ననవడసి చనియెను

ఉగ్రసేనుఁడు (౧) య॥ మథురాపురిరాజు దేవకుని అన్న కంసునితండ్రి చూ॥ కంసుఁడు

(౨) పు॥ అభిమన్యుని పౌత్రుఁడు జనమేజయుని తమ్ముఁడు

(౩) య॥ కృష్ణునివంశస్థుఁడు అగుసుబాహుపుకొడుకు

ఉగ్రాయుధుఁడు పు॥ కృతికొడుకు శంతనుని మరణానంతరము అతని భార్యయగు సత్యవతిని పరిగ్రహింపయత్నించి భీష్మునిచే చంపఁబడెను

ఉగ్రుఁడు శివునకునామాంతరము అష్టమూర్తులలో ఒక్కమూర్తి

ఉచ్చైశ్శ్రవము అమృతమథనమప్పుడు పాలసముద్రమునందు పుట్టినగుఱ్ఱము ఇంద్రవాహనము గుఱ్ఱములకు రాజు

ఉజ్జయిని / ఉజ్జిని } మాళవదేశమునకు ముఖ్యపట్టణము (ఉజ్జయిని=మిక్కిలి గెలుపు కలది) నా॥ అవంతి

దీనియందు మహాకాళేశ్వరుఁడు అను నామధేయముతో శివుఁడు ప్రసన్నుఁడై ఉన్నాఁడు అనియు ఇచ్చట ఒకమహాకాళి ఉండి కోరినవరములను దయచేయును అనియు ప్రసిద్ధి ఈపట్టణమున విక్రమార్కుఁడు మొదలగురాజులు ప్రభుత్వము చేసిరి

ఉతథ్యుఁడు అంగిరసుని కొడుకు బృహస్పతి సహోదరుఁడు భార్య మమత కొడుకు దీర్ఘతముఁడు ఉతథ్యునిభార్యయందు బృహస్పతికి భరద్వాజుఁడు పుట్టెను

ఉత్కచము ఇది ఒకపుణ్యతీర్థము ఇచట ధౌమ్యునిని పాండవులు పురోహితునిగా వరించిరి

ఉత్కలము పంచగౌడదేశములలో ఒక్కటి దీనిని ఓఢ్రదేశము అనియు అందురు

ఉత్కలుఁడు ధ్రువునిపెద్దకొడుకు బాల్యమునందే బ్రహ్మజ్ఞానము కలిగి రాజ్యము ఒల్లక వెళ్లిపోయెను ఇతనితమ్ముఁడు వత్సరుఁడు

ఉత్తముఁడు (౧) ఉత్తానపాదునికిని సురుచిని పుట్టినకొడుకు ఇతఁడు వేఁటాడ

పోయి ఒకయక్షునిచే చంపఁబడెను అప్పుడు ఇతనితల్లి ఆదుఃఖము తాళలేక అతని వెదకుచు పోయి మృతిపొందెను

(౨) మూఁడవమనువు

ఉత్తమోజుఁడు ద్రుపదునికొడుకు ధృష్టద్యుమ్నునితమ్ముఁడు భారతయుద్ధమునందు పదునెనిమిదవనాటి రాత్రి నిద్రించునప్పుడు అశ్వత్థామచే చంపఁబడెను

ఉత్తర విరాటరాజు కూఁతురు ఉత్తరునిచెల్లెలు అభిమన్యునిభార్య పరిక్షిత్తునితల్లి ఈమెకు అర్జునుఁడు అజ్ఞాతవాసమప్పుడు బృహన్నల అనునామముతో నాట్యము కఱపెను అశ్వత్థామ ప్రయోగించిన అపాండవాస్త్రము ఈమెగర్భమున ఉండినపిండమును హింసింపఁగా ఆవేదనను ఈమె సహింపనోపక సంకటపడుటనుచూచి కృష్ణుఁడు ఈమెగర్భము ప్రవేశించి యాపిండమును రక్షించెను కాన ఆబిడ్డకు పరిక్షిత్తు అనుపేరు కలిగెను

ఉత్తరగీత ఇది భారతమందలి ఒకభాగము. వేదాంతవిషయముగ ఉండును

ఉత్తరుఁడు మత్స్యదేశపురాజయిన విరాటమహారాజుకొడుకు పాండవుల అజ్ఞాతవాసకాలమున కౌరవులు పాండవులు విరాటరాజుపట్టణమునందు ఉందురు అనితలఁచి వారిని బయలుపఱచి మరల వనవాసమునకు పంపుటకై విరాటునకు విరోధి యగుసుశర్మను దక్షిణదిక్కున గోవులను పట్టుమని తాము ఉత్తరపుదిక్కున గోవులను పట్టఁగా అప్పుడు విరాటరాజు సమస్తసేనలతోడను దక్షిణ గోగ్రహణమునకై పోయియుండెను కాఁబట్టి ఉత్తరుఁడుమాత్రము పట్టణములో ఉండి తనకు తగిన సారథిచిక్కిన తాను కౌరవులను పోయి జయింతును అనెను అప్పుడు సైరంధ్రీవేషమున ఉండినద్రౌపది బృహన్నలసారథ్యము చక్కఁగా చేయును అనిచెప్పఁగా బృహన్నలయగు అర్జునుని సారథిగా చేసికొని పోవునప్పుడు కౌరవులసేనంజూచి ఉత్తరుఁడు భయపడి పరువిడ సాఁగెను అప్పుడు అర్జునుఁడు అతనికి ధైర్యముచెప్పి నిజరూపంబు ఎఱింగించి అతనిని సారథిగా చేసికొని కౌరవులతో యుద్ధముచేసి జయించెను

ఉత్తానపాదుఁడు స్వాయంభువు అనుమనువునకు శతరూపివలన పుట్టిన రెండవపుత్రుఁడు ఇతనికి సునీతి సురుచి అని ఇరువురు భార్యలు అందు సురుచిపై భర్తకు ప్రేమ అతిశయించి ఉండెను సునీతికి ధ్రువుఁడు అను కొమరుఁడును సురుచికి ఉత్తముఁడు అనుకొమరుఁడును కలిగిరి

ఉత్పలావతి సురాష్ట్రునిభార్య తామస మనువుతల్లి నిర్వృతచక్షుఁడు అను ఒక ఋషి శాపముచే మృగమై సురాష్ట్రుని స్పర్శమువలన గర్భము ధరించెను

ఉదంకుఁడు రు॥ పైలునిశిష్యుఁడు ఈతఁడు గురుభార్య నిమిత్తము పౌష్యమహారాజు భార్య కుండలములు తెచ్చునవసరమున తక్షకుఁడు అనునాగుఁడు దానిని అపహరించెను అంతట మిక్కిలి ప్రయాసపడి ఆ కుండలములను రాఁబట్టుకొనిపోయి గురుభార్యకు సమర్పించి తక్షకునివలని విరోధముచే జనమేజయునకు సర్ప యాగమునందు బుద్ధిపుట్టించెను. ఈతఁడు వేదునికిని శిష్యుఁడు.

ఉదక్సేనుఁడు బా॥ విష్వక్సేనుని కొడుకు

ఉదయగిరి (౧) చూ॥ ఋషగిరి

(౨) ఆంధ్రదేశమునందలి నెల్లూరిజిల్లాలో ఉండెడు ఒకకొండ దీనిపేరు

వను ఉండు గ్రామమునకును ఈపేరు చె
ల్లుచు ఉన్నది

ఉదయాశ్వుఁడు  అజాతశత్రుని పౌత్రుఁడు
శైశునాగులలో ఒక్కఁడగు మగధదేశపు
రాజు ఇతఁడు కుసుమపురము లేక పా
టలీపుత్రము అనంబడు పట్టణమును నిర్మిం
చెను

ఉద్దాలకుఁడు  (౧) రు|| నా|| ఉపమన్యుఁడు
ఇతనికి కంగురుభక్తికి అశ్వినీదేవతలు మె
చ్చి ఇతని గురువగు ధౌమ్యుని లోహదం
తునిఁగా ఉండినవానిని స్వర్ణదంతునిఁగ
చేసిరి ఇతని కొడుకు శ్వేతకేతుఁడు
తొల్లి స్త్రీలు నియమములేక తమపు
రుషులతోను పరపురుషులతోను సంగ
మము చేయుచు ఉండిరి అట్లుండఁగా
ఒకప్పుడు ఋతుస్నానము చేసియుండిన
ఇతని ధర్మపత్నిని ఒకముసలి బ్రాహ్మణుఁడు
పుత్రార్థియయి యాచింప శ్వేతకేతుఁడు
కోపగించుకొని అది ధర్మవిరుద్ధము అని
నిషేధించి అది మొదలు స్త్రీలు ఎన్నఁడు
ను పరపురుషులతో సంగమము చేయ కూ
డదు అని నియమము చేసెను

ఉద్ధవుఁడు  య|| (౧) బృహస్పతి శిష్యుఁడు
వసుదేవుని తమ్ముఁడైన దేవభాగునికొడుకు

(౨) సహుషుని కొడుకు

ఉన్మత్తుఁడు  మాల్యవంతుని కొడుకు

ఉపదానవి  వైశ్వానరుని కూఁతురు హిర
ణ్యాక్షుని భార్య.

ఉపదేవి  దేవకుని కూఁతురు వసుదేవుని
భార్య ఈమెకొడుకులు కల్పవృష్టి ప్రభృ
తులు పదుగురు

ఉపనందుఁడు  య|| వసుదేవునికి మదిరయందు
పుట్టిన కొడుకు. నందుని సహోదరుఁడు

ఉపనిషత్తులు  బ్రహ్మస్వరూపమును గుఱించి
చెప్పు వేదభాగములు ఇవి ౧౦౮ అందు
ఇప్పుడు ప్రసిద్ధముగ పఠింపఁ బడునవి —
ఈశావాస్యము, కేనము, కఠవల్లి, ప్రశ్న,
ముండకము, మాండూక్యము, తైత్తిరీయ
ము, ఐతరేయము, ఛాందోగ్యము, బృహ
దారణ్యము, అనునవి పది

ఉపప్లావ్యము  భారత యుద్ధమునకు ముందు
పాండవులు విడిదలచేసికొని యుండిన చో
టు ఇందుండునపుడే పాండవకౌరవులకు
రాయబారములు జరగెను

ఉపమన్యుఁడు  చూ|| నా|| ఉద్దాలకుఁడు

ఉపయాజుఁడు  ఇతఁడు గంగా కూలంబున
వానప్రస్థవృత్తిని ఉన్న ఒక విప్రుఁడు
యాజునితో కూడ ఇతఁడు ద్రుపదునిచే
యాగము చేయించెను.

ఉపశ్రుత్యధిదేవత  ఉపశ్రుతికి అధిష్ఠానమగు
దేవత (ఉపశ్రుతి — తాము తలఁచినకార్య
ముల సిద్ధ్యసిద్ధులకు సూచకముగా వినఁ
బడెడి ఆకస్మికపుమాట) ఈయుపశ్రు
త్యధిదేవత, దేవేంద్రుఁడు దేవపదభ్రష్టుత్వ
మును పొంది ఉండుకాలమున ఆతనిభార్య
యగు శచీదేవియొక్క సత్యతకు మెచ్చి
ఆమెను ఇంద్రునితోకూడ చేర్చెను

ఉపస్మృతులు  ఇవి పదునెనిమిది అవియన
కణ్వస్మృతి, కపిలస్మృతి, లోహితస్మృతి,
దేవలస్మృతి, కాత్యాయనస్మృతి, లోకా
క్షిస్మృతి, బుధస్మృతి, శాతాతపస్మృతి,
అత్రిస్మృతి, ప్రచేతస్స్మృతి, దక్షస్మృతి,
విష్ణుస్మృతి, వృద్ధవిష్ణుస్మృతి, వృద్ధమనుస్మృతి,
ధౌమ్యస్మృతి, నారదస్మృతి, పౌలస్త్య
స్మృతి, ఉత్తరాంగిరస్స్మృతి

ఉపేంద్రుఁడు  కశ్యపప్రజాపతియు అదితియు
శ్రీమహావిష్ణువు తమగర్భమున పుట్టవలయు

నని అనేకవేల సంవత్సరములు తపమాచ
రింపఁగా ఆతపమునకు మెచ్చి వారు కోరి
నట్లు వారిగర్భమునఁపుట్టిన విష్ణువునకు పేరు
చూ॥ నా॥ వామనుఁడు

ఉమాదేవి దక్షప్రజాపతి కూఁతురు రుద్రుని
భార్య చూ॥ పార్వతి, భద్రకాళి

ఉమాపతి రుద్రుఁడు

ఉరువల్కుఁడు య॥ వసుదేవునకు ఇళ
యందుపుట్టిన కొడుకు

ఉర్మిళ యమునిభార్య

ఉరుశ్రవుఁడు నరి॥ సత్యశ్రవుని కొడుకు

ఉలూకుఁడు (౧) ఇంద్రుఁడు

(౨) శకుని కొడుకు సహదే
వునిచే మృతి చెందెను వీఁడు కురుక్షేత్రం
బున కౌరవపాండవులు యుద్ధసన్నద్ధులయి
చేరినప్పుడు పాండవుల యొద్దకువచ్చి దు
ర్యోధనుఁడు చెప్పుమన్న మాటలు కొన్ని
చెప్పిపోయెను

ఉలూపి నాగకన్యక వాసుకి కూఁతురు
ఈమెయందు అర్జునుఁడు ఇలావంతుని
కనెను

ఉల్ముకుఁడు చక్షుర్మనువునకును నడ్వలకును
పుట్టిన కడపటికొడుకు, భార్య పుష్కరిణి
కొడుకులు అంగుఁడు సుమనసుఁడు
ఖ్యాతి క్రతువు అంగిరసుఁడు గయుఁడు

ఉశనుఁడు చూ॥ నా॥ శుక్రుఁడు

ఉశీనరుఁడు అ॥ మహామనుని పెద్దకొడుకు
శిబితండ్రి ఈతనిదేశము ఉశీనరదేశము
అనంబడును

ఉశేనస్సు వేదశిరునికొడుకు

ఉష బాణాసురునికూఁతురు అనిరుద్ధునిభార్య
ఈమె కృష్ణునిపౌత్రుఁడగు అనిరుద్ధుని కల
యందు చూచి తనచెలికత్తెయగు చిత్ర
రేఖగుండ అతనిని ఎఱిఁగి ఆచిత్రరేఖ తన
మాయచేత ఇతరులకు తెలియక ద్వారకకు
పోయి అంతఃపురమునందు శయనించియు
న్న అనిరుద్ధుని కొనిరాఁగా తండ్రికి తెలియ
క అతనిని కూడెను చూ॥ బాణాసురుఁడు

ఉషాపతి చూ॥ అనిరుద్ధుఁడు

## ఊ

ఊర్జ వసిష్ఠునిభార్య

ఊర్జస్వతి ప్రియవ్రతునికూఁతురు భార్గవుఁ
డగు శుక్రాచార్యునిభార్య దేవయానతల్లి

ఊర్జితుఁడు య॥ కార్తవీర్యార్జునుని కొడు
కగు శూరుఁడు

ఊర్మిళ జనకమహారాజుయొక్క ఔరసపుత్రి
లక్ష్మణునిభార్య ఈమె భర్తయగులక్ష్మణుఁ
డు తమ అన్నవెంట వనమునకు పోయి
మరల అయోధ్యకు వచ్చి చేరునంతవఱకు
ఇతర వ్యాపారములెల్ల మఱచి నిద్రించు
చుండెను అనియు, అంతకాలమును లక్ష్మ
ణుఁడు నిద్రలేక యుండెను అనియు ఇతి
హాసము

ఊర్వశి ఒకయప్సరస నరనారాయణులు
బదరికాశ్రమమున తపము ఆచరించునపు
డు దేవతాస్త్రీలు వారితపోభంగము చేయ
అచటికి రాఁగా ఆమహామునులు చలింపని
వారై రి అందు నారాయణుఁడు తమనిశ్చ
లత్వమును ఆనారీమణులకు తెలుపువాఁడై
తనయూరువు గీఱఁగా అందుండి రూపవతు
లగు ఊర్వశిమొదలగువారు అనేకులుపుట్టిరి
అప్పుడు దేవతాస్త్రీలు తమయత్నము జరగ
నేరదని తలఁచి ఊర్వశిని తమకు ముఖ్యురా
లినిగాఁజేసికొని తమలోకమునకు పోయిరి
అని భాగవతమునందు చెప్పఁబడి యున్నది
మఱియు అర్జునుఁడు శివుఁడు మొదలగు
దేవతలవలన పాశుపతము మొదలయిన

దివ్యాస్త్రములను పడసి దేవతలకు బాధకులుగా ఉండిన కాలకేయ నివాతకవచులను వధించుటకై దేవలోకమునకు పోయి ఉండు తఱిని ఊర్వశి ఇతని సంగమమును కోరి అందులకు ఇతఁడు ఇయ్యకొననందున ఇతనికి నపుంసకత్వము కలుగునట్లు శపియించెను అంత అది ఇంద్రుఁడు ఎఱిఁగి ఆశాపమును అర్జునుఁడు అజ్ఞాతవాసకాలమున అనుభవించునట్లును తదంతంబున శాపమోక్షము అగునట్లును అనుగ్రహించెను

ఊర్వుఁడు రు॥ ఇతఁడు అత్యుగ్రతపము ఆచరించు సమయమున నారదాది దేవర్షులును బ్రహ్మర్షులును వచ్చి ఇతనిని ఒకపుత్రుని పడయుము అనిన ఒక జెల్లుపోఁచను చేతపూని తన ఊరువును అగ్నియందు ఉనిచి మథించెను అందుండి జ్వాలామాలియగు సుతుఁడు ఒకఁడు ఉద్భవిల్లెను అంత బ్రహ్మప్రార్థనచే ఊర్వుఁడు పుత్రుని సముద్రమునందు బడబాముఖమున వసించునట్లును ఆ ఉదకము అతఁడు ఆహారముగ కొనునట్లును నియమించెను చూ॥ ఔర్వుఁడు.

## ఋ

ఋ అదితినామము

ఋచీకుఁడు ఔర్వుని కొడుకు విశ్వామిత్రుని సహోదరి అగు సత్యవతి మగఁడు ఇతనికి ముగ్గురు కొమరులు అందు జమదగ్ని జ్యేష్ఠుఁడు. ఒకప్పుడు హరిశ్చంద్రుఁడు తనయాగపశువును పోఁగొట్టుకొని దానికి బదులు నరపశువును తేఁగోరి ఈ ఋచీకుని యొద్దకువచ్చి అతనిపుత్రులలో మధ్యముఁడు అగు శునశ్శేఫుని వెలకు తీసికొని పోఁగా వాఁడు మార్గమున తన మేనమామ అగు విశ్వామిత్రుని చూచి అతనిని తన్ను కాపాడుము అని ప్రార్థింపఁగా అతఁడు తన మంత్రశక్తిచే హరిశ్చంద్రుని యజ్ఞము నెఱవేర్చి శునశ్శేఫుని రక్షించెను

ఋతేయువు పు॥ రౌద్రాశ్వుని జ్యేష్ఠపుత్రుఁడు అతిసారుని తండ్రి

ఋతధాముఁడు య॥ వసుదేవుని తమ్ముఁడు అగు ఆనకుని కొడుకు

ఋతధ్వజుఁడు కా॥ నా॥ ప్రతర్దనుఁడు.

ఋతవాక్కు రు॥ ఇతనికి రేవతీనక్షత్రము నాలవపాదమున పుత్రుఁడు జన్మించి ఆ పుత్రుఁడు దుష్టుఁడు అయ్యెను అందుకయి ఇతఁడు కోపగించి రేవతీనక్షత్రము పుడమియందు పడునట్లు శపించెను

ఋతుఁడు మి॥ విజయుని కొడుకు

ఋతుపర్ణుఁడు ఇ॥ అయుతాయువు కొడుకు సర్వకాముని తండ్రి ఈతనికి నలుఁడు అశ్వహృదయము అనువిద్యను ఉపదేశించి అక్షహృదయము అనువిద్యను పడసెను.

ఋభుఁడు బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు ఇతఁడు సనక సనందన సనత్సుజాత సనత్కుమారులతో కూడ పుట్టిన వాఁడు వీరలు ఐదుగురు సృష్టివిముఖులు ఐనందున బ్రహ్మ మరల మరీచ్యాదులను తొమ్మండ్రను పుట్టించెను ఇతనిని ఋషభుఁడు అనియు చెప్పుదురు

ఋభుక్షుఁడు చూ॥ ఇంద్రుఁడు

ఋశంకుఁడు య॥ నా॥ ధేరుశంకుఁడు.

ఋశ్యమూకము ఒకానొకకొండ. ఇందు సుగ్రీవుఁడు తన అన్న అగువాలిచే కిష్కింధనుండి తఱుమఁగొట్టఁబడి అతఁడు తన్ను వెదకి చంపును అను భీతిచే డాఁగి ఉండెను. ఇది కిష్కింధకు సమీపమున ఉండును వాలి ఒకశాపనిమిత్తమున ఈకొండ మీఁదికి రానివాఁడు అయ్యె చూ॥ వాలి

ఋశ్యశృంగుఁడు విభాండక ఋషికొడుకు ఇతఁడు తండ్రికి అతిభక్తితో శుశ్రూష చేయుచు లోకవ్యవహారమును ఒక్కటిని ఎఱుఁగక బ్రహ్మచర్యాశ్రమమున అడవియందు ఉండునపుడు, అంగదేశపు రాజు అగు రోమపాదుఁడు తనదేశము అనావృష్టిచే అవస్థచెంది ఉండుట మాన్పకోరి, ఋశ్యశృంగుఁడు ఉండుదేశమున అనావృష్టి ఉండదు అని పెద్దలవలన ఎఱింగి అతని కొందఱు విలాసినీ జనులగుండ తోడి తెప్పించి, అనావృష్టి మానఁగానే, అతనికి తనకూఁతును ఇచ్చి వివాహము చేసెను ఇతఁడు దశరథునిచే పుత్రకామేష్టి అను యాగము చేయించెను

ఋషగిరి మగధదేశమున వరాహపర్వతమునకు ఎదుట ఉండును

ఋషభుఁడు (౧) నాభికొడుకు ఇతనికి భరతుఁడు మొదలుగాఁగల నూఱుగురు కొడుకులు ఉండిరి ఋషభుఁడు విష్ణువుయొక్క అవతారము అందురు ఇతఁడు సదాచారులు అగు తన కుమారులకు లోకశాసనార్థము సమస్త ఆచారముల ఉపదేశించి భరతునికి పట్టముగట్టి తాను అవధూతయై అవసాన కాలంబున దేశంబుల తిరుగుచు ఉండెను ఇతఁడు పరమయోగ ధ్యానపరుఁడు అనియు పరమపురుషుండు అనియు పురాణములు పలుకును

(౨) ఉపరిచరవసువు వంశస్థుఁడు.

(౩) సుగ్రీవునిదండునందలి ఒకవానరుఁడు.

(౪) ఇంద్రునకు శచీదేవియందు పుట్టినరెండవకొడుకు జయంతుని తమ్ముఁడు.

(౫) ఋభునికినామాంతరము

ఋషికుల్య ఋషపర్వతమున ఉత్పత్తి అగు ఒక నది

ఋషిక } మహేంద్రపర్వతమునుండి వెలువడి
ఋషీక } గంజమువద్ద సముద్రసంగమము అయ్యెడు నది

ఋక్షుఁడు పు॥ అజమీఢుని మూఁడవకొడుకు ఇతనిపౌత్రుఁడు కురువు

(౨) పు॥ నా॥ అర్కుఁడు పురుజుని కొడుకు భర్మ్యాశ్వునితండ్రి

(౩) కు॥ దేవాతిధికొడుకు

## ఎ

ఎఱ్ఱాప్రెగడ ఒక గొప్ప ఆంధ్రకవి ఈయన నన్నయ భట్టారకునిచే తెనుఁగు కావింపఁబడి ఉండిన భారత ఆరణ్యపర్వము నందలి కొంతను పూర్తిచేసినది కాక హరివంశమును లక్ష్మీ నృసింహావతారము అను ఒక గ్రంథమును రచియించి ఉన్నాఁడు

## ఏ

ఏకచక్రపురము ఒక అగ్రహారము ఇది పాండవులు లాక్షాగృహదహనమప్పుడు చావు తప్పించుకొనిపోయి కుంతితో కూడ బ్రాహ్మణవేషము తాల్చి భిక్షుకవృత్తితో కొంతకాలము ఉండినచోటు ఇక్కడ ఉండునపుడు భీముఁడు బకాసురుని చంపెను ఆవల పాండవులు ద్రుపదపురంబునకు పోయి ద్రౌపదిని పెండ్లాడిరి ఈ తావున ఇపుడు ఏరా అనుపట్టణము ఉండును

ఏకచక్రుఁడు దనుపుత్రులలో ఒకఁడు

ఏకతుఁడు బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు

ఏకదంతుఁడు. చూ॥ నా॥ వినాయకుఁడు.

ఏకపాదుఁడు. రు॥ అష్టావక్రునితండ్రి

ఏకపింగుఁడు
ఏకపింగళుఁడు } చూ॥ కుబేరుఁడు

ఏకలుఁడు వసుదేవునితమ్ముఁడైన దేవశ్రవసునికొడుకు నిషాదులచే చంపఁబడెను

ఏకలవ్యుఁడు ఒకబోయవాఁడు వీఁడు ధనుర్విద్య అభ్యసింపఁ గోరి ద్రోణాచార్యులు సకలరాజకుమారులకును విలువిద్య నేర్పుటవిని అచ్చటికిపోయి తన్నును శిష్యునిఁగా చేసికొమ్మని ప్రార్థింపఁగా ఆయన నీవు నీచజాతియందు పుట్టినవాఁడవు విలువిద్యకు అర్హుఁడవుకావు అని పరిగ్రహింపకపోయెను అంతట వీఁడు ద్రోణాచార్యులవలె ఒకబొమ్మను చేసి పెట్టుకొని ఆబొమ్మను గురువుగా భావించి తనంతటనే అస్త్రవిద్య సర్వము నేర్చుకొనెను అది తెలిసి ద్రోణాచార్యులు వానికి అస్త్రవిద్య ప్రయోజకము కాకుండునట్లు వానికుడిచేతి బొటనవ్రేలిని గురుదక్షిణగా కొనియెను వీఁడు భారతయుద్ధమునకు ముందే కృష్ణునిచే చంపఁబడెను.

ఏకశిలానగరము ఒంటిమిట్ట అనెడి ఒక ఊరు ఇది బమ్మెరపోతరాజునకు జన్మభూమి అని చెప్పుదురు

ఏఱాప్రెగ్గడ. చూ॥ నా॥ ఎఱ్ఱాప్రెగడ

ఏలేశ్వరోపాధ్యాయులు. ఒక సంస్కృతకవి శ్రీశైలమునకు పశ్చిమభాగమందలి ఏలేశ్వరము అను గ్రామము ఈయన నివాసస్థానము కనుకనే ఈతనికి ఈపేరు కలిగెను చిన్నప్పుడే సకలశాస్త్రములు నేర్చి విద్యార్థులకు పాఠములు చెప్ప ఆరంభించినందున ఈయన మొదటిపేరు ఎవరికిని తెలియక పోయెను. మఱియు ఇతఁడు పదునాలుగు సంవత్సరముల ప్రాయమప్పుడే రాజసభలకు పోయి శాస్త్రప్రసంగముచేసి ప్రతిపక్షసిద్ధాంతములను అణఁచి స్వసిద్ధాంతమును స్థాపించెను గౌతమస్మృతికి దర్పణము అనెడు వ్యాఖ్యానమును తెనుఁగు దేశమును గుఱించిన భూగోళశాస్త్రము ఒకటియు ను ఈకవిచే రచియింపఁబడెను.

రానురాను యుగధర్మము వ్యాపించి వర్ణసాంకర్యంబు కలుగుచు ఉండఁగా ఆంధ్ర బ్రాహ్మణులను నాడులచే విభజించి భోజన ప్రతిభోజనములు తప్ప తక్కిన సంబంధ బాంధవ్యములు ఆయాయి నాడువారు వారిలోనే జరుపుకొనుచు ఉండునట్లు నియమించెను ఖాటనుండి వెలినాడు, వేగినాడు, ములికినాడు, కాసరనాడు, తెలగాణ్యులు అని ఐదు తరగతులు ఆయెను. (ఈవెలనాడు వేగిన్నాడు మొదలగుపేళ్లచే నూటునాడులు విభాగింపఁబడెను అని ఒక చరిత్రకారుఁడు వ్రాసీ ఉన్నాఁడు) అందు వెలినాటివారు వెలనాటివారు అనియు ములికినాటివారు మురికినాటివారు అనియు, ఇప్పుడు పేర్కొనంబడుచు ఉన్నారు.

కాలక్రమమున కొందఱు బ్రాహ్మణులు వైదిక వ్యాపారములను వదలి లౌకిక వ్యాపారములయందు ప్రవేశించిరి. వారిని నియోగులు అందురు మొట్టమొదట ఆనియోగుల సంఖ్య ఆఱువేలు అయినందున వారిని ఆఱువేల నియోగులు అందురు నియోగులకును వైదికులకును బాంధవ్యము కలుగనేరదు

## ఐ

ఐరావతము తూర్పుదిక్కునందలి యేనుఁగు. ఇది అమృతమథనమపుడు పాలసముద్రమునందు పుట్టినది. ఇంద్రుని వాహనము. ఏనుఁగులకు రాజు

ఐరావతి ఒకానొకయేఱు ఇది హిమవత్పర్వతంబునకు దక్షిణంబున ఉత్పత్తి

అయి చంద్రభాగతో సంగమము అగు చున్నది.

ఐలబిలుఁడు ఇలబిల కొడుకు చూ॥ కుబేరుఁడు.

## ఒ

ఒడ్డాది చూ॥ ఓఢ్రము

## ఓ

ఓఢ్రము ఉత్కలదేశము (Orissa) ఒరిసా ఉత్కలదేశపు భాష

ఓషధీశుఁడు చంద్రుఁడు

## ఔ

ఔశీనరులు ఉశీనరుని కొడుకు ఐన సృగుని వంశస్థులు

ఔర్వుఁడు (౧) ఊర్వునికొడుకు. చూ॥ ఊర్వుఁడు

(౨) చ్యవనునికి మనుకన్యక యందు పుట్టిన ఋషి ఇతనికి నూఱుగురు పుత్రులు అందు ఋచికుఁడు జ్యేష్ఠుఁడు

ఔశనసము ఇది ఉపపురాణములలో ఒక్కటి

## క

కంక. ఉగ్రసేనునికూఁతురు కంకునిభార్య

కంకణుఁడు. య॥ నిమ్రోచితమ్ముఁడు

కంకుఁడు (౧) య॥ వసుదేవునితమ్ముఁడు

(౨) అజ్ఞాతవాసకాలమున సన్యాసివేషము ధరించిన ధర్మరాజు ఉంచుకొనిన నామము.

(౩) సంపాతివంశస్థుఁడు అగు ఒక పక్షి రాజు

(౪) ఒకఋషి ఈతని భార్య ప్రమ్లోచ కూఁతురు మరీష.

(౫) యముఁడు.

కంచి కాంచీపట్టణము చూ॥ కాంచి

కంతుఁడు చూ॥ మన్మథుఁడు

కంజజుఁడు } చూ॥ బ్రహ్మ
కంజుఁడు }

కందరుఁడు సంపాతివంశస్థుఁడు అగు కంకుని తమ్ముఁడు

కందర్పుఁడు చూ॥ మన్మథుఁడు

కందుఁడు కుమారస్వామి

కంబళబర్హిషుఁడు య॥ అంధకునికొడుకు

కంస ఉగ్రసేనుని పెద్దకూఁతురు దేవభాగుని భార్య

కంసవతి ఉగ్రసేనుని రెండవకూఁతురు దేవశ్రవసునిభార్య

కంసారాతి కృష్ణుఁడు కంసుని చంపుటచే ఇతనికి ఈపేరు కలిగెను

కంసుఁడు య॥ ఉగ్రసేనునికొడుకు మధురాపురమునకురాజు శ్రీకృష్ణునిమేనమామ ఈతఁడు పూర్వజన్మమునందు కాలనేమి అను రాక్షసుఁడు కనుక ఈజన్మమందును ఆవాసనతప్పక దేవతలకు విరోధియై అనేకులను రాక్షసులను తోడుచేసికొని సాధువులను బాధించుచు ఉండును ఇట్లు ఉండి ఒకనాడు తనచెల్లెలు అగు దేవకీదేవిని వసుదేవునకు ఇచ్చి వివాహముచేసి ఆవధూవరులను రథముమీఁద కూర్చుండఁబెట్టుకొని తాను సారథియై మిక్కిలి ఉత్సాహముతో రథమును తోలుకొని పోవుచు, "నీచెల్లెలి యొక్క యెనిమిదవ కొడుకు నిన్ను చంపును" అను మాట ఒకటి చెవిని పడఁగానే మనసు చలింపఁగా, తటాలున రథమునుండి దిగి చెల్లెలు ఐన దేవకీదేవిని కొప్పుపట్టి ఈడ్చి నేలఁబడవేసి తలనఱికి చంపఁబోయెను అప్పుడు వసుదేవుఁడు బహువిధముల వేఁడుకోఁగా, చంపక విడిచి

పెట్టి అదినిమిత్తముగా దేవకీవసుదేవులకు సంకెళ్లువేసి కారాగృహమునందు ఉంచి దేవకి కన్నకొడుకులను ఎల్లను చంపుచువచ్చి, కడపట యోగమాయవల్ల కృష్ణుఁడు వ్రేపల్లెలో నందునియింటచేరి ఉన్న సమాచారము తెలిసి, అతని చంపుటకు ఎం. ప్రయత్నములుచేసి కడపట అతనిచేతనే చచ్చెను.

కకుత్స్థుఁడు ఇక్ష్వాకుని పౌత్రుఁడగు వికుక్షి కొడుకు ఇతఁడు విష్ణువుయొక్క అనుమతిచే వృషభరూపుఁడైన దేవేంద్రుని ప్రార్థనంబున అతనిమూఁపురము ఎక్కి రాక్షసులతో యుద్ధముచేసినందున ఇతనికి కకుత్స్థుఁడు అనియు ఇంద్రవాహనుఁడు అనియు పేళ్లు కలిగెను ఇతనికి పురంజయుఁడు అని నామాంతరము కలదు వికుక్షి ఇక్ష్వాకుకొడుకు అని కొన్నియెడల చెప్పి ఉంటినను వాల్మీకి రామాయణమునందు అతఁడు ఇక్ష్వాకు పుత్రుఁడైన కుక్షికొడుకు అని చెప్పి ఉన్నది మఱియు వికుక్షికొడుకు బాణుఁడు అనియు ఉన్నది అది కకుత్స్థునికి నామాంతరముగా ఉండవచ్చును

కకుద్మి అ॥ రైవతునికొడుకు ఈతఁడు తన కూఁతురు అగు రేవతికి భర్తను నిశ్చయింప కోరి బ్రహ్మసభకు ఆమెను తనతోఁడ పిలుచుకొనిపోయి అచట ముహూర్తమాత్రము ఆటపాటలు వినుచుండి అనంతరము బ్రహ్మను అడుగఁగా అతఁడు కకుద్మి తనలోకమునకు వచ్చి ఉన్న ముహూర్తకాలములో భూలోకమునందు నాలుగు యుగములు ఒండొండ ఇరువదియేడుమార్లు తిరిగెను, అని చెప్పి అప్పుడు ఆదిశేషుని అంశమున మనుష్యావతారము ఎత్తి ఉన్న శ్రీకృష్ణుని అన్న అగు బలరామునికి ఇమ్ము పొమ్ము అని చెప్పిపంపెను

కకుద్దేవి ధర్మునిభార్య దక్షప్రజాపతికూఁతురు

కకుభ ఓఢ్రదేశమునందు ఒకపర్వతము

కచుఁడు బృహస్పతికొమారుఁడు ఇతఁడు దేవతల ప్రార్థనచే శుక్రాచార్యులయొద్ద మృతసంజీవని (చచ్చినవారిని బ్రతికించునది) అను విద్యను గ్రహింప కోరి ఆతనియొద్దకుపోయి శిష్యత్వము వహించి ఉండు నవసరమున శుక్రాచార్యులును అతనికొమార్తె దేవయానియు ఇతనిమీఁద మిక్కిలి ప్రేమ కలిగి ఆదరించుచు ఉండిరి అది చూచి దానవులు సహింపను ఓపక ఒక్క దినము ఇతఁడు శుక్రాచార్యుల హోమధేనువును మేపుటకు అడవికిపోయి ఉండఁగా అచట పట్టివధించిరి. అంత దేవయాని కచుఁడు పోయినపోకడ తెలియక పోయెను అని విచారపడుచు ఉండఁగా శుక్రాచార్యులు యోగదృష్టిచే వాఁడు రాక్షసులచేత చంపఁబడుట తెలిసికొని మృతసంజీవనివలన వానిని సంజీవితునిగ చేసి తోడ్కొని వచ్చెను అందులకు దానవులు సహింపక మఱి ఒకతూరి అడవిని ఒంటిగా ఉండువేళ అతనిని చంపి కాల్చి భస్మముచేసి ఆభస్మమును సురయందు కలిపి శుక్రునికి త్రావనిచ్చిరి అంతట దేవయాని మహాదుఃఖితురాలై మరల శుక్రుని వేఁడిన అతఁడు తనదివ్యదృష్టివలన కచునికి ప్రాప్తించిన అవస్థ ఎఱింగి సురవలనకదా ఇంత పుట్టెను అని ఎంచి సురాపానము బ్రాహ్మణాదిజనులకు అందఱకు నిషిద్ధముగా విధించి తనగర్భమునందు ఉన్న కచుని మృతసంజీవనిచే మరల సంజీవితుని చేసి తనయుదరము భేదించుకొని అతఁడు వెలువడిరాను తన్ను పునర్జీవితుని చేయను, అనువుగా అతనికి మృతసంజీవని ఉపదేశము చేసెను అట్లు కచుండు శుక్రు

నివలన మృతసంజీవని పడసి అతనిగర్భము
వ్రచ్చుకొని బయిటవచ్చి మృతుండైన శుక్రు
ని సంజీవితుని చేసి అతనిని సంతోష పఱి
చెను అంత దేవయానియు మిగులసంత
సించెను ఆవల కొంతకాలమునకు వెనుక
కచుండు దేవలోకమునకు పోవువాఁడై శు
క్రుని వీడుకొని దేవయానికి తనప్రయాణ
యత్నమును తెలుపఁగా ఆమె అతనిని విడ
నాడ ఓర్వక తన్ను పెండ్లియాడుము అని
నిర్బంధించెను అతఁడు అది ధర్మవిరుద్ధ
ము అని అందులకు సమ్మతింపనందున దేవ
యాని కోపించి నాప్రయత్నమున నీకు లభిం
చిన మృతసంజీవని విద్య ఫలింపకపోవుగాక
అని శపించెను అంతట కచుండు నేను ధర్మ
మార్గము తప్పనివాఁడను కావున నీశాపము
న మృతసంజీవని నాకు పనిచేయకున్నను
నాచేత ఉపదేశము కొన్నవారికి పనిచేయు
ను, నీవు ధర్మవిరోధము తలఁచితివి కాఁ
బట్టి నిన్ను బ్రాహ్మణుఁడు పెండ్లియాడక
పోవునుగాక అని ప్రతిశాపము ఇచ్చెను
అది కారణముగా దేవయానికి క్షత్రి
యుఁడైన యయాతిని పెండ్లాడవలసి వ
చ్చెను కచునకు మృతసంజీవని ఫలింపక
తాను ఉపదేశము చేసినవారికి మాత్రము
ఫలించునట్లు అయ్యెను

కణాదుఁడు నా॥ గౌతముఁడు తర్కశా
స్త్రమును ఏర్పఱిచిన ఋషి

కణికుఁడు. శకునకు ఆప్తుఁడయిన మంత్రి.

కణ్వుఁడు రు॥ ఇతఁడు పూరు వంశస్థుఁడు
[illegible] అతిసారుని కొడుకు శకుంతల
పెంపుడు తండ్రి ఈతనివంశస్థులు కాణ్వా
యులు అనఁబడునట్టి బ్రాహ్మణులు అయిరి

(౨) మగధదేశపు రాజు అగు దేవభూతి
యొక్క మంత్రి. ఇతనికి నామాంతరము
వసుదేవుఁడు దేవభూతి సంగవ్యసనుఁడు
అయినందున అతని చంపి ఇతఁడు రాజు
ఆయెను ఈతనిపేర నలువురు నలువది
యయిదు సంవత్సరములు రాజ్యము చేసిరి

కటకపురి గజపతిరాజులకు ముఖ్యపట్టణము.

కదిరీపతి. ఒకానొక ఆంధ్రకవి ఇతఁడు
శుకసప్తతి అనుగ్రంథమును రచియించెను

కద్రువ కశ్యపుని భార్యలలో ఒకతె దక్షు
నికూఁతురు ఈమెయందు నాగకులము
పుట్టెను అందు ఆదిశేషువు జ్యేష్ఠుఁడు
వాసుకి, కర్కోటకుఁడు, తక్షకుఁడు ఐరా
వతుఁడు, ఏలాపుత్రుఁడు మొదలయిన
వారు ఇతరులు

ఒకదినము సాయంకాలమున కద్రువ
యు ఆమెసవతి వినతయు పాలసముద్ర
ముగట్టున విహరించుచు ఉండి అచ్చట మే
యుచు ఉండిన ఉచ్చైశ్రవమును చూచి
కద్రువ అక్కా ఈగుఱ్ఱము దేహము అం
తయు తెల్లఁగా ఉండియు తోఁకమాత్రము
నల్లగా ఉన్నది చూచితివా అని చెప్పెను
వాస్తవముగా తోఁకయు తెల్లగానే ఉన్నం
దున వినత అట్లులేదు నీవు చక్కగా చూ
డుము అని చెప్పెను అది విని కద్రువ అట
దూరమున ఉన్నది కనుక నీకు చక్కగా
తెలియలేదు దగ్గఱపోయిచూచి నల్లగా ఉం
డినయెడ నీవునాకు దాసివి అగుము, లేని
యెడ నేను నీకు దాసిని అయ్యెదను అని, పం
దెమువేసికొని అది అస్తమయ సమయము
గా ఉన్నందున మఱునాఁడు తెల్లవాఱి వచ్చి
చూచునట్లు నిష్కర్ష చేసికొనిరి. అనంత
రము కద్రువ తనకొడుకులవద్దకు పోయి
వారికి, తనకును వినతకును జరిగిన వాగ్వాద
మును పందెమువేసికొనుటను తెలియపఱిచి
మఱునటినాటి ఉదయమున తాను సముద్ర

తీరమునకు వచ్చువేళకు ఆగుజ్జము తోఁక నల్లగా ఉండునట్లు చేయవలయును అని వేఁడుకొనెను. అందుకు శేషుఁడు మొదలయిన కొందఱు అది అధర్మము అని ఆపనికి సమ్మతింపక పోఁగా సర్పములు అగ్నియు జనమేజయుని సర్పయాగమునందు పడి నశించునట్లు కద్రువ శపించెను శపింపఁగానే ఆశాపమునకు వెఱచి కర్కోటకుఁడు అనువాఁడు తల్లి ఇష్టప్రకారము చేసెను కనుక వినత కద్రువకు దాసి అయ్యెను ఈదాసీత్వమును గరుడుఁడు మాన్పెను (చూ॥ గరుడుఁడు) ఆదిశేషుఁడు మహాతపము ఆచరించి విష్ణుప్రసాదము పడసి అతనికి పాన్పై వేయిపడగలతో భూమిని మోయుచు ఉండును, వాసుకి రుద్రునికి భూషణము అయ్యెను

కన్నఁడు చూ॥ కృష్ణుఁడు

కన్నడము చూ॥ కర్ణాటకము

కన్య విదర్భుని భార్య ఈమెను జ్యామఘుఁడు తాను పెండ్లాడవలెనని కొనివచ్చి తన పుత్రునకు భార్యగా చేసెను

కన్యాకుబ్జము ఒకదేశము ఇది, కుశనాభుని నూఱుగురు కొమార్తెలు వాయు శాపముచే కుబ్జలు కాఁగా, వారిని బ్రహ్మదత్తు వివాహమై వారి కుబ్జత్వమును మాన్పి వారితోఁ గూడ ఉండిన ప్రదేశము చూ॥ కుశనాభుఁడు ఇది పంచగౌళ దేశములలో ఒక్కటి

కపాలమోచనము ఒక పుణ్య క్షేత్రము పూర్వము శ్రీరాములచేత చంపఁబడిన మహోదరుఁడు అను అసురునితలపునుక ఒకతపస్వికాలికి తగులుకొని పుచ్చరాకున్న అతఁడు వేదన పొందుచు ఆర్యుల ఉపదేశమున శుక్రుఁడు తపముచేసిన ఇచ్చోటికిరాఁగా ఆకపాలము విముక్తము అయ్యెను దానంజేసి దీనికి కపాల మోచనము అను పేరు కలిగెను

కపిల (౧) సింధునదితోకలియు ఒక ఉపనది

(౨) దక్షప్రజాపతి కూఁతురు కశ్యపుని భార్య గోవులతల్లి నా॥ సురభి

(3) పుండరీకము అను దిగ్గజముయొక్క భార్య

కపిలాశ్రమము ఇది గంగ సముద్రనితో సంగమము అగు ప్రదేశమున ఉండు సగర ద్వీపమున ఉండెను

కపిలాశ్వుఁడు ఇ॥ తండ్రి కువలయాశ్వుఁడు, లేక దుందుమారుడు కొడుకు దృఢాశ్వుఁడు

కపిలుఁడు రు॥ కర్దమ ప్రజాపతికిని దేవహూతికిని పుట్టిన ఋషి సాంఖ్యయోగ ప్రవర్తకుఁడు. ఈతని విష్ణుని అవతారము అందురు ఈతని కోపదృష్టిచే సగర చక్రవర్తి కొడుకులు అఱువదివేగురు భస్మము అయిరి

(౨) దనువుపుత్రులలో ఒకఁడు.

కపోతలోముఁడు య॥ విలోమతనయుని కొడుకు.

కబంధుఁడు (౧) ఒకరాక్షసుఁడు వీఁడు జంఘారహితుఁడు అయి యోజన దీర్ఘములు అగు బాహువులును ఉదరమునందు అణఁగిన ముఖమును కలిగి దండకారణ్యమున ఉండెను రామలక్ష్మణులు సీతను వెదుకుచు పోవు అవసరమున వారిని పట్టి మ్రింగ పోఁగా వారు వీనిబాహువులు తెగనఱకిరి అంతట వీఁడు ఒకగంధర్వుఁడు ఆయెను తొల్లి దనువు అను గంధర్వుఁడు తపోబలముచే చిరజీవిత్వమును కామ రూపిత్వమును పడసి క్రౌర్యపరుఁడు అయి ఉండఁగా వానికి స్థూలకేశుఁడు అను ఋషి

శాపముచే ఇట్టి రాక్షసరూపము ప్రాప్తము అయ్యెను అనంతరము మఱి ఒకప్పుడు వాఁడు ఇంద్రునితో సంగరము కోరి పోరునపుడు అతని వజ్రాయుధము పెట్టుచేత కంఠమును శిరమును కాళ్లను పొట్టలో పలికి అడఁగిపోయెను వాఁడే కబంధుఁడు అన పరఁగెను కాఁబట్టి రామలక్ష్మణులు తనబాహువులను తెగఁగొట్టఁగానే వీనికి శాప విమోచనము అయ్యెను

(౨) బాణాసురునిమంత్రి నా॥ కుంభాండుఁడు

కమలపాలిక నా॥ హిడింబ

కమలభవుఁడు బ్రహ్మ చూ॥ తోయజగర్భుఁడు

కయిక చూ॥ కైకేయి

కరంధముఁడు (౧) యయాతి పుత్రుఁడు అగు తుర్వసుని పౌత్రునికొడుకు ఈతనికి నామాంతరము బలాశ్వుఁడు. బలపరాక్రమవంతుఁడు అయి ఇతఁడు రాజ్యము ఏలుచుండఁగా మత్సరంబున పరరాజులు ఇతని పట్టణమును ముట్టడించిరి అప్పుడు ఇతఁడు అతి ఖిన్నుఁడు అయి ఏకాంతంబున చింతించుచు తనపాణిద్వయంబుచే వక్త్రనాసికంబుల మూసికొని ఉండఁగా ఇతని అంగుళమధ్యంబుననుండి వెడలిన ఉచ్ఛ్వాసంబున సంఖ్యాతీతబలంబులు పుట్టి శత్రువర్గంబుల జయించెను. ఈకారణంబున ఇతనికి కరంధముఁడు అను పేరుకలిగెను. ఇతని కొడుకు అవీక్షిత్తు.

కరంభి. య॥ శకునికొడుకు నా॥ కుంతి

కరతోయ వంగదేశము గుండ ప్రవహించునట్టి ఒకనది ఇది గౌరీవివాహకాలమున ఈశ్వరుని హస్తమువలన పుట్టినది కనుక దీనికి ఈనామము కలిగెను

కరూశము ఒకానొకదేశము చూ॥ మలద కరూశములు దీనికి మొట్టమొదటి రాజు ఇక్ష్వాకునితమ్ముఁడైన కరూశుఁడు

కరూశుఁడు వైవస్వతమనువు కొడుకులలో ఒక్కఁడు ఇక్ష్వాకుని తమ్ముఁడు. ఇతనివంశస్థులు కారూశులు అనఁబడుదురు

కర్కోటకుఁడు కద్రువపుత్త్రులలో ఒక్కఁడు వాసుకి తమ్ముఁడు అతి క్రూరుఁడు

కర్ణాటకము ద్రవిడాంధ్ర దేశముల నడుమను పశ్చిమపార్శ్వమునను ఉండుదేశము. ఈదేశపు బ్రాహ్మణులు కర్ణాటకులు అనఁబడుదురు వీరు పంచద్రావిళ్లలో ఒక్కరు వీరిభాష కర్ణాటము, కన్నడము అనఁబడును

కర్ణిక (౧) ఆనకునిభార్య
(౨) ఒక అప్సరస

కర్ణికారవనము మేరుతటంబున ఉండు ఒక వనము

కర్ణుఁడు కుంతి కన్యగా ఉండునప్పుడు సూర్య ప్రసాదమున పుట్టినకొడుకు చూ॥ కుంతి ఇతఁడు పుట్టినతోడనే కుంతి ఇతనిని దైవికముగా అప్పుడు దొరకిన ఒక మంజసయందు పెట్టి గంగలో వడవైచి తన యింటికి పోయెను అంతట సూతవంశోద్భవుఁడు అగు అతిరథుఁడు అను వాఁడు తనభార్య అగు రాధయు తానును గంగయందు జలక్రీడలు ఆడుచు ఉండి ఆమంజసను కనిపట్టి తెచ్చి తెఱచి చూచి అందు సూర్యునివలె వెలుఁగుచున్న బాలకుని చూచి బిడ్డలులేని మనకు దైవము ఈబిడ్డను ఒసంగెను అని అనుకొనుచు వానిని ఎత్తుకొని పోయి పెంచుకొనిరి అది కారణముగ కర్ణుఁడు సూతపుత్రుఁడు అనియు రాధేయుఁడు అనియు చెప్పఁబడును వీఁడు

సహజకర్ణ కుండలుఁడు అగుటవలన కర్ణుఁడు అనియు, వసువర్మధరుఁడు కావున వసుసేనుఁడు అనియు నామములు వడసెను (వసువు=బంగారు వర్మము=కవచము) మఱియు కర్ణుని పెంపుడు తండ్రి అగు సూతుఁడు అస్త్రవిద్యాభ్యాసమునకై రాజకుమారులకు ఎల్ల అస్త్రవిద్య కఱపుచు ఉన్న ద్రోణాచార్యులయొద్దకు పిలుచుకొని పోఁగా ఆయన బ్రాహ్మణులును క్షత్రియులును తక్కిన వారు అస్త్రవిద్యకు అర్హులుకారు పొమ్ము అనిచెప్పెను అంతట కర్ణుఁడు ఎట్లయిన అస్త్రవిద్య గ్రహింపవలెను అను తలఁపున బ్రాహ్మణవేషము వేసికొని పోయి పరశురాముని ఆశ్రయించి ఆయనవద్ద సాంగముగా అస్త్రవిద్య అభ్యసించి ద్రోణునికి ప్రియశిష్యుఁడు అగు అర్జునుని యెడల మత్సరము కలిగి ఉండెను కనుక దుర్యోధనుఁడు ఈతనిని తనకు పరమాప్తునిగా చేసికొని అంగదేశ రాజ్యాభిషిక్తునిఁగా చేసెను ఈతఁడు బ్రాహ్మణవేషముతో పరశురామునియొద్ద విలువిద్య నేర్చుకొనునపుడు ఆయన ఈదొంగతనమును తెలిసికొని తాను ఉపదేశించిన మహాస్త్రములు ఇతనికి ఆపత్కాలమున ఫలింపక పోవునట్లు శాపము ఇచ్చెను

ఇదిగాక కర్ణుఁడు విలువిద్య అభ్యసించువేళ ఒకనాడు ఒకబయల విలుసాదన చేయుచు ఉండఁగా ఒకబాణము అచ్చట మేయుచున్న ఒకబ్రాహ్మణుని ఆవుపెయ్య మీఁదపడి అది చచ్చెను. దానికి ఆబ్రాహ్మణుఁడు కోపించి కర్ణునికి సమరోద్రేకమున రథచక్రము పుడమిని క్రుంగునట్లును, ఏవీరుని మార్కొని గెలువ కోరి పోరునో ఆవీరునిచే అతఁడు చచ్చునట్లును శపించెను ఈతఁడు మహాదాత సూర్యప్రసాదమువలన పుట్టినప్పుడే తాను వడసి ఉండిన సహజ కవచ కుండలములను ఇంద్రుఁడు అర్జునునిమేలుకై బ్రాహ్మణవేషము తాల్చి వచ్చి తన్ను యాచింపఁగా అది తెలిసియు పెనుదీయక ఇచ్చివేసెను కనుకనే "అతిదానాద్ధతఃకర్ణః" అని అందురు

కర్దమప్రజాపతి బ్రహ్మచ్ఛాయయందుపుట్టినయతఁడు భార్య దేవహూతి కొడుకు కపిలుఁడు ఇతఁడు పులహుని కొడుకు అని కొందఱు అందురు

కర్మము (చూ జన్మము) కర్మములకు హేతువులు అహంకార మమకారములు అహంకారము అనఁగా దేహమందు ఆత్మ అను బుద్ధి మమకారము అనఁగా తనవిగాని వానియందు తనవి అనుబుద్ధి ఈ అహంకార మమకారములు "అవిద్య" అని చెప్పఁబడుచున్నవి గృహారామాదులకును ఆత్మకును సంబంధము ఏమియు లేదు అవి ఎల్ల దేహానుబంధములు అయినవి అట్టివానియందు అభిమానము ఉంచ కూడదు మఱియు సుఖదుఃఖములు పొందక సర్వోదాసీనులు అయి సర్వసముఁడు అయిన ఆపరమేశ్వరుని సేవించువారు మోహమును వదలి అతిశీఘ్రమున ఉత్తమపదము చెందుదురు అన్యకామ్యధర్మములయందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు అని వచియించుచు ఉండువారు విషమ ధర్మనిరతులు అయి క్షయింతురు స్థావర జంగమ ప్రాణిసమూహములందు సమము ఐన భాగవత ధర్మమున వర్తించువారు దేహి దేహస్వరూపములను ఎఱిఁగి నిరస్తాశులు అయి ఈశ్వరానుగ్రహము పడయుదురు

మోక్షము పొందుటకు భగవద్భక్తి ముఖ్యసాధనము. అది భగవత్కథలయందలి

శ్రద్ధ, భగవద్గుణ చేష్టితములను చెప్పుట, సర్వమును భగవదర్పణము చేయుట, ఇత్యాదులవలన జ్ఞాని కలుగదు మఱియు ఈశ్వరుఁడు ఎల్లభూతములయందు వర్తించుచు ఉన్నాఁడు అని ఎల్లభూతములను సమ్మానింపవలయును అట్టి భగవద్భక్తి కలుగుటకు కొన్ని ప్రతిబంధములు ఉన్నవి అవి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు వీని సముదాయమే అరిషడ్వర్గము అనఁబడును అది ఇంద్రియములను వశపఱుచుకొని విషయములకు ఈడ్చుచున్నది ఉదకములకు పల్లపు భూములందు ప్రవహించుట స్వభావము అయినట్లు, ఇంద్రియములకు దుర్విషయములయందు తిరుగుట సహజము విషయాసక్తులకు భగవద్భక్తి కలుగఁజాలదు. సహజముగ మనుష్యులు ఇంద్రియములకు లోపడుచున్నారు ఇంద్రియములు మనస్సును ఈడ్చుచున్నవి మనస్సు ఆత్మను చెఱుచుచున్నది అట్టి మనస్సును వశపఱచుకొనువాఁడే బుద్ధిమంతుఁడు జీవుఁడు అను రథికుఁడు మనస్సు అను కళ్లెముతో ఇంద్రియములు అను గుఱ్ఱములను స్వాధీనము చేసికొని విషయములు అనెడు విషపు భూములయందు పోనీక నిలిపెనేని తనకు కలుగఁగల హానిని తొలఁగించి తానుపొందవలసిన మోక్షము అను దేశమును చేరి సుఖపడవచ్చును. అట్టి మనోనిశ్చయము మతప్రమాణములయందలి విశ్వాసమువలన కాని మనుష్యునకు కలుగదు ఉమ ఉపవాసవ్రతశౌచశీలముఖ సంధ్యోపాసనాగ్నిక్రియా,జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేయఁజాల, చ్ఛపుభక్తిన్ హరిఁబుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమాధిపుఁ భావజ్ఞుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్ "

కలశభవుఁడు అగస్త్యుఁడు, వసిష్ఠుఁడు, ద్రోణాచార్యుఁడు ఈముగ్గురకును వీరిజనకుల రేతస్సులు కలశములయందు రక్షింపఁబడి అందు వీరు జన్మించినందున ఈనామము కలిగెను.

కలహకంటకి కాలకౌశికుని భార్య

కలి కలియుగాధిదేవత

కలియుగము ఒకయుగము దీనిపరిమితి ౪౩౨౦౦౦ సంవత్సరములకాలము చూ॥ యుగములు ఇది కృష్ణనిర్యాణము మొదలు గణింతురు ఈయుగమున జనులు తమోగుణయుక్తులు అయి రాగద్వేషసహితులును తపోవిరహితులును, క్షుద్రోగపీడితులును, దురాచారులును, అనృతవాదులును, కృతఘ్నులును, అల్పాయుష్కులును, దుఃఖపీడితులును అయి జన్మింతురు అని చెప్పఁబడి ఉన్నది

కల్క్యవతారము విష్ణువుయొక్క దశావతారములలో కడపటి అవతారము కలియుగాంతమున శంబళగ్రామమున విష్ణుని అంశముగల బ్రాహ్మణోత్తమునకు విష్ణుఁడు కల్క్యాత్మకుఁడు అయి జనియించి సంస్మరణమాత్రముననే వేదశాస్త్రములను అధిగమించి వసుమతియందలి అధర్మవర్తులను ఎల్లనాశముచేసి ధర్మము నిలుపును అని పురాణములయందు చెప్పఁబడి ఉన్నది

కల్బరిగ ఇది కృష్ణదేవరాయల శత్రువులు అగు ముసల్మానుల రాజధాని ఇది వాడుకయందు కలబరిగి అనఁబడును

కల్మాషపాదుఁడు ఇ॥ నా॥ మిత్రసహుఁడు. ఒకప్పుడు కల్మాషపాదుఁడు వేటకై వనమునకు ఏగి అచట ఒకరక్కసుని చంపఁగా వానితమ్ముఁడు ఇతనిపై మత్సరమున ఇతనియింట వంటవాని వేషముధరించి వ

సించి వసిష్ఠమునికి ఒక్కనాడు భోజనము పెట్టుసమయమున నరమాంసము వండి తెచ్చిపెట్టెను. అది చూచి ఆముని అలిగి రాజును రాక్షసుఁడవు కమ్ము అని శపించెను. అందుకు అతఁడు తనయందు దోషములేనిది తెలిసికొనక తనకు శాపము ఇచ్చెను అని ప్రతిశాపము ఇయ్య జలము ఎత్తెను. అది అతనిభార్య చూచి బ్రాహ్మణుఁడు కోపించినను మనము కోపించుట ధర్మము కాద అని రాజును ఉడిగించెను. అప్పుడు ఆతఁడు ఆజలమును ఎక్కడను చల్లను ఒల్లక తనపాదములపై విడుచుకొనెను. దానిచేత పాదములయందు కల్మషము కలిగి కల్మాషపాదుఁడు అనుపేరు పొందెను. అంతవసిష్ఠుఁడు కోపము చల్లాఱి అతనిని అనుగ్రహించి పండ్రెండు సంవత్సరములకు శాపమోక్షము అగునట్లు ప్రసాదించెను.

కల్మాషపాదుఁడు తనకు రాక్షసత్వము రాఁగానే వసిష్ఠుని జ్యేష్ఠపుత్రుఁడును పరాశరుని తండ్రియును అగుశక్తిని మ్రింగెను.

కొందఱు ఇతనికి ఈశాపము శక్తి ఇచ్చెను అని చెప్పెదరు.

కవి (౧) పు॥ ఋక్షయునికొడుకు. ఇతని వంశస్థులు బ్రాహ్మణులుయిరి.

(౨) ఇక్ష్వాకునితమ్ముఁడు వైవస్వతుని కడపటికొడుకు. ఈతఁడు బాల్యముననే వ్రతి చెందెను.

(3) శుక్రునితండ్రి చూ॥ శుక్రుఁడు.

కవ్వడి అర్జునుని నామము.

కశ్యపుఁడు (౧) ఒకప్రజాపతి. ఇతఁడు మరీచికి కళవలన పుట్టినవాఁడు. ఈయన దక్షప్రజాపతి కొమార్తెలలో పదుమువ్వురను, వైశ్వానరునికొమార్తెలలో ఇరువురను, వివాహము అయ్యెను. అందు

| దక్షప్రజాపతి కొమార్తెలు | సంతతి |
|---|---|
| దితి | దైత్యులు |
| అదితి | ఆదిత్యులు |
| దనువు | దానవులు |
| అనాయువు-లేక-అనఘ | సిద్ధులు |
| ప్రాధ | గంధర్వులు |
| ముని | అప్సరసలు, మౌనేయలు అనఁబడు గంధర్వులు అనియు అందురు |
| సురస | యక్షులు, రాక్షసులు. |
| ఇల | వృక్షలతాతృణజాతులు. |
| క్రోధవశ | పిశితాశనములైన సింహవ్యాఘ్రాది సర్వ మృగములు |
| తామ | శ్యేనగృధ్రాది పక్షిగణములు, అశ్వములు, ఉష్ట్రములు,గార్దభములు. |
| కపిల-లేక-సురభి. | గోగణము |
| వినత | అనూరుఁడు-గరుడుఁడు |
| కద్రువ | నాగులు |

వైశ్వానరుని కొమార్తెలు ఇరువురిలోను కాళయందు కాలకేయులును, పులోమయందు పౌలోములును, పుట్టిరి. వీరు కాక కశ్యపుని కొడుకులు ఇంకను కొందఱు కలరు. వారు, పర్వతుఁడు అను దేవఋషి, విభండకుఁడు అను బ్రహ్మఋషి.

(౨) రు ఇతఁడు పరశురాముని చే అశ్వమేధయాగమున భూమిని అంతయు దక్షిణగా కొని బ్రాహ్మణులకు

---

* ఇది విష్ణుపురాణమును భాగవతమును భారతమును సమన్వయముచేసి వ్రాయఁబడియెను

ఇచ్చెను ఈతని పేర భూమి కాశ్యపి అన
నెగడెను

(3) ఒక పౌరాణికుఁడు

(4) వసుదేవుని పురోహితుఁ
డు, ఈతనివలన పాండవజన్మమపుడు కుం
తియొద్దకు, భాగినేయుల నిమిత్తము వసు
దేవుఁడు రత్నభూషణములు ఇచ్చి పంపెను.

కళ కర్దమప్రజాపతికూఁతురు మరీచిభార్య
కశ్యపునితల్లి

కళావతి పారుఁడు అను ఋషికి పుంజిక
స్థల అను అప్సరసయందు పుట్టినకూఁతురు
ఈబిడయొక్క సౌందర్యమునకు మెచ్చి
పార్వతీదేవి ఈమెకు పద్మినీవిద్యను ఇచ్చె
ను ఆవిద్యవలన కోరిన సౌఖ్యములు
ఒడఁగూడును దానిని కళావతి స్వరోచికి
ఇచ్చి అతనిని వివాహము అయ్యెను

కళింగదేశము ఇది ఓఢ్రదేశమునకు దక్షిణ
మున కర్ణాటదేశమునకు ఉత్తరమున ఉం
డును

కళింగుఁడు ఆ బలిమూఁడవ కొడుకు కళిం
గదేశము ఇతని నామముచే పరఁగును

కహ్వుఁడు య కంసునితమ్ముఁడు

కచ్ఛదేశము ఇది ఇప్పుడు కచ్ఛ్ అనఁబ
డును.

కఱకంఠుఁడు. గరళకంఠుఁడు, రుద్రుఁడు.

## కా

కాంచనుఁడు పురూరవునిపుత్రుఁడు అగు
అమవసుపు పౌత్రుఁడు

కాంచి ఒక ప్రసిద్ధ పట్టణము ఇది కర్ణాటక
దేశమందలి ఒకదివ్యస్థలము ఇచట బ్రహ్మ
దేవుఁడు యాగముచేసి విష్ణువును ప్రత్య
క్షము చేసికొనెను అని చెప్పుదురు శివుఁ
డును ఇచట సాన్నిధ్యమును ఒంది, ఉన్నాఁ
డు అని ప్రసిద్ధి ఈపట్టణమునందు అనేక
గోపురములు ప్రాకారములు మండపము
లు మఠములు మొదలగునవి ఉన్నవి ఇది
చోళదేశాధిపతులకు ముఖ్యపట్టణము బహు
రమణీయముగ ఉండునది అని చిరకాల
మునుండి పేర్కొనఁబడినది

మఱియు ఇచట పంచలింగములలో ఒక
టి అగు పృథివిలింగము ఉండును ఇచ్చటి
శివమూర్తికి ఏకామ్రనాథుఁడు అని పేరు.

కాందిని అక్రూరుని తల్లి భ. శ్వఫల్కుఁడు

కాంపిల్యము పాంచాలదేశమందు ఒకభాగము
దానికి ముఖ్యపట్టణము కాంపిల్యపురి
అది ద్రుపదునికి రాజధాని

కాంపిల్యుఁడు. చూ భర్మ్యాశ్వునికొడుకు.

కాంభోజము భరతఖండముయొక్క వాయవ్య
దిగ్భాగము ఇందలి జనులు కాంభోజులు
అనఁబడుదురు

కాకమానిమూర్తి ఒకానొక ఆంధ్రకవి ఇ
తఁడు పాంచాలీపరిణయమును కల్పించెను

కాణ్వాయనులు చూ॥ కణ్వుఁడు.

కాత్యాయని పార్వతికి నామము

కాత్యాయనుఁడు (1) పాణినియొక్క వ్యా
కరణమునకు వార్తికము చేసిన వరరుచికి
నామాంతరము

(2) యాజ్ఞవల్క్య మ,
హర్షికి నామాంతరము

కాదంబరి బాణునిచే విరచితము, అయిన
ఒక సంస్కృత వచనకావ్యము.

కాపత్యుఁడు పారియాత్రాచలమున ఉండి
న ఒకబోయ, వీఁడు మహాధర్మగుణసంప
న్నుఁడు అని ప్రసిద్ధి

కాపాలికము ఒకానొకమతము. ఈమత
ము ఈశ్వరునికిని జగత్తుకును భేదాభేద

ములను ప్రతిపాదించును ఈమతస్థులకు నరాస్థిమాలాధారణ, శ్మశానవాసము, నరకపాల భోజనము, మొదలగు కృత్యములు కలవు

కాపిలము (౧)ఒకమతము ఇది కపిలమహర్షిచే ఏర్పఱుపఁబడినది దీనికి ఆధారము కాపిలసూత్రము ఇందు ప్రకృతి జగత్సృష్టికి కారణము అనియు పురుషుఁడు నిర్లిప్తుఁడు అనియు నిరూపింపఁబడి ఉండును

(౨) ఉపపురాణములలో ఒకటి

కామందకము రాజనీతినిగూర్చి చెప్పెడి ఒక గ్రంథము

కామధేనువు నా॥ సురభి పాలసముద్రమునందు పుట్టెను కోరిన వస్తువులను ఇచ్చును అని ప్రసిద్ధి ఈమెసంతతి గోగణము

కామరూపము ఆర్యావర్తమునకు ఆగ్నేయదిక్కున ఉండు ఒకదేశము

కామాక్షి కాంచీపురమునందలి దేవి

కాముఁడు. ధర్మునికి శ్రద్ధ (లేక సంకల్ప) యందుపుట్టిన కొడుకు భార్య రతి మన్మథునకు నామాంతరముగాను చెప్పుదురు

కామ్యకము ఒకానొకవనము ఇందు పాండవులు అరణ్యవాసమున మొట్టమొదట నివసించి ఉండిరి ఇది కురుజాంగలములయందు ఉండును

కారూశవంశము వైవస్వతమనువు కొడుకులలో ఒకఁడు అయిన కరూశునివలన పుట్టిన వంశము ఈవంశస్థులు ధర్మముతోడి క్షత్రియమ్మున బ్రాహ్మణులు అయి ఉత్తరాపథమునకు రక్షకులు అయిరి.

కార్కోటలను గోదావరీ తీరమందు ఉండెడు ఒక పట్టణము. అచ్చోట ఉండు శివునికి కర్కోటకేశ్వరుఁడు అని పేరు.

కార్తవీర్యార్జునుఁడు య॥ హైహయ వంశజాతుఁడు అగు ఒకరాజు ఇతని పేరు అర్జునుఁడు అయినను కృతవీర్యునికొడుకు కనుక ఇతనిని కార్తవీర్యార్జునుఁడు అందురు వీనిరాజధాని వింధ్యపర్వతమునకు దక్షిణమున పాఱునట్టి నర్మదా నదీతీరమున ఉండు మాహిష్మతీపురము ఇతఁడు యదువుయొక్క పెద్దకొడుకు అగు సహస్రజిత్తు వంశస్థుఁడు ఒకప్పుడు ఇతనిపరాక్రమమును రావణాసురుఁడు విని ఇతనితో పోరకోరి మాహిష్మతికి వచ్చెను ఆదినమున ఇతఁడు వనవిహారార్థము పోయి ఉండఁగా పురజనుల వలన ఆవృత్తాంతము విని తన రాక తెలిసి అర్జునుఁడు దాఁగెను అని నవ్వుచు పోయి వింధ్యారణ్యమునందు విహరించుచు కొంతసేపటికి నర్మద ఒడ్డునకు వచ్చి అచ్చట శివపూజ కావించుచు ఉండెను అప్పుడు స్త్రీలతోడ జలక్రీడలు ఆడుచున్న కార్తవీర్యార్జునుని వేయి చేతుల చేతను అడ్డగింపఁబడి ఎగదట్టిన నర్మదా నదీప్రవాహమున తనపూజాద్రవ్యములు ఎల్ల కొట్టుకొని పోయెను. అందుకు కారణము మంత్రులచేత తెలిసికొని రావణుఁడు అతఁడు ఉండిన కడకు పోయి అతనితో పోరాడి పట్టువడి చెఱను ఉంచఁబడెను ఆ వృత్తాంతము వాని తాత అగు పులస్త్యుఁడు విని కార్తవీర్యార్జునుని ప్రార్థించి అతనిని విడుదలచేసెను మఱియు ఈకార్తవీర్యార్జునుఁడు పరశురామునితండ్రి అగు జమదగ్నియొక్క హోమధేనువును కొనిపోఁగా అదివిని పరశురాముఁడు వీనితో పోరాడి వీనిని చంపెను ఆవల కొంతకాలమునకు కార్తవీర్యుని కొడుకులు జమదగ్నిని చంపిరి అదికారణముగ పరశురాముఁడు దేశమును అంతయు క్షత్రియశూన్యము కావిం

తును అని ప్రతిజ్ఞచేసి ఇరువదియొక్క మా
ఱు క్షత్రియులమీఁద దండెత్తి పోరాడి
రాజులను ఎల్ల వెదకివెదకి చంపి ఆనెత్తురు
అయిదు మడుఁగులుగ కావించి అందు
పితృతర్పణములు చేసెను కార్తవీర్యార్జును
నకు అనేకులు పుత్రులు కలరు అందు
పరశురామునిచే చావక తప్పినవారు జయ
ధ్వజుఁడు శూరసేనుఁడు వృషణుఁడు మధు
వు శూరుఁడు (లేక) ఊర్జితుఁడు అను
వారు ఏవురు

కార్తికేయుఁడు నా॥ కుమారస్వామి చూ॥
కృత్తిక

కాల వైశ్వానరుఁడు అను దానవుని కూఁతు
రు కశ్యపునియొక్క భార్య ఈమెకొడు
కులు కాలకేయులు

కాలకంఠుఁడు చూ॥ శివుఁడు

కాలకవి ద॥ విరోచనునికొడుకు బలికి స
హోదరుఁడు వీఁడు ద్వాపరాంతమున
దానవుల సహాయార్థము విష కపిత్థవృక్ష
రూపమున వ్రేపల్లెయందు పుట్టి అందలి గో
పాలకులకు రోగము కలుగ చేయఁగా అది
శంఖకర్ణుఁడు అను భూతము ఒకబ్రాహ్మ
ణునియందు ఆవేశించి శ్రీకృష్ణబలరాము
లకు తెలిపెను అంతట వారలు ఆకపిత్థ
వృక్షమును నిర్మూలించి గోపాలకులకును
గోవులకును సుఖము కలుగ చేసిరి

కాలకార్ముకుఁడు ర॥ సుమాలికొడుకు

కాలకూటము ఇది భారతయుద్ధమప్పుడు ఒక
విడిదల

కాలకేయులు ర॥ కశ్యప ప్రజాపతికి కాల
కయందు పుట్టినవారు వీరు మహాదుర్మా
ర్గులు సముద్రమున దాఁగి ఉండి బహు
విధముల దేవతలను బాధించుచు ఉండఁగా
అగస్త్యుఁడు దేవతలచేత ప్రార్థింపఁబడి
వీరి వాసస్థానము ఐన సముద్రముయొక్క
జలమునంతయును పానముచేసెను వీరి సం
తతిశాఁని అర్జునుఁడు రూపులేక నాశము
చేసెను.

కాలకౌశికుఁడు కాశియందు ఉండిన ఒక
బ్రాహ్మణుఁడు కలియొక్క అంశమున
జనించినవాఁడు ఇతఁడు విశ్వామిత్రప్రేరి
తుఁడు అయి ఈరూపమున జన్మించి హరి
శ్చంద్రుని భార్య ఐన చంద్రమతిని దాసిగా
కొనెను

కాలకౌక్షేయుఁడు క్షేమదర్శి అను కో
సలదేశపురాజుయొక్క మంత్రి ఇతఁడు
రాజధర్మములను చక్కఁగా ఎఱిఁగి ఉం
డెను అని ప్రసిద్ధి

కాలనాభుఁడు ద॥ హిరణ్యాక్షుని కొడుకు
నా॥ తారకుఁడు

కాలనేమి (౧) తారక యుద్ధమున విష్ణువుచే
చంపఁబడిన ఒకదానవుఁడు.

(౨) ర॥ రావణాసురుని మేనమామ

కాలభైరవుఁడు కాశియందు ఉండు ఒక
దేవత

కాలయవనుఁడు ద॥ వీఁడు నారదుని ఉపదే
శమున మధురపై దండు ఎత్తిరాఁగా,
కృష్ణుఁడు విశ్వకర్మవలన సముద్ర మధ్య
మునద్వారకాపురిని కట్టించి అందు మధు
రాపుర జనులను అందఱను చేర్చి తాను
నిరాయుధుఁడై పురము వెలువడి ముచి
కుందుఁడు నిద్రించుచు ఉండిన పర్వత
గహ్వరమునకు పరువిడెను కాలయవనుఁ
డు అతనిని తఱుముకొని పోయి ఆగహ్వ
రము దూఱి అందు నిద్రించు ముచుకుందుని
కృష్ణుఁడు అనితలఁచి తన్నఁగా అతఁడు
మేల్కొని వాని చూడ వాఁడు భస్మము
అయ్యెను ఒకప్పుడు సాల్వుఁడు గార్గ్యుని
షండుఁడు అని పలుకఁగా యాదవులు

అందఱు వాని చూచి నవ్విరి అందుమీఁద ఆగార్గ్యుఁడు లోహచూర్ణము భుజించుచు పండ్రెండేండ్లు అత్యుగ్రము అగు తపము ఆచరించి కాల యవనుని పుట్టించినట్లు చెప్పఁబడి ఉన్నది

కావేరి దక్షిణదిక్కున ఉండెడు ఒక పుణ్య నది అగస్త్యుఁడు స్వర్గమునకు పోయి తన కమండలమున దేవగంగ ఎత్తికొని వచ్చి సహ్య పర్వతమునందు ఉంచి స్నానము చేయ పోయిన సమయమునందు విఘ్నేశ్వరుఁడు కాకి అయివచ్చి ఆకమండల జలమును దొర్లించెను అది నదీరూపమున ప్రవహించి కావేరి అన పరఁగెను అట్లు చేసినందులకు విఘ్నేశ్వరుని మీఁద అగస్త్యులు కోపించి తలమీఁద మొట్టెను అందువల్ల నాటనుండి విఘ్నేశ్వరుని నిమిత్తము తల రెండు ప్రక్కలను చేతులతో ఎవరు మొట్టుకొందురో అట్టివారికి విఘ్నేశ్వరుని అనుగ్రహము కలుగును అని అతఁడు ప్రసాదించెను.

కావ్యప్రకాశిక కావ్య లక్షణములను తెలుపునట్టి ఒక లక్షణగ్రంథము దీనికి విద్యాచక్రవర్తి ప్రణీతము అయిన సంప్రదాయ ప్రకాశిని అను ఒక వ్యాఖ్యానము ఉన్నది

కావ్యుఁడు శుక్రుఁడు కవిపుత్రుఁడు అని అర్థము

కాశి ఇది గంగయొడ్డున కాశీ దేశమందు ఉండు ఒక ప్రసిద్ధపట్టణము. దీనికి వారణాసి అనియు పేరు కాశి అనఁగా ప్రకాశించునది అని అర్థము. ఇక్కడ శివుఁడు విశేష సాన్నిధ్యమును ఒంది స్వభావముచే పరిశుద్ధము అయిన గంగకు విశేషమహిమను కల్పించి ఇచట మరణము పొందువారికి ముక్తిని ఇచ్చుచున్నాఁడు అని ప్రసిద్ధి

కాశ్యపి భూమి చూ॥ కశ్యపుఁడు

కాశ్యపుఁడు పాము మంత్రము చక్కఁగా నేర్చిన ఒక బ్రాహ్మణుఁడు పరీక్షిత్తును తక్షకవిషము పోఁగొట్టి కాపాడవలెను అని ప్రయత్నపడి వచ్చు సమయమున తక్షకుఁడు ఇతనిని మార్గమున నిలిపి విశేష ద్రవ్యము ఇయ్యఁగా ఇతఁడు పరీక్షిత్తు చెంతకుపోక మరలి తననివాసమునకు పోయెను

కాశ్యుఁడు (౧) బా॥ సేనజిత్తు కొడుకు

(౨) ఆయువు పౌత్రుఁడు అగు సుహోత్రుని కొడుకు ఇతని వంశస్థులు కాశ్యులు

కాళాంజనము ఇది ఒకతీర్థము చూ॥ శ్వేతుఁడు

కాళి ఉమాదేవికి నామాంతరము చూ॥ భద్రకాళి

కాళింది (౧) యమునానది కళింద పర్వతమునందు పుట్టినది అని అర్థము ఒకప్పుడు బలరాముఁడు బ్రేపల్లెయందు ఉండువేళ దప్పిగొని కాళిందిని తనసమీపమునకు రమ్మనఁగా రానందున ఆయన కోపించి హలాయుధముచేత భేదించి నూఱు పాయలుగ ప్రవహించునట్లు చేసెను అని పురాణప్రసిద్ధి

(౨) సుమతియొక్క భార్య

(3) కృష్ణుని అష్టభార్యలలో ఒకతె. సూర్యుని కూఁతురు

కాళికాదేవి చూ॥ జ్యేష్ఠాదేవి

కాళిదాసుఁడు ఒక సంస్కృతకవి కాళికాదేవిని కొలిచి ఆదేవి యొక్క వర ప్రసాదమును పొందినందున ఇతనికి ఈ పేరు కలిగెను ఇతఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు కవిసమయము చక్కఁగా తెలిసినవాఁడు ఉపమానోపమేయములను పోల్చి చెప్పుటయందు మిక్కిలి సమర్థుఁడు

కాఁబట్టి ఇతఁడు చెప్పెడు ఉపమా
లంకారము శ్లాఘింపఁ దగినది గాక ఉం
డును కనుకనే "ఉపమా కాళిదాసస్య"
అను వచనము లోకమునందు ప్రసిద్ధముగా
వాడఁబడుచున్నది మఱియు ఈమహాకవి
విక్రమార్కుని ఆస్థానమందలి కవులలో
ఒకఁడై ఉండెను

"శ్లో॥ ధన్వంతరిక్షపణకామరసింహశంకు
వేతాళభట్టిఘటఖర్పరకాళిదాసాః।
ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం
రత్నాని వై వరరుచిర్నవవిక్రమస్య॥"

అను ఈశ్లోకమునందు చెప్పఁబడిన చొప్పున
ధన్వంతరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు,
శంకువు, వేతాళుఁడు, భట్టి, ఘటఖర్ప
రుఁడు, కాళిదాసుఁడు, వరాహ మిహి
రుఁడు, అనుకవులు తొమ్మండ్రును విక్ర
మార్కుని సభయందలి నవరత్నములు అని
తెలియఁబడుచు ఉన్నది శాకుంతలము,
మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము
అను నాటకములును, రఘువంశము, మే
ఘసందేశము, కుమారసంభవము అను కా
వ్యములును, ఇతనిచే రచియింపఁ బడెను
ఇదిగాక భోజప్రబంధమువలన భోజరాజు
యొక్క సభలోను ఒక కాళిదాసుఁడు
ఉన్నట్లు తెలియవచ్చుచు ఉన్నది ఇతఁడు
సకల విషయములందును మొదటియాతనిని
పోలినవాఁడు ఒకానొక కాలమున భోజుని
సభయందలి కవులలో ఒకఁడు అగు దండి
అనువానికిని ఇతనికిని వివాదము కలిగి
అప్పుడు సరస్వతిని ఆరాధించి మాయిరు
వురిలో కవి ఎవఁడో తెలుపవలయును
అని ప్రార్థింపఁగా వారికి సరస్వతి ప్రత్య
క్షమై "కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ నసం
శయః" అనఁగా కాళిదాసునికి కోపము
వచ్చి "రండే అహం కః" అనఁగా "త్వమే
వాహం త్వమేవాహం త్వమేవాహం నసం
శయః" అని సరస్వతి చెప్పినందున ఈ
కాళిదాసుఁడు సరస్వతి అవతారము అని
చెప్పుదురు ఈయన నళోదయము, శృం
గార తిలకము, ప్రశ్నోత్తరమాల, కవికంఠ
పాశము, కర్పూరమంజరి, భోజచంపువు,
అనెడు గ్రంథములను శ్యామలా దండక
మును రచియించెను ఇందు కడపట ఉద
హరించిన దండకము తనకు కాళికాదేవి
ప్రత్యక్షము అయినప్పుడు చెప్పినది ఇం
తటి కవులు లోకములో మఱియెవరును
కారు కనుకనే,

"పురాకవీనాంగణనాప్రసంగే
కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా।
అద్యాపితత్తుల్యకవేరభావా
దనామికాసార్థవతీబభూవ॥"

అని చెప్పఁబడి ఉన్నది ఈతని విషయ
మై కట్టుకథలు అనేకములు ఉన్నవి అయి
నను మీఁద ఉదహరించిన విషయములను
పట్టి కాళిదాసులు ఇరువురు అనియు
వాస్తవము ఐన చరిత్రము ఇదియే అనియు
ఊహింప వలసి ఉన్నది

కాళియుఁడు యమునయందు ఉండిన ఒక
విషనాగుఁడు ఇతఁడు కృష్ణునిచే యము
నయందుండి వెడలింపఁబడి భార్యాపుత్రుల
తోడ సముద్రమునకు పోయెను యము
నకు గరుడుఁడు రాకుండునట్లు సౌభరి
యను ఋషి శాపము ఇచ్చెను కనుక ఈ
కాళియుఁడు గరుడునివలని భీతిచే ఇందు
దాఁగి ఉండినట్లును, ఆభీతి కృష్ణునివలన
మాన్పఁబడినట్లును, భాగవతమునందు చెప్పఁ
బడి ఉన్నది.

కాళేశ్వరము పయోష్ణీ గోదావరీ సంగమ
స్థానమునందు ఉండు ఒక దివ్యక్షేత్రము.

## కి

కింపురుషుఁడు పులహుని కొడుకు

కింపురుషులు దేవతాభేదము వీరు నరముఖమును అశ్వశరీరమును కలవారు

కిన్నరుఁడు పులహుని కొడుకు

కిన్నరులు దేవతాభేదము వీరు అశ్వముఖమును నరశరీరమును కలవారు

కిమ్మీరుఁడు ర॥ బకాసురుని తమ్ముఁడు కామ్యక వనమున వీనిని భీముఁడు చంపెను

కిరాతార్జునీయము ఒకసంస్కృతకావ్యము అర్జునుఁడు కిరాతవేషమున ఉన్న శివునితో పోరాడి పాశుపతాస్త్రమును పడసిన కథను చెప్పుటచేత దీనికి ఈపేరు కలిగెను ఇది భారవిచే చేయఁబడినందున దీనికి భారవి అనియు నామముకలదు వ్యాఖ్యానము కోలచల మల్లినాథసూరి విరచితము.

కిరీటి చూ॥ అర్జునుఁడు.

కిష్కింధ. వాలిసుగ్రీవుల రాజధాని తమ్మునిపై తప్పుకల్పించి తఱుమగొట్టిన వాలిని శ్రీరాముఁడు చంపి సుగ్రీవునకు ఈకిష్కింధాపట్టణమును ఇప్పించెను ఇది మైసూరికి కొంత ఉత్తరంబున ఉండును.

## కీ

కీచకులు. వీరునూటుగురు అన్నదమ్ములు విరాటుని భార్య అగు సుధేష్ణయొక్క తోఁబుట్టువులు పాండవుల అజ్ఞాతవాసకాలమున సైరంధ్రీవేషమును తాల్చి ఉండిన ద్రౌపదిని పెద్దకీచకుఁడు అగు సింహబలుఁడు పట్టి ఈడ్చినందున భీముఁడు గంధర్వుఁడు అను మిషచే రాత్రివేళ వీరిని నూటుగురను చంపెను.

కీనాశుఁడు. చూ॥ యముఁడు.

కీర్తిమతి అణుహునిభార్య శుకుని కూఁతురు

కీర్తిరథుఁడు మి॥ ప్రతిరథకుని కొడుకు

కీర్తిరాతుఁడు మి॥ మహాధ్రకుని కొడుకు.

## కు

కుంజరుఁడు ఒకానొక వానరుఁడు. అంజనతండ్రి హనుమంతుని మాతామహుఁడు.

కుండల వింధ్యవంతుని సుత. ఈమెభర్త శుంభుఁడు అను రాక్షసునిచే మృతిని ఒందెను. ఈమెకు ఎల్లయెడల సంచరించు శక్తి కలదు

కుండినపురము విదర్భదేశమునకు రాజధానిగా ఉండిన పట్టణము అమరావతికి ఈశాన్యదిక్కున నాలుగు ఆమడ దూరమున ఉండెను.

కుంతలము. బళ్లారికి సమీపమున ఉండుదేశమునకు ప్రాచీననామము.

కుంతి ఈపేరిచే అనేక యాదవులు ఉండిరి.

(౧) హేహయుని పౌత్రుఁడు ధర్మనేత్రుని పుత్రుఁడు

(౨) విదర్భునిపౌత్రుఁడు. వృథుని కొడుకు. ఈతఁడు శశిబిందువువంశస్థుఁడు

(3) పైని చెప్పిన రెండవ కుంతి వంశస్థుఁడు నా॥ కరంభి

(౪) సాత్వతుని కొడుకైన మహాభోజుని వంశస్థుఁడు పాండవులతల్లి అగు కుంతీదేవికి పెంపుడు తండ్రి నా॥ కుంతిభోజుఁడు.

కుంతిపురి ఇప్పటి గ్వాలియరు.

కుంతీదేవి. కుంతిభోజుని అభిమాన పుత్రిక. దేవమీఢునకు మారిషయందు పుట్టినది. వసుదేవునిచెల్లెలు ఈమెకు పృథ అని నామాంతరము కలదు. ఈమె బాల్యమునందు తండ్రిపంపున దుర్వాసమహామునికి శుశ్రూష చేయుచుండు తఱిని ఈమెభక్తికి అయన విస్మయమును ఒంది ఒక్కదివ్యమంత్రమును ఉప

దేశముచేసి ఈమంత్రబలమున నీవు ఏవేల్పును కోరినను ఆవేల్పుప్రసాదమున కోరినట్టి పుత్రుని పడయుదువు అని చెప్పినందున కుంతి ఆమంత్రశక్తిని ఎఱుఁగుటకయి ఒకనాఁడు గంగకు చని అవగాహనము చేసి ఆదిత్యుని తలఁచి అతనివంటి పుత్రుని కోరెను అంత అతఁడు సాక్షాత్కరించి ఆమెకన్యాత్వము చెడకుండ ఒక సుపుత్రుఁడు కలుగ అనుగ్రహించి చనియెను అట్లు సూర్యప్రసాదము వలన ఒకసుతుని పడసి అతనికి, సహజకర్ణకుండలుఁడు అయి జనించినందున, కర్ణుఁడు అనియు, వసువర్మధరుఁడుగ పుట్టినందున వసుసేనుఁడు అనియు నామకరణముచేసెను ఈవిషయము భారతమున ఆదిపర్వమునందు ఒకవిధముగాను ఆరణ్యపర్వమునందు ఒకవిధముగాను చెప్పఁబడి ఉన్నది.

మఱియు ఈమె పాండురాజును వివాహము అయిన పిదప ఆమంత్రబలము వలననే యముఁడు వాయువు ఇంద్రుఁడు వీరి ప్రసాదములవలన వరుసగా ధర్మజుఁడు భీముఁడు అర్జునుఁడు అను కొడుకులను కనెను ఈమె సిద్ధియంశస్థురాలు.

భారత యుద్ధానంతరమున ధర్మరాజు బంధువులకు ఎల్ల తిలోదక వాసోదకములను ఇయ్యఁబోవు అవసరమున అతనికి కుంతి, కర్ణుఁడు తనకు జ్యేష్ఠపుత్రుఁడు అనియు అతనికి తిలోదకాదులు మొట్టమొదట ఈయవలయును అనియు నుడువఁగా, అపుడు ధర్మరాజు కర్ణుని వృత్తాంతమును అంతయు ఎఱిఁగి అతనితో ఎదిరించి పోరినందులకును అతని మరణమునకును కడు దుఃఖించి తనతల్లి అగు కుంతి ఆవృత్తాంతమును తనతో ఇన్నిదినములు చెప్పక దాఁచినందులకై మిగుల అలిగి అది మొదలు స్త్రీలయందు రహస్యము ఏదియు నిలువక ఉండునట్లు శపియించెను

కుంభకర్ణుఁడు. ర॥ రావణాసురుని తమ్ముఁడు ఈరక్కసుఁడు మహాఘోరము అగు తపము ఒనరించి వరము అడుగఁబోవు వేళ దేవతల ప్రార్థనచే సరస్వతీదేవి వాని నాలుకయందు ప్రవేశించి నిద్ర కావలెను అని పలికించెను అది కారణముగ వాఁడు ఎల్లపుడు నిద్రపోవుచుండును మఱియు వానికి నిద్రాభంగము అగువేళ చావు సంభవించును అని నియతి కలిగి ఉన్నందున రాముఁడు లంకలో యుద్ధముచేయు నవసరమున రావణుఁడు నిద్రించుచు ఉన్న కుంభకర్ణుని లేపి యుద్ధమునకు పంపఁగా వాఁడు రామునిచేత చచ్చినట్లు చెప్పుదురు రావణ కుంభకర్ణులు సనకసనందనుల శాపముచే రాక్షసావతారము ఎత్తిన విష్ణుద్వారపాలకులు

కుంభకుఁడు, విదేహదేశమందు ఉండిన ఒక గొల్లవాఁడు వీనియింట తారకయుద్ధమున పడిసిన కాలనేమి పుత్రులు ఏడుగురు ఆఁబోతులుగా పుట్టినట్లును వారిని శ్రీకృష్ణుఁడు చంపి కుంభకుని కూఁతురైన నీలను పెండ్లియాడినట్లును చెప్పఁబడి ఉన్నదీ.

కుంభాండుఁడు బాణాసురునిమంత్రి నా॥ కబంధుఁడు

కుంభీనస ర॥ సుమాలికూఁతురు ఖరదూషణాదుల తల్లి

కుంభుఁడు. ర॥ కుంభకర్ణునికొడుకు. సుగ్రీవునిచేత చంపఁబడెను.

కుకురుఁడు య॥ అంధకుని కొడుకు

కుచేలుఁడు కృష్ణునిసఖుఁడు ఐన ఒక బ్రాహ్మణుఁడు ఇతఁడు బ్రహ్మవేత్తయు విజితేంద్రియుఁడును ఐనను దారిద్ర్యముచే కడు

పీడితుఁడై భార్య ప్రేరేపింపఁగా ధనమును కోరి కృష్ణుని దర్శనమునకుపోవఁగా అతఁడు ఇతని మిగుల గారవించి తనయందు కల భక్తి విశ్వాస మనోరథంబులను ఎఱింగి అతని మహాైశ్వర్యయుక్తునిఁగ చేసెను

కుజంభుఁడు (౧) ద॥ తారకయుద్ధమున వరుణునిచే చంపఁబడిన రాక్షసుఁడు

(౨) వత్సంధ్రునిచే చంపఁబడిన ఒక అసురుఁడు వీఁడు తొల్లి త్వష్టచే సృజింపఁబడిన సర్వశత్రు నిర్మూలము అయిన ఒక ముసలమును స్వాధీనపఱుచుకొని లోకమునకు కడు ఎగ్గు ఒనరించుచు ఉండెను. ఈముసలము విదూరథుని కూఁతురు అగుముదావతి లేకపోనందన మూలముగ నిష్ప్రయోజనము ఆయెను. అదికారణముగ వత్సంధ్రుఁడు వీనిని జయించి ముదావతిని వివాహము అయ్యెను

కుజుఁడు నా॥ అంగారకుఁడు

కుటవుఁడు ఒకానొక ఋషి

కుబేరుఁడు అష్టదిక్పాలకులలో ఒక్కఁడు ఇతనిది ఉత్తరపుదిక్కు - పట్టణము అలకాపురి - భార్య చిత్రరేఖ - వాహనము గుఱ్ఱము - ఆయుధము ఖడ్గము - ఇతఁడు ఐశ్వర్యమునకు దేవత ఇతనిరాజాధి రాజత్వము వేదప్రసిద్ధముకనుక ఇతనికి రాజరాజు అనియు ఒకపేరు కలదు ఇతఁడు యక్షులకును గుహ్యకులకును రాజు-నరవాహనుఁడు అనియు ప్రసిద్ధి-కుబేరుఁడు విశ్రవసునకు ఇలబిలయందు పుట్టినవాఁడు కాన అతనికి ఐలబిలుఁడు అను ప్రసిద్ధము ఐన పేరుకలదు పార్వతీదేవి శాపమువలన ఇతఁడు ఏకపింగాక్షుఁడు అయ్యెను

కుబ్జ కంసునికి కలపము తెచ్చి ఇచ్చెడు దాని ఇది మూఁడువక్రములుగల దేహము కలది అగుటచే దీనికి త్రివక్ర అనియు పేరు బలరామకృష్ణులు వ్రేపల్లెనుండి మథురాపురికి వచ్చునపుడు నానావిధలేపముల భాజనమును కంసునియొద్దకు కొనిపోవుచు ఉండిన దీనిని చూచి లేపములు అన్నియు తమకు ఇమ్మని అడిగి పుచ్చుకొని దేహములను అలఁదుకొనిరి అపుడు శ్రీకృష్ణుఁడు ప్రసన్నుఁడు అయి దానికుబ్జత్వమును మాన్పెను.

కుమారరుద్రదేవుఁడు ఇతఁడు ఒకానొక ఆంధ్రకవి భాస్కర రామాయణమున అయోధ్యాకాండమును తెనిఁగించెను

కుమారస్వామి శివుని కొమారులలో ఒకఁడు దేవతలకు సేనానాయకుఁడు మఱియు ఇతనికి కార్తికేయుఁడు మహాసేనుఁడు శరజన్ముఁడు షడాననుఁడు పార్వతీనందనుఁడు తారకజిత్తు సుబ్రహ్మణ్యుఁడు అని అనేక నామములు కలవు ఇతనికి వాహనము నెమలి. శక్తి ఆయుధము పార్వతీపరమేశ్వరులు ఏకాంతమున ఉండువేళ శివునిచేష్టలను అరయుటకై అగ్ని శుకరూపంబు తాల్చి జాలరంధ్రములదారిని అంతఃపురము చొచ్చిన అది పార్వతి ఎఱిఁగి సిగ్గుచే తొలఁగి చనియెను శివుఁడును శుకరూపి అయిన అగ్నిని కాంచి కోపగించి అప్పుడు పతనమయిన తనరేతస్సును అగ్నిని పానముచేయుము అనెను. అగ్నిదానిని భరింపఁజాలక శరవణమునందు విడువ అందుండి కుమారస్వామి పుట్టెను (చూ పార్వతి) కొందఱు ఇతనిని అగ్నికి జనించినవాఁడు అని చెప్పుదురు (చూ కృత్తికాదేవి) కుమారస్వామి పుత్రులు శాఖుఁడు విశాఖుఁడు నైగమేషుఁడు పృష్ఠజుఁడు

కుమారి ఋక్షపర్వతమున ఉత్పత్తి అగు ఒక నది

కుముదబాంధవుఁడు. చంద్రుఁడు

కుముదము నిరృతిదిక్కునందలి మగయేనుఁగు

కుముదవతి వింధ్యపర్వతమున ఉత్పత్తి అగు ఒకనది

కుముదాక్షుఁడు విష్ణుపరిచరులలో ఒక్కఁడు

కుముదుఁడు (౧) విష్ణుపరిచరులలో ఒక్కఁడు.
(౨) ఒకానొక కోఁతి
(౩) ఒకానొక రాక్షసుఁడు

కురుజాంగలము హస్తినాపురికి వాయవ్యమున పాంచాలమునకు దక్షిణమున ఉండుదేశము

కురుజిత్తు మి॥ అంజకుని కొడుకు.

కురుదేశము దీనిరాజధాని హస్తినాపురి దీనికి ఈనామము కురువు అనురాజువలన కలిగెను.

కురుధాముఁడు దిష్యంతుని కొడుకు

కురువశుఁడు య॥ రెండవమధువు కొడుకు.

కురువు పు॥ అజమీఢుని మూఁడవ కొడుకు అగు ఋక్షుని పౌత్రుఁడు సంవరణుని పుత్రుఁడు ఇతనిపేర శమంతపంచకము కురుక్షేత్రము అనఁబరఁగెను. కొడుకులు పరిక్షిత్తు సుధనుస్సు జహ్నువు నిషధుఁడు.

కురుక్షేత్రము. స్థానేశ్వరము ఇదిప్రజాపతియుత్తరవేది అనియు సమస్తదేవతలు ఇందు వరిష్ఠంబులు అగుసత్రంబులు ఆచరించిరి అనియు ప్రసిద్ధి కురురాజు దీని దున్నుటఁ జేసి దీనికి ఈనామము కలిగెను ఇది కురుదేశమునందు ఉండును. ఇచ్చోటనే భారతయుద్ధము జరగెను

కులపర్వతములు ౧ మహేంద్రము. ౨ గంధమాదనము. ౩. మలయము ౪. సహ్యము. ౫ శుక్తిమంతము ౬. వింధ్యము ౭ పారియాత్రము ఇవి ఏడు

కుల్లూకభట్టీయము. మనుస్మృతియొక్క వ్యాఖ్యానము ఇది కుల్లూకభట్టుచే రచియింపఁబడినందున దీనికి ఈపేరు వచ్చెను

కువలయానందము అప్పయ్య దీక్షితులచే రచియింపఁబడిన అలంకారశాస్త్రము ఇది చంద్రాలోకమునకు వ్యాఖ్యానము అని చెప్పుదురు

కువలయాపీడము కంసునిగజము ఇది ఎట్టిబలశాలిని ఐనను టమఱించి పట్టిపడద్రోని కాళ్లతో త్రొక్కిచంపుచు ఉండును కనుక కంసుఁడు శ్రీకృష్ణబలరాముల మీఁదికి దీనిని పురికొలుప మావటివానికి ఉత్తరువుచేసెను మావటివాఁడు అట్లే పురికొలుపఁగా కృష్ణుఁడు దీనిని చంపెను

కువలయాశ్వుఁడు (౧) సూ॥ ఋతధ్వజుఁడు కాశ్యులలో ఒకఁడు. శత్రుజిత్తు కొడుకు ఇతనికి గాలవుఁడు అను ఒకముని (ముల్లోకంబుల నదులయందును పర్వతాదులయందును సమత్వంబున చరించు గుణము గలుగుటచే) కువలయాశ్వము అనఁబరఁగిన ఒకగుఱ్ఱమును ఇచ్చెను దాని కొని ఆఋషికి తపోభంగము కావించునట్టి పాతాళకేతువు అనునొక రాక్షసుని పొలియించి పాతాళలోకంబున ఉండు మదాలస అను ఒక కన్యను పెండ్లియాడెను కనుక ఇతనికి ఈపేరు వచ్చెను

(౨) ఇ॥ బృహదశ్వుని కొడుకు ఇతఁడు దుందుఁడు అను రక్కసుని చంపినందున దుంధుమారుఁడు అను పేరుపొందెను.

(౩) సూ॥ వత్సుని కొడుకు. అలర్కునితండ్రి చూ॥ తాళకేతుఁడు.

కుశధ్వజుఁడు జనకమహారాజు తమ్ముఁడు దశరథుని వియ్యంకుఁడు. భరతశత్రుఘ్నులకు మామగారు

కుశనాభుఁడు కుశుని కొడుకు ఇతనికి కొమార్తెలు నూర్వురు వీరు వాయుశాపముచే కుబ్జలుకాఁగా వారిని, చూళి అనునొక

ఋషికిని సోమద అనునొక అప్సరసకును పుట్టిన బ్రహ్మదత్తుఁడు అను ఋషికి ఇచ్చి ఈతఁడు వివాహముచేసెను ఆమహర్షి తన తపోబలమువలన వారి కుబ్జత్వమును పోఁగొట్టెను

కుశలవులు శ్రీరాముని కుమారులు వీరు అమడలు వీరిని గర్భమునందు ధరించి ఉండఁగా శ్రీరాముఁడు కొంచెమైనను ఎరబరికములేక చిరకాలము రావణాసురుని ఇంట ఉండిన సీతను ఆమెయందలి మోహముచేత విడనాడ చాలక తోడితెచ్చి ఇంట ఉంచుకొని ఏలుచున్నాఁడు అని లోకులు చెప్పు మాటలు విని లోకాపవాదమునకు వెఱచి పూరగర్భిణి అయిన సీతను అడవికి పంపివేసెను అంతట ఆమె వాల్మీకి ఆశ్రమముచేరి అచట అమడబిడ్డలను కనెను అంతట ఆమహర్షి ఆబిడ్డలకు జాతకర్మాది వైదికక్రియలు నడపి ధనుర్విద్య మొదలుగాఁగల సమస్తవిద్యలను గఱపెను పిమ్మట కొంతకాలమునకు సీతయు కుశలవులును మరల రామునియొద్ద వచ్చి చేరిరి ఆకుమారులలో కుశుఁడు కుశస్థలి అనుపురమును నిర్మాణముచేసెను

కుశస్థలి (౧) రైవతదుర్గమున ఉండిన ఒక పట్టణము మధురాపురము జరాసంధునిచే కొల్లఁబడినవెనుక కృష్ణునకు ఇది ముఖ్య పట్టణము అయి ఉండెను తొలుత ఇది ఆనర్తునిచే నిర్మింపఁబడి ఆనర్తదేశములకు రాజధాని అయి ఉండినట్లు తెలియవచ్చెడి

(౨) దీని శ్రీరాముని కొమరుఁడు ఐన కుశుఁడు నిర్మాణము చేసెను ఇది వింధ్యపర్వత ముఖమున ఉండును చూ॥ కోసలము

కుశాంబుఁడు కుశికుని కొడుకు ఇతనిపుత్రుఁడు గాధి

కుశాగ్రుఁడు కు॥ బృహద్రథుని కొడుకు జరాసంధుని భ్రాత

కుశావతి కుశుని రాజధాని ఇది ఉత్తర కోసలదేశమునందు ఉండును

కుశికుఁడు విశ్వామిత్రుని ముత్తాత పురూరవుని కొడుకు అగు అమావసువు వంశస్థుఁడు బలాకాశ్వుని కొడుకు

కుశీలవుఁడు మైత్రేయుని తండ్రి

కుశుఁడు (౧) చూ॥ కుశలవులు

(౨) క్షత్రవృద్ధుని రెండవకొడుకు

(౩) క్షత్రవృద్ధుని మొదటి కొడుకు అగు సుహోత్రుని రెండవ కొడుకు

(౪) య॥ విదర్భుని కొడుకు

కుసుంబుఁడు కు॥ఉపరిచరవసువు కొడుకు

కుసుమపురము చూ॥ నా॥ పాటలీపుత్రము

కుసుమేషువు చూ॥ మన్మథుఁడు

కుహూదేవి ధాతభార్యలలో ఒకతె

కుక్షి ఇక్ష్వాకు కొడుకు వికుక్షియొక్క తండ్రి

## కూ

కూర్మపురాణము ఇది కూర్మరూపమున ఇందిరాధీశుఁడు ఇంద్రద్యుమ్నునకు చెప్పిన సర్గవిషయ వర్ణాశ్రమ ధర్మవిచార శివ మాహాత్మ్యాదులు కలది దీనిగ్రంథసంఖ్య ౬౦౦౦

కూర్మావతారము. విష్ణువుయొక్క దశావతారములలో రెండవయవతారము ॥చూ॥ అమృత మథనము

## కృ

కృతకుఁడు య॥ వసుదేవుని కొడుకు

కృతకృత్యుఁడు త్రికకుత్తు కొడుకు ఇతఁడు నిరక్షుఁడు అయి చనియెను.

కృతద్యుతి చిత్రకేతుని జ్యేష్ఠభార్య అంగ రాజు కూఁతురు

కృతప్రవణుఁడు ఋ॥ పరశురాముని అనుచరుఁడు

కృతమాల మలయపర్వతమున ఉత్పత్తి అగు ఒకనది

కృతయుగము ఒకయుగము దీనిపరిమితి ౧౭౨౮౦౦౦ సంవత్సరములు చూ॥ యుగములు

కృతవర్మ య॥ హృదికుని కొడుకు దేవమీఢుని తమ్ముఁడు ఇతఁడు కృపాశ్వత్థామలతో కూడి భారతయుద్ధానంతరమున రాత్రియందు పాండవ శిబిరము చొచ్చి నిద్రపోవువారిని హత్యచేసిన అశ్వత్థామకు సహాయముగ ఉండెను

(౨) కృతవీర్యుని తమ్ముఁడు

కృతవీర్యుఁడు. య॥ ధనికుని పుత్రుఁడు కార్తవీర్యార్జునుని తండ్రి

కృతాంతుఁడు చూ॥ యముఁడు

కృతాగ్ని య॥ కృతవీర్యుని తమ్ముఁడు

కృతాయువు మి॥ అరిష్టనేమి కొడుకు

కృతాశ్వుఁడు ఇ॥ బర్హిణాశ్వుని మొదటి కొడుకు ఇతనికి నామాంతరములు కృశాశ్వుఁడు రూపాశ్వుఁడు కొడుకు రెండవ యువనాశ్వుఁడు

కృతి. (౧) మి॥ బహులాశ్వుని కొడుకు

(౨) పు॥ సన్నతమంతుని కొడుకు ఇతఁడు హిరణ్యనాభునివలన యోగమార్గము ఎఱిఁగి శోకమువిడిచి తూర్పుదేశమున సామసంహిత పరియించెను

(౩) య॥ విభువు కొడుకు

(౪) కు॥ చ్యవనుని కొడుకు

కృతిమంతుఁడు. పు॥ నా॥ ధృతిమంతుఁడు యవీనరుని కొడుకు

కృతుఁడు (౧) గంభీరుని కొడుకు ఇతని వంశజులు బ్రాహ్మణులు అయిరి

(౨) య॥ బలరాముని తమ్ముఁడు

కృతౌజస్సు య॥ కృతవీర్యుని తమ్ముఁడు

కృత్తిక అశ్విన్యాది నక్షత్రములలో మూఁడవది ఇది ఆఱునక్షత్రముల గుంపు ఒకప్పుడు అగ్నిదేవుఁడు సప్తఋషుల భార్యలను చూచి మోహింపఁగా అతని భార్య అగు స్వాహాదేవి, తనభర్త ఆ ఋషి భార్యలచేత శపింపఁబడును అని భయపడి, వసిష్ఠుని భార్య అయిన అరుంధతి తప్ప తక్కిన ఆఱుగురి రూపములను తాను ధరించి ఆయనతో కూడెను అంతట ఆఋషులు తమభార్యలే అగ్నితో కూడిరి అని ఎంచి వారిని విడనాడిరి అప్పుడు వారు తాము అట్టి అకృత్యము చేయలేదు అనియు అగ్నిభార్యయే తమరూపములను వహించెను అనియు దోషము లేనితమ్ము పరిగ్రహింపవలెను అనియు ప్రార్థింపఁగా వారు అది నిజము అని తెలిసియు వారితోడిది అగు అరుంధతియొక్క రూపమును స్వాహాదేవి వహింపలేక పోయెను, అట్టి పాతివ్రత్య మహిమ వీరియందు ఉండినయెడ వీరి రూపములను మాత్రము ఎట్లు తాల్చును అని వారి ప్రార్థనమును అంగీకరింపక పోయిరి ఆమునిభార్యలనే షట్కృత్తికలు అందురు కొందఱు అపుడు కుమారస్వామి వీరివల్ల అగ్నికి పుట్టినట్లు వక్కాణింతురు కొందఱు తెల్లునందు పుట్టిన కుమారస్వామికి ఈకృత్తికాదేవులు స్తన్యము ఇచ్చి అతనిని తమ కుమారునిఁగా చేసికొనిరి అని చెప్పుదురు కనుకనే కుమారస్వామికి కార్తికేయుఁడు అను పేరు కలిగెను

కృత్తివాసుఁడు. శివుఁడు

కృత్స్నమదుఁడు  క్షత్రవృద్ధని పౌత్రుఁడు సుహోత్రుని పుత్రుఁడు శునకుని తండ్రి

కృథుఁడు  య॥ విదర్భుని రెండవ కొడుకు

కృపి  సత్యధృతి కూఁతురు ద్రోణాచార్యుల భార్య అశ్వత్థామ తల్లి కృపాచార్యుల చెలియలు

కృపీటజన్ముఁడు  ఉదకమువలన జన్మము కలవాఁడు అని శబ్దార్థము అగ్ని-చంద్రుఁడు

కృపీటయోని  చూ॥ కృపీటజన్ముఁడు

కృపుఁడు  సత్యధృతి కొడుకు ద్రోణాచార్యుల బావమఱఁది ద్రోణుఁడు రాకమునుపు కౌరవులకు అస్త్రగురువు ఇతఁడు చిరంజీవి. ఏకాదశరుద్రుల యంశమున జనించినవాఁడు గోతముని వంశమున పుట్టినవాఁడు అగుటచే ఇతనికి గౌతముఁడు అనియు ఒకపేరుకలదు

కృశానురేతుఁడు  శివుఁడు

కృశానువు  అగ్ని.

కృశాశ్వుఁడు  చూ॥ నా॥ కృతాశ్వుఁడు

కృశుఁడు  ఒకానొక ఋషి ఇతఁడు శమీకుని మెడను పరీక్షిత్తు సర్పశవమును వేసినది శృంగికి చెప్పిన వాఁడు

కృష్ణ  (౧) ద్రౌపది పేరు
(౨) ఒకానొక నది

కృష్ణకర్ణామృతము  ఇది శ్రీలీలాశుకులచే రచియింపఁబడిన ఒక గ్రంధము. ఇందు శ్రీకృష్ణ లీలలు చెప్పఁబడి ఉండును

కృష్ణజయంతి  శ్రావణ బహుళ అష్టమి ఈ దినమున విష్ణువు కృష్ణావతారము ఎత్తినందున జనులు ఇది ఒక వ్రతముగా ఆచరింతురు

కృష్ణదేవరాయలు  ఇతఁడు కర్ణాటక దేశాధీశుఁడు. ఇతఁడు రమారమి మున్నూఱు సంవత్సరములకు మునుపు ఆనగొంది యందు లేక చంద్రగిరియందు ఉండి కర్ణాటకరాజ్యమును పాలించెను ఇతఁడు ఆ కాలమందు ఉండిన శూరులగు ఇతర దేశాధీశులను జయించి ఆంధ్రదేశము అంతయును, కొంతవఱకు ద్రవిడదేశమును కర్ణాటక మహారాష్ట్రములను బంగాళమును, స్వాధీనము చేసికొని మూరురాయర గండఁడు అను బిరుదాంకమును వహించి ఉండెను ఈతనికాలమున అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, ముక్కుతిమ్మన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రయ్య, సూరపరాజు, తెన్నాల రామకృష్ణయ్య మొదలగు కవీశ్వరులు అనేకులు ఉండిరి

కృష్ణదేవి  కృష్ణానదికి నామాంతరము

కృష్ణద్వైపాయనుఁడు  చూ॥ వ్యాసుఁడు.

కృష్ణాంగన  నైరృతుని రాజధాని

కృష్ణుఁడు  య॥ వసుదేవునికి దేవకీదేవియందు పుట్టిన కొడుకు ఇతఁడు ఈపేరితో అవతారము ఎత్తిన శ్రీమహావిష్ణువు కంసుఁడు తన్ను కృష్ణుఁడు చంపును అని ఒకప్పుడు ఆకాశవాణి పలికినందున కృష్ణుని పుట్టినప్పుడే చంపవలెను అని దానికి తగిన యత్నములన్ని చేసి ఉండెను అట్లుండినను యోగమాయా సహాయమున కృష్ణుఁడు తప్పించుకొని వ్రేపల్లెలో నందుని భార్య అగు యశోదాదేవియొద్ద చేరి అందు పెరిగెను. (చూ॥ కంసుఁడు) ఈతని లీలలు అనేకములు ఇతఁడు చేసిన అమానుష కృత్యములు అనేకములు పలువిధముల తెలియవచ్చును భారతయుద్ధ ప్రారంభమునకు ముందు అర్జునుఁడు తన బంధువులతోడను గురువులతోడను యుద్ధము చేయను అని విరమింపఁగా అతనికి కృష్ణుఁడు యోగశాస్త్రమును ఉపదేశించి యుద్ధముచేయ బుద్ధి పుట్టించెను ఆ యోగశాస్త్రము

"భగవద్గీత" అను పేరిచే మనవేదాంత గ్రంథములలో మిగుల పొడ్డది అయి ఉన్నది మఱియు ధర్మరాజుచేత చేయఁబడిన రాజసూయ యాగకాలమున ఇతఁడు శిశుపాలుని సంహరించెను కౌరవసదస్సున దుర్యోధనాదులచే ద్రౌపది అవమానింపఁబడినప్పుడు ఇతఁడు ఆమె మొఱ ఆలకించి సంరక్షించెను పాండవులకును కౌరవులకును సంధిచేయఁగోరి రాయబారము పోయిన కాలమున ఇతఁడు తనవిశ్వరూపమును చూపెను. ఇవి మొదలైన అమానుషములును అద్భుతములును అయిన కృత్యములను ఇతఁడు చేసినందున దేవలకు మనుష్యమాత్రుఁడు కాఁడు అని నమ్మఁదగి ఉన్నది.

## కే

**కేకటుఁడు.** సంకటుని కొడుకు ఇతనికి దుర్గాభిమాన దేవతలు పుట్టిరి.

**కేకయము.** ఒకానొక దేశము శిబికొడుకు అగు కేకయునివలన దీనికి ఈనామము కలిగెను ఇది విపాశనదికి వాయవ్యభాగమున ఉన్నది. దీనికి రాజధాని గిరివ్రజము శ్రీరాముని తమ్ముఁడు అయిన భరతుని మామమహుఁడు ఈదేశాధిపతి.

**కేకయుఁడు** అ॥ శిబిచక్రవర్తియొక్క నలువురు కొడుకులలో ఒకఁడు చూ॥ కేకయము.

**కేతన** ఒక ఆంధ్రకవి. ఇతనికి అభినవదండి అని బిరుదాంకము కలదు. ఈతఁడు విజ్ఞానేశ్వరీయము అను ధర్మశాస్త్రమును తెనిఁగించెను.

**కేతుమంతుఁడు.** (౧) నలువురు లోకపాలురలో ఒకఁడు.

(౨) కళింగ దేశాధీశుఁడు. శ్రుతాయువు కొడుకు.

(౩) కా॥ ధన్వంతరి కొడుకు కేతురథుని తండ్రి

**కేతుమతి** ఒకగంధర్వస్త్రీ సుమాలి అను రాక్షసుని భార్య

**కేతురథుడు** కా॥ కేతుమంతుని కొడుకు. భగీరథునితండ్రి

**కేతువు** విప్రచిత్తికి సింహికయందు పుట్టిన కొడుకు ఇతఁడు అగ్నికి వికేశియందు పుట్టిన పుత్రుఁడు అనియు చెప్పఁబడి ఉన్నది చూ॥ రాహువు

**కేదారము** హిమవత్పర్వతమునందలి ఒక శివక్షేత్రము

**కేదారేశ్వరవ్రతము** ఇది ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు సువాసినులు భర్తయను గ్రహమును కోరి ఆచరించువ్రతము చూ॥ అర్ధనారీశ్వరి

**కేదారేశ్వరుఁడు** ఒకానొక శివమూర్తి. చూ॥ అర్ధనారీశ్వరి

**కేరళము.** కేరళుఁడు ఏలినదేశము. ఇదియె దక్షిణ మళయాళము అనఁబడు

**కేరళుఁడు** దుష్యంతుని తమ్ముఁడు అగు దిష్యంతుని మునిమనుమఁడు వీనితండ్రి అక్రీతుఁడు ఇతఁడు కేరళదేశమును ఏలినవాఁడు

**కేశవుఁడు.** చూ॥ విష్ణువు

**కేశి** (౧) ఒకదానవుఁడు వీఁడు దేవసేనను పట్టి ఎత్తుకొనిపోవుచు ఉండఁగా ఆమెను దేవేంద్రుఁడు విడిపించెను

(౨) హయరూపధరుఁడై అయి వచ్చి కృష్ణునితో పోరాడి మృతిచెందిన ఒక అసురుఁడు

(౩) య॥ వసుదేవునికి భద్రయందు పుట్టిన కొడుకు.

**కేశిధ్వజుఁడు** నిమి వంశోద్భవుఁడు, చూ॥ ఖాండిక్యుఁడు

**కేశిని** దమయంతి పరిచారికలలో ఒకతె

**కేసరి** ఒకానొకవానరుఁడు ప్రభాసతీరమున ఋషులకు ఉపద్రవము చేయుచు ఉండిన ఒక ఏనుఁగును ఇతఁడు చంపెను కనుక కుంజరసూదనుఁడు లేక కేసరి అను పేరు కలిగెను ఇతనిభార్య అంజన కొడుకు హనుమంతుఁడు

## కై

**కైకసి** సుమాలికూఁతురు విశ్రవసుని రెండవభార్య ఈమెయందు రావణ కుంభకర్ణ విభీషణులును శూర్పణఖయును పుట్టిరి

**కైకేయి** (౧) కేకయదేశపురాజుకూఁతురు దశరథుని మూఁడవ భార్య భరతునితల్లి

(౨) విరాటరాజుభార్య నా॥ సుదేష్ణ

**కైటభుఁడు** ఒక అసురుఁడు కల్పాంతమున విష్ణువు యోగ నిద్రయందు ఉండునపుడు వీఁడును మధువు అనువాఁడును అతని చెవినుండి వెడలివచ్చి ప్రళయసముద్రము మోఁకాలిబంటిగా చరించుచు ఉండిరి అపుడు విష్ణునాభికమలమునందు బ్రహ్మ జనించి మధుకైటభులు తన్ను హింసింప రాఁగా, విష్ణువును శరణువేఁడెను విష్ణువుకరుణించి మధుకైటభులను నిలువరించి మీరు ఏల ఈబాలుని హింసించెదరు ? వీనిని విడువుఁడు మీకు కోరినవరములు ఇచ్చెదను అనెను అందులకు వారు చిఱునవ్వు నవ్వుచు నీవా మాకు వరము ఇచ్చెడు వాఁడవు! కావలయునేని నీకు మేము వరములు ఇచ్చెదము కోరుము అనఁగా, మీరు నాచేత చచ్చునట్లు వరము ఇండు అని అడిగి పుచ్చుకొని ఆయిద్దఱను చంపెను కనుకనే విష్ణువునకు కైటభారి మధువైరి అనునామములు కలిగెను

**కైలగిల** ఒకపట్టణము. ఇది సుమారు ౮౦౦ సంవత్సరములకుముందు కొంకణమునకు రాజధానిగా ఉండెను

**కైలాసపర్వతము** హిమవత్పర్వత పృష్ఠభాగమున ఉండునట్టి ఒకకొండ అందు గుహ్యకులు అనేకులు కొలువ కుబేరుఁడు వసించి ఉండును

## కొ

**కొమరసామి** కుమారస్వామి.

## కో

**కోంకణము** పశ్చిమసముద్రతీరమున కేరళదేశమునకు ఉత్తరమున ఉండుదేశము

**కోటికాస్యుఁడు** ఒక రాజకుమారుఁడు పాండవులు వనవాసము చేయునప్పుడు ఆశ్రమమునందు ఒంటరిగా ఉన్న ద్రౌపదిని సైంధవుఁడు చూచి మోహించి ఆమె ఎవరో విచారించి రమ్మని ఈతనిని పంపెను.

**కోలాహలుఁడు** హిమవంతుని పుత్రుఁడు మైనాకుని తమ్ముఁడు ఈపర్వతము ప్రక్కను శుక్తిమతీనది ప్రవహించును

**కోసలము** సరయూనదీప్రాంతమున ఉండిన ఒకానొకదేశము దీనికి రాజధాని అయోధ్య ఇక్ష్వాకువంశపు రాజులు దీనినిపాలించిరి ఇది శ్రీరాముల కాలమునకు పిమ్మట ఉత్తర కోసలము అని వాడఁబడును ఇది గాక వింధ్యపర్వత సమీపమున మఱియొక కోసలము కలదు దానికి శ్రీరాముల పెద్ద కొడుకు అగు కుశుఁడు కుశస్థలి అను పట్టణమును నిర్మించి రాజధానిగా చేసెను ఇది దక్షిణ కోసలము అని వాడఁబడును

# కౌ

కౌశాంబి కుశాంబుఁడు కట్టిన పట్టణము దినివకుని కాలము మొదలు అభిమన్యుని వంశ్యులకు రాజధాని

కౌర్మము ఇది ఉపపురాణములలో ఒకటి

కౌశికి గాధికూఁతురు ఋచికుని భార్య జమదగ్నితల్లి విశ్వామిత్రుని సహోదరి నా॥ సత్యవతి

కౌశికీదేవి గౌరీదేవియొక్క కాయకోశము నుండి శుంభ నిశుంభులను చంపుటకయి పుట్టినదేవి ఈమె చండుఁడు ముండుఁడు అను రాక్షసులను చంపుటచే చాముండి అనియు చెప్పఁబడును

కౌశికుఁడు (౧) ధర్మ వ్యాధునివలన ధర్మ విశేషములను ఎఱిఁగిన ఒక బ్రాహ్మణుఁడు

(౨) ప్రతిష్ఠానపురమునందు ఉండిన ఒకవిప్రుఁడు ఇతఁడు కుష్ఠ వ్యాధిచే నీరుగారుచు అసహ్యమైన శరీరముతో ఉండఁగా అతనిసతి రోఁతపడక పతికి సతతము భక్తియుక్తయై సేవ కావించుచు ధన్యురాలు అని అనిపించుకొనుచు ఉండెను అట్టి నికృష్టదశను ఉండియు అతఁడు ఒక నాఁడు ఒకవేశ్యను చూచి మోహించి దానిని పొందఁ గోరి ఆకోరికను తనపత్నితో చెప్పఁగా ఆపతివ్రత మఱిని ప్రతిభావము ఉంచక ఆరాత్రియే, వలసినధనమును కొని తనపెనిమిటిని మూఁపుపై నిడుకొని ఆవెలయాలి యింటికి పోవుచు ఉండ, దైవ యోగమున అపుడు గగనము మేఘములచే కప్పఁబడి ఉండుటఁజేసి మార్గము చొప్పడక ఉండెను అగాధాంధకారమున దారిని కొఱుతవేయఁబడి ఉండిన మాండవ్యుని, ఆ కౌశికునికాలు ఎట్లో సోఁకెను. అందులకు అతఁడు ఎవనికాలు తనపై సోఁకెనో వాఁడు సూర్యుఁడు ఉదయించుడును చచ్చుఁగాక అని ఉచ్చరించెను అంత ఆపతివ్రత, కౌశికుఁడు చచ్చిన పక్షమున తనకు వైధవ్యము సంప్రాప్తించును అని ఎంచి, సూర్యుఁడు ఉదయింపక ఉండెడుఁగాక అని పలికెను దానంజేసి సూర్యుని పొడగానరాక లోకమునకు మిక్కిలి అలజడి పుట్టిన దేవతలు ఎల్లను నలువపాలికి ఏగి మొఱపెట్టుకొనిరి అపుడు అతఁడు వారలతో మీరు భూలోకమునకు పోయి అత్రిపత్ని అగు అనసూయను ఆశ్రయించితిరేని ఈబెడ ఈ ఆపదను పాపును పొందు అనెను వారును అట్ల ఆమెచెంతకు పోయి ప్రార్థించిరి అంతట ఆమె కౌశికుని సదనమునకు ఏఁగెంచి అతని భార్యను బహువిధముల స్తుతించి నీభర్త మృతిచెందినను నవయౌవనాంగుఁడై మరల బ్రతుకును అని వరము ఒసఁగి సూర్యుఁడు ఉదయింపను అనుగ్రహింపవలయును అని వచింపఁగా ఆమె అట్ల కానిమ్ము అనియెను అప్పుడు సూర్యుఁడు ఉదయింప లోకముల అలజడి పాసెను కౌశికమునియు మృతుఁడై అనసూయాదేవి మహిమవలన పునర్జీవితుఁడు అయ్యెను ఇదిపాతివ్రత్యమువలని మహిమ.

(3) ఒకానొక ముని ఇతఁడు నారాయణ కవచమంత్రమును జపించి నిర్మలచిత్తుఁడై యోగధారణను ఒక మరుభూమియందు తనువు విడువఁగా ఆదేహము జీర్ణించి అస్థిమాత్రము అచట పడి ఉండెను ఆయస్థులకు సరిగా ఉపరిభాగమునందు చిత్రరథుఁడు అను ఒక గంధర్వుఁడు తన విమానముమీఁద పోవుచుండి, తననీడ ఆయస్థులమీఁద సోఁకినందున, అతఁడు విమానముతోకూడ తలక్రిందుగ క్రింద పడె

ను అది వాలఖిల్యముని చూచి ఆగంధర్వునితో నీవు ఈ పుణ్యశల్యములను సరస్వతీ జలముల నిక్షేపణము చేసి కృతస్నానుఁడవు కమ్ము, అట్లయిన నీకు ఊర్ధ్వగమనశక్తి కలుగును అని చెప్పఁగా అతఁడు అట్లచేసి విమానారూఢుఁడై దేవలోకమునకు చనియెను

(౪) య॥ వత్సబాలకుని (లేక) వత్సవంతుని పెంపుడుకొడుకు వసుదేవుని కొడుకు

(౫) [illegible]మిత్రునికి సామాంతరము

(౬) జరాసంధుని మిత్రుఁడు నా॥ హంసుఁడు చూ॥ డిచికుఁడు

కౌసల్య (౧) దశరథుని జ్యేష్ఠభార్య శ్రీరాముని తల్లి

(౨) యయాతిపుత్రుఁడు అగు పూరుని భార్య

(౩) నా॥ భద్ర వసుదేవుని భార్య

## క్ర

క్రతువు (౧) బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు ఇతనికి దక్షప్రజాపతి కూఁతురు అయిన సన్నతియందు అంగుష్ఠమాత్ర ప్రమాణులు అయి అఱువది వేగురు మహాతపస్సంపన్నులు అయిన వాలఖిల్యమహర్షులు పుట్టిరి

(౨) ఉల్ముకుని కొడుకు అంగుని తమ్ముఁడు

క్రిమి అ॥ ఉశీనరుని నాలవకొడుకు

క్రిమిలాపురము ఒకానొక పట్టణము క్రిమి అను వానిచే నిర్మింపఁబడినందున దీనికి ఈ పేరు కలిగెను

క్రీడి, చూ॥ అర్జునుఁడు కిరీటిశబ్దవైకృతము

క్రోధవశ దక్షప్రజాపతి పుత్రికలలో ఒకతె కశ్యపునిభార్య

క్రోష్టువు యదుపుత్రులలో రెండవవాఁడు వృజినవంతుని తండ్రి

క్రౌంచుఁడు మైనాకుని కొడుకు ఈపర్వతమును కుమారస్వామి ఛేదించి క్రౌంచదారణుఁడు అను పేరు వడసెను

## క్ష

క్షత్రధర్ముఁడు ఒకానొకరాజు పురూరవుని కొడుకైన ఆయువుయొక్క రెండవకొడుకు అగు క్షత్రవృద్ధుని వంశమునందు పుట్టినవాఁడు

క్షత్రవృద్ధుఁడు పురూరవుని రెండవకొడుకు నహుషుని తమ్ముఁడు

క్షత్రోపేక్షుఁడు య॥ అక్రూరునితమ్ముఁడు

క్షమ దక్షప్రజాపతి కూఁతురు పులహుని భార్య

క్షితిధరము నా॥ శ్రీశైలము ఇది కృష్ణానది పుట్టుచోటికి సమీపమునందు ఉండును. దీని ఉనికితావు మహారణ్యము

క్షుపుఁడు మొదటి ఖనిత్రుని కొడుకు

క్షేత్రపాలుఁడు నా॥ భైరవుఁడు ఇతఁడు దిగంబరుఁడు

క్షేమకుఁడు అభిమన్యుని వంశపురాజులలో కడపటిరాజు ఇతనితో భరతవంశము ముగిసెను

క్షేముఁడు శా॥ సునీతునికొడుకు సుకేతుని తండ్రి

క్షేమ్యుఁడు పు॥ ఉగ్రాయుధునికొడుకు.

## ఖ.

ఖగముఖుఁడు సహస్రపాదుని సహాధ్యాయుఁడు ఇతఁడు సహస్రపాదుని డుండుభము కమ్ము అని శపించెను.

ఖగేంద్రుఁడు పక్షులకెల్లను రాజు చూ॥ గరుడుఁడు

ఖట్వాంగుఁడు ఇ॥ విశ్వసహుని కొడుకు దీర్ఘబాహువు తండ్రి ఇతఁడు ఒకప్పుడు

దేవాసురుల యుద్ధమునందు దేవతలకు స
హాయముచేయఁగా వారు సంతసిల్లి వర
ము వేడుము అనిరి అపుడు ఇతఁడు
తనజీవితకాలము పరిమితిని తెలియఁ గోరెను
అంతటవారు ఇఁకను ఒక ముహూర్తకా
లము ఉన్నది అని తెలిపిరి అదితెలిసి
అంతలో తనకు మోక్షము కలుగుటకు
కావలసినదాని సాధించెను

ఖనిత్రుఁడు (౧) ప్రజాని కొడుకు క్షుపుని
తండ్రి వివింశుని తాత ఈతనితమ్ములు
ఇతని నిర్మూలము కావింప దుర్మంత్రమున
ఒక హోమము ఒనర్పఁగా ఆహోమకుం
డమునందు ఒక కృత్తి పుట్టెను దానిని ఖని
త్రుని చంపుము అని పంపఁగా అది అగణ్య
పుణ్యగణములచేత చుట్టఁబడి ఉండిన ఖని
త్రుని డాయవెఱచి మరలివచ్చి తన్ను పు
ట్టించినవారినే చంపెను

(౨) మొదటి ఖనిత్రుని వంశస్థుఁ
డు ఐన వివింశుని కొడుకు ఈతఁడు పుత్ర
సంతానము అపేక్షించి గోమతి అను పుణ్య
నదీ తటము చేరి అందు దేవేంద్రుని కూర్చి
తపము చేసిన అతఁడు ప్రత్యక్షము అయి
పుత్రుఁడు కలుగునట్లు వరము ఒసఁగెను
ఆపుత్రుఁడు బలాశ్వుఁడు అని కరంధముఁ
డు అని చెప్పఁబడును

ఖరుఁడు. రా॥ విశ్రవసునకు రాకయందు
పుట్టిన కొడుకులలో జ్యేష్ఠుఁడు జనస్థాన
మండలిసేనకు అధిపతి రామునిచేత చంపఁ
బడెను ఇతనితమ్ములు దూషణుఁడు త్రిశి
రుఁడు

ఖసృముఁడు ద॥ విప్రచిత్తి కొడుకు

## ఖా

ఖాండవము ఇంద్రునివనము అగ్నిదేవుఁడు
ప్రార్థింపఁగా కృష్ణార్జునులు దీనిని అతనికి
ఆహారముగ ఇచ్చిరి (చూ॥ శ్వేతకి) ఇది
ఉండినచోట ఇంద్రప్రస్థపురము కట్టఁబడె
ను కనుక దానికి ఖాండవప్రస్థము అని
యు ఒకపేరు కలదు

ఖాండిక్యుఁడు నిమి వంశోత్పన్నుఁడైన (ధర్మ
ధ్వజు) జనకమహారాజుయొక్క పౌత్రుఁడు
మితధ్వజుని పుత్రుఁడు ఈతఁడు తన
పినతండ్రి అగు కృతధ్వజుని పుత్రుఁడు ఐన
కేశిధ్వజునితో విరోధించి రాజ్యభ్రష్టుఁడై
అడవికి చనెను అంత కొంతకాలమునకు
వెనుక కేశిధ్వజుఁడు తనయాగ పశువు పులి
చేత చంపఁబడఁగా యాగ పరిసమాప్తి చే
యువిధము తెలియక ఖాండిక్యుని చెంతకు
వచ్చి ప్రాయశ్చిత్త విధిని ఎఱిఁగి దానికి
బదులు అతనికి బ్రహ్మజ్ఞానము బోధించెను
అంతట ఈఖాండిక్యుఁడు గోవిందుని యం
దు వదలనిభక్తి కలవాఁడై ముక్తిని పొందెను

ఖ్యాతి (౧) దక్షప్రజాపతి కూఁతురు భృ
గువుయొక్క భార్య ఈమెకు ధాత వి
ధాత అని ఇరువురు కొడుకులును, లక్ష్మి
అను కూఁతురును కలిగిరి

(౨) ఉల్ముకుని కొడుకు అంగుని
తమ్ముఁడు

## గ

గంగ ఒకానొక నది హిమవంతమునందు
పుట్టినందున దీనిని హిమవంతుని కూఁతురు
అందురు ఇది దేవలోకమునందుండి భగీ
రథుని ప్రయత్నమున భూలోకమునకు వ
చ్చెను భగీరథుఁడు, తన ముత్తాతలు అగు
సగరపుత్రులు కపిల మహామునియొక్క
కోపాగ్నిచేత నీఱుకాఁగా, వారికి సద్గతి
కలిగింప తలఁచి గంగను కూర్చి తపస్సు చేసి
భూలోకమునకు దిగివచ్చునట్లు ప్రార్థించె
ను. అప్పుడు ఆమహానది తాను భూలోక
మునకు వచ్చునెడ తనప్రవాహవేగమును

ధరింపఁ గలవారిని ఒకరిని ఏర్పఱచుకొనిన పక్షమున, తాను వచ్చునట్లు ఒప్పుకొనెను అంతట భగీరథుఁడు రుద్రునిఁగూర్చి తపము ఆచరించి అతని అనుగ్రహము పడసి, గంగాప్రవాహమును వహింప ప్రార్థించెను అపుడు గంగ మిక్కిలి అట్టహాసముతో భూమికి దిగి రాసాగెను అది రుద్రుఁడు చూచి గంగను తనప్రక్కకు ఆకర్షించి జటాజూటమునందు నిలిపి పిదప కొంత కాలమునకు భగీరథుని ప్రార్థనచే తనశిరస్సునుండి ఏడుబిందువులను భూమిమీఁద వదలెను అది కారణముగ రుద్రుఁడు మందాకినీమౌళి అనఁబడును ఆబిందువులు పడిన చోటు బిందుసరస్సు అనియు ఆబిందుసరస్సునుండి వెడలి గంగ ప్రవహించును అనియు చెప్పుదురు అట్లు వెడలి ఆగంగ జహ్నుమహాముని యజ్ఞశాలయందు ప్రవేశింపఁగా అతఁడు కోపగించి దానిని పానముచేసి, పిమ్మట భగీరథుఁడు ప్రార్థింపఁగా ప్రసన్నుఁడై తన చెవినుండి వెడల విడిచెను ఇందువలన గంగకు జాహ్నవి అనుపేరు కలిగెను. మఱియు ఈనది భగీరథునివెంట పాతాళమునకు పోయెను కనుక దీనిని త్రిజగత్కల్యాణి త్రిపథగ అని అందురు త్రివిక్రమావతారమున విష్ణువు భూమియందు ఒకపాదము ఉంచి రెండవపాదముచే మీఁది లోకమును కప్పినప్పుడు బ్రహ్మాండము పగిలి ఆకాశగంగ ఆయన పాదము గుండ క్రిందికి ప్రవహించినందున దీనికి విష్ణుపది అను పేరు కలిగెను ఊర్ధ్వలోకములయందు వ్యాపింప చేసిన త్రివిక్రమదేవుని పాదమును బ్రహ్మ తనకమండలు జలముచే కడుగఁగా ఆజలముప్రవహించి ఈనది ఏర్పడెను అనియు అది కారణముగ దీనికి విష్ణుపది అను పేరు కలిగెను అనియు కొందఱు చెప్పుదురు

గంగాద్వారము చూ॥ నా॥ హరిద్వారము

గండకి ఒకానొకనది ఇది మగధదేశము గుండ ప్రవహించి గంగలో సంగమము అవును

గంధమాదనము ఒకకొండ ఇది ఇపుడు గాండ్వానా అనఁబడుదేశమందు ఉండును

గంధమాదనుఁడు (౧) ఒకవానరుఁడు వీఁడు సుగ్రీవుని సేనయందు ఒకఁడు కుబేరుని వలన పుట్టినవాఁడు

(౨) య॥ అక్రూరుని తమ్ములలో ఒకఁడు

గంధర్వులు దేవతలలో ఒకతెగవారు హాహా హూహూ ప్రభృతులు కశ్యపునికి ప్రాధయందు పుట్టినవారు

గందవతి (౧) వాయువుయొక్క రాజధాని

(౨) వ్యాసునితల్లి అగు సత్యవతికి నామాంతరము

గజకర్ణుఁడు ఒకయక్షుఁడు

గజాస్యుఁడు వినాయకునికి నామము దక్షాధ్వర ధ్వంసమప్పుడు వీరభద్రునిచే ఈతని తల నఱకఁబడెను అపుడు సర్వకార్యముల విఘ్నములను చెఱచునట్టి ఇతనిని బ్రతికింపుము అని దేవతలు శివుని ప్రార్థింపఁగా శివుఁడు ఏజంతువు ఉత్తరపుతలాఁపిగా పండుకొని ఉండునో దానితల నఱకితెచ్చి ఈమొండెముతో అతికించినయెడ ఇతఁడు జీవించును అని చెప్పెను అదితెలిసి ఎల్ల జంతువులును వెఱచి ఉత్తరపుతట్టు తలపెట్టుకొని శయనింపక ఉండెను ఏనుఁగుమాత్రము మదాతిశయముచేత ఒళ్లెఱుఁగక ఉత్తరపుతలాఁపిగా పండుకొని ఉండెను అది చూచి దేవతలు దానితల నఱకి తెచ్చి మొండెముతో అతికింప వినాయకుఁడు బ్రతికెను కనుక ఇతనికి ఈరూపమును నామమును కలిగెను.

గజుఁడు ఒకదానవుఁడు వీఁడు తారక యుద్ధమున రుద్రునిచే చంపఁబడెను వీని చర్మమును రుద్రుఁడు ధరించి ఉండునుగాన రుద్రునికి గజచర్మధారి అని పేరు కలిగెను

గణపట్టి కాత్యాయనునిచే రచింపఁబడిన ఒక నిఘంటువు ఇందు పదములు వేఱువేఱ గణములుగ ఏర్పఱచి లింగ నిర్ణయము చేయఁబడి ఉండును

గణపతిదేవుఁడు ఒక ఆంధ్రకవి ఇతఁడు మిక్కిలి ప్రామాణికుఁడు శివయోగసారము అనునొక వేదాంత గ్రంథమును రచియించెను అందు అపూర్వములు అయిన దేశ్యపదములు అనేకములు ఉన్నవి

గణేశుఁడు వినాయకుఁడు

గదుఁడు య॥ బలరాముని భ్రాత రోహిణియందు వసుదేవునికి పుట్టిన కొడుకు

గయ. కాశియొద్ద ఉండెడు ఒక పుణ్యక్షేత్రము ఇందు అక్షయవటము అని ఒకమఱ్ఱిమ్రాను కలదు దానిక్రింద తీర్థ శ్రాద్ధము చేసిన మహావిశేషము అందురు

గయుఁడు (౧) ఉల్ముకుని కొడుకు అంగుని తమ్ముఁడు

(౨) ఒకచక్రవర్తి ప్రియవ్రతుని వంశస్థుఁడు అయిన నక్తుని కొడుకు ఇతఁడు ఏనూఱు అశ్వమేధయాగములు చేసి అసంఖ్యేయులయిన ఋత్విజులను సభ్యులను పూజించి సువర్ణమయ గోదానములు అనేకములు ఇచ్చి అక్షయములు అగు ఇంద్రలోక సుఖములను పడసెను

(3) అమూర్తరజునికొడుకు ఇతఁడు అనేకయజ్ఞములు కావించి రాజర్షి అయ్యెను ఈతని యజ్ఞవాటమే గయ అనుపుణ్యక్షేత్రము

గరుటామంతుఁడు. } గరుత్మంతుఁడు
గరుటాలమంతుఁడు }

గరుడపంచమి శ్రావణ శుక్లపంచమి ఇది సుమంగలులకు ఒకవ్రతదినము

గరుడుఁడు నా॥ తార్క్ష్యుఁడు కశ్యపప్రజాపతికి వినతవలన పుట్టిన కొమారుఁడు ఇతని అన్న అనూరుఁడు

ఇతఁడు తనతల్లి అయిన వినతయొక్క దాసీత్వమును మాన్పుటకై కద్రువయొక్క పుత్రులు కోరినప్రకారము దేవేంద్రుని గెలిచి అమృతము తెచ్చి ఇచ్చెను అట్లు తేఁబోవు సమయమున గరుడుఁడు తనకు లావుగలుగ తగిన ఆహారమును ఉపదేశింపుము అని తల్లిని వేఁడి ఆమె సముద్ర మధ్యమునను ఉండి అప్పుడప్పుడు ప్రజలకు అపకారము చేయుచు ఉండెడు పుళిందులను భక్షింపుము అని చెప్పఁగా అతఁడు అట్లు చేసి అది చాలక మార్గమునందు తండ్రిని చూచి మఱియొక ఆహారముచూపుము అని అడుగఁగా ఆతఁడు విభావసుఁడు సుప్రతీకుఁడు అనునిద్దఱు అన్నదమ్ములు పిత్రద్రవ్యమును పంచుకొనుటకై పోరాడి ఒకరిని ఒకరు శపించుకొని ఆఱుయోజనముల పొడవును పన్నెండు యోజనముల నిడుపును కల గజమును, మూఁడుయోజనముల లావును పది యోజనముల మండలమును కలిగిన కచ్ఛపమును అయి ఉన్నారు, వారిని కొని భుజించి పొమ్ము అనెను అంతట ఇతఁడు ఆగజ కచ్ఛపములు ఉన్నచోటికి పోయి వాని రెంటిని తన్నుకొనిపోవుచు మార్గమందు ఒక గొప్పవృక్షశాఖయందు నిలువ పోవ అది ఆధారమునకు తాళక విఱిగెను. అప్పుడు వాలఖిల్యమహామునులు ఆశాఖయందు వ్రేలుచు తపస్సుచేయుచు ఉండిరి కనుక వారికి విపత్తు కలుగును అను భీతిచే ఆశాఖను క్రింద పడనీయక ముక్కున కఱచి పట్టుకొని తండ్రియొద్దకు పోయెను. అప్పుడు

ఆయన ఇతని అభిప్రాయమును ఎఱిఁగి వాలఖిల్యమునులను శాఖయందు ఉండి దిగుఁడు అని ప్రార్థించి వారు విడిచిపోఁగా ఆశాఖను హిమవంతమునొద్ద నిష్పురుష నగమునందు పాఱవైచును అని గరుడునికి చెప్పెను గరుత్మంతుఁడు అట్లేచేసి గజకచ్ఛపములను భక్షించి చనియెను ఇతఁడు పక్షీంద్రుఁడు

గరుత్మంతుఁడు చూ॥ గరుడుఁడు

గర్గుఁడు (౧) యాదవుల పురోహితుఁడు వసుదేవుని పంపున నందునియింట బలరామకృష్ణులకు నామకరణాది సంస్కారములను కావించినవాఁడు

(౨) పు॥ హుతమన్యుని (లేక భుమన్యుని) కొడుకు శినితండ్రి

గవాక్షుఁడు సుగ్రీవుని సేనయందలి ఒకవానరుఁడు

## గా

గాండివము అర్జునునిధనుస్సు దీనిని అగ్నిదేవుఁడు ఖాండవ వనదహనమప్పుడు అర్జునునకు ఇచ్చెను

గాంధారము గాంధారునిచే ఏలఁబడిన దేశము ఇది ఆర్యావర్తమునకు పశ్చిమమున సింధునదీ సమీపమున ఉండును

గాంధార ధృతరాష్ట్రునిభార్య గాంధారదేశపురాజయిన సుబలుని కూఁతురు. పరమపతివ్రత పెనిమిటి అంధుఁడు ఐనందున తానును పరపురుషదర్శనము చేయఁ గూడదు అను నియమముచే ఎప్పుడును కన్నుల గంత కట్టుకొని ఉండును ఈమెకొడుకులు దుర్యోధనాదులు అందు పెద్దవాఁడు అగు దుర్యోధనుఁడు యుద్ధమునకు పోవునపుడు జయము కలుగ వరమువేఁడఁగా 'యతో ధర్మస్తతోజయః" అనిచెప్పెను ఈమె మతి అను దేవతాంశమున జనించినది

గాంధారుఁడు యయాతికొడుకు అగు ద్రుహ్యునియొక్క పౌత్రునికి పౌత్రుఁడు ఇతనిపేర గాంధారము అని ఒకదేశము ప్రసిద్ధి కాంచెను ఆకులమునందు పుట్టినవారు తురగారోహణ కుశలులును విక్రమాదిగుణములచే ప్రసిద్ధులును అయిన వారు

గాధి కుశాంబుని కొడుకు విశ్వామిత్రుని తండ్రి శ్రీమద్వాల్మీకి రామాయణమున ఇతఁడు కుశనాభుని కొడుకు అని చెప్పి ఉన్నది

గారుడము ఒకపురాణము ఇది గరుడోద్భవ బ్రహ్మాండ విషయాదులను గూర్చి చెప్పను దీనిగ్రంథసంఖ్య ౧౯౦౦౦

గార్గ్యుఁడు పు॥ శినికొడుకు బాష్కలుని శిష్యుఁడు ఋగ్వేదాధ్యాపకుఁడు ఈతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి

గాలవుఁడు (౧) కువలయాశ్వునికి అశ్వమును ఇచ్చిన ఒకఋషి

(౨) శుక్లయజుర్వేదాధ్యాపకుఁడుఐన ఒక ఋషి ఇతనిని, గురువు ఐన విశ్వామిత్రుఁడు ధవళవర్ణములు అయి ఒక్కొకకర్ణము నీలమైన ఉత్తమాశ్వములను ఎనమన్నూటిని తనకు గురుదక్షిణగా తెచ్చి ఇమ్ము అనిన ఆగుఱ్ఱములను ఎందును పడయనేరక తనబాలసఖుఁడు ఐన గరుడుని వెంటబెట్టుకొని యయాతిదగ్గఱకు పోయి అతని పుత్రిక అగు మాధవి అను కన్యను పడసి ఆమెసహాయమున అయోధ్యాధిపతి అగు ఇక్ష్వాకు మహారాజు నొద్దను భోజపురినాథుఁడు అగు శిబియొద్దను కాశిరాజు అగు దివోదాసునియొద్దను ఇన్నూటేసి హయములను పడసి ఆకన్యను ఆఱు నూఱుగుఱ్ఱములను విశ్వామిత్రునకు ఇచ్చి అతనిని తృప్తి పొందించెను

## గి

**గిరివ్రజము** ఒకపట్టణము మగధదేశముయొక్క రాజధాని దీనిచుట్టును కోటకట్టినట్టు కొండలు ఉండుటచే దీనికి ఈపేరు కలిగెను ఈనామమున మఱియొక పట్టణము కలదు అది కేకయదేశమునకు రాజధాని ఇందు మొదటిది కుశుని నాలవ కొడుకు ఐన వసువు కట్టినది అది ధర్మారణ్యమునకు సమీపమున మగధదేశమున ఉండును

## గు

**గుండవిభునారసింహుఁడు** ఆంధ్రదేశమున ఒకసామంతరాజు ఇతని తండ్రి గుండవిభుఁడు తల్లి మల్లాంబ ఈతనికి జైమిని భారతము అంకితము ఒనర్పఁబడెను.

**గుజరాతి** / **గుజ్జరాతి** / **గుజ్జరి** } ఘూర్జరదేశము ఇది పూర్వము అనర్తదేశము అనఁబడును

**గుణాఢ్యుఁడు** రుద్రునిశాపముచే భూలోకమున పుట్టిన మాల్యవంతుఁడు

**గుప్తులు** కొందఱు సామంతరాజులు ఆంధ్రభృత్యులకాలమున మగధరాజ్యము అనేక భాగములు అయ్యెను అందు ప్రయాగవఱకు కల గంగ గట్టు భూమిని వీరు ఏలిరి

**గురుఁడు** (౧) పు॥ నా॥ రుచిరథుఁడు సంకృతి కొడుకు

(౨) బృహస్పతి

**గురువరాజు** ఒక ఆంధ్రకవి ఇతఁడు చంద్రరేఖాపరిణయమును రచించెను

**గుహుఁడు** (౧) నా॥ కుమారస్వామి

(౨) శృంగిబేరపురమునకు ప్రభువు అగు ఒక కిరాతరాజు రామునికి భక్తుఁడు.

**గుహ్యకులు** కుబేరుని నవనిధులను పాలించువారు (తెలుఁగుగా కుచ్ఛితము పలుకువారు అనిశబ్దార్థము) వీరు మాణిభద్రాదులు

## గృ

**గృహపతి** ఒక అగ్ని ఇతఁడు ఇంద్రాదిదేవతలకు హవ్యమును మోచికొనిపోయి ఇచ్చును కనుక ఇతనికి హవ్యవాహనుఁడు అనునామమును కలదు ఒకప్పుడు ఇతఁడు హవ్యములను మోవఁజాలక సముద్రమునందు డాఁగి ఉండఁగా అందలి మత్స్యములు ఇతఁడు ఉండుతావు దేవతలకు చెప్పెను అందువల్ల మత్స్యములు జనులకు ఆహారము అగునట్లు అతఁడు శపించెను'

## గాం

**గాంతి** కుంతి

## గో

**గోకర్ణము** కేరళదేశమునందు ఉండు ఒక గొప్ప శివక్షేత్రము రావణుఁడు తపస్సు చేసి బ్రహ్మచే వరముపడసిన చోటు.

**గోకులము** యమునానదీతీరమున బృందావనముదగ్గఱ ఉండు గొల్లపల్లె కృష్ణుఁడు ఇచట పెరిగెను దీనినే వ్రేపల్లె అందురు

**గోతముఁడు** ఒకానొకముని ఈతని కొడుకు అగు శాక్యబుద్ధని గౌతముఁడు అని చెప్పుదురు

**గోత్రములు** ఇవి అనేకములు అందు కొన్ని శిష్యపరంపరను కొన్ని పుత్త్రపరంపరను తెలియ చేయును వీనిని ఇన్ని అని లెక్కపెట్టి చెప్పుట అసాధ్యము అయినను ఇందు ముఖ్యమైనవి ఏఁబది అవి కాశ్యప భారద్వాజ హారిత కౌండిన్య కౌశిక వసిష్ఠ గౌతమ గార్గేయ శ్రీవత్స ఆత్రేయ ముద్గల శఠమర్షణాదులు. వానిలో ప్రతిదానియందును అంతర్భాగములు అనేకములు కలవు. మఱియును అవి ఏకార్షేయములు ద్వ్యార్షేయములు త్ర్యార్షేయములు పంచార్షే

యములను అయి ఉండును అనఁగా ప్రవర చెప్పునపుడు కొందఱు ఒక ఋషిని కొందఱు ఇద్దఱు ఋషులను కొందఱు ముగ్గురు ఋషులను కొందఱు అయిదుగురు ఋషులను చెప్పిచెప్పుదురు అని అర్థము

గోపతి అంగిరసుని వంశస్థుఁడు అగు ఒక అగ్ని

గోపరాష్ట్రము కొంకణదేశపు దక్షిణభాగము

గోభానుఁడు యయాతి పుత్రుఁడు అగు తుర్వసుని పౌత్రుఁడు

గోమతి ఒకనది ఇది హిమవత్పర్వతమునందు ఉత్పత్తి అయి కోసలదేశము గుండ ప్రవహించి గంగలో సంగమము అగును

గోముఖుఁడు శాకల్యుని శిష్యుఁడు

గోవర్ధనము మధురాపురము సమీపమున ఉండు ఒక కొండ కృష్ణుఁడు ఇంద్రయాగము చేయుచు ఉన్న గోపాలురకు దానివలన ఫలములేదు అని బోధించి ఇంద్రుఁడు అందులకు మిగుల అలిగి వారికి ఉపద్రవము కలుగునటుల శిలావర్షము కురిపింపఁగా తాను ఆపర్వతమును ఎత్తి గొడుగుగా పట్టి దానిక్రింద అచటి గోవులను గోపాలురను నిలిపి రక్షించెను పిదప ఇంద్రుఁడు కృష్ణుని శక్తి ఎఱిఁగి ఆతనితో బద్ధసఖ్యుఁడై అతనిని గోవులకు అధిపతినిగా చేసి పోయెను అందువలన కృష్ణునకు గోవిందుఁడు అనుపేరు కలిగెను

గోవింద భగవత్పాదాచార్యులు శ్రీమచ్ఛంకరాచార్యులవారి గురువు గౌడపాదాచార్యుల శిష్యులు

గోవిందుఁడు నా॥ కృష్ణుఁడు చూ॥ గోవర్ధనము

గోశకుఁడు శాకల్యుని శిష్యుఁడు

## గౌ

గౌడపాదాచార్యులు శ్రీశుకుల శిష్యుఁడు యతి గోవిందభగవత్పాదులకు గురువు ఈయన ఉత్తరగీతకు భాష్యము వ్రాసెను

గౌడపురి నా॥ లక్ష్మణవతి వంగదేశమందలి ఒక ముఖ్యపట్టణము ఇచట ముందు జహ్నుమహర్షియొక్క ఆశ్రమము ఉండినట్లు చెప్పుదురు ఇందు ఉండు బ్రాహ్మణులు గౌడులు అనఁబడుదురు వీరు అభిమన్యుని పుత్రుఁడు అగు పరీక్షిత్తుయొక్క కాలమున కురు కోసల దేశములనుండి వచ్చిరి

గౌడము వంగదేశము ఈదేశస్థులు పంచగౌడులలో ఒక్కరు

గౌతమాశ్రమము. ఇది విశాలపురినుండి మిథిలాపురమునకు పోవు మార్గమున ఉండును దీనికి సమీపమున నిమిచే నిర్మింపఁబడిన జయంతపురము అను ఒకపట్టణము కలదు.

గౌతమి. గోదావరి.

గౌతముఁడు (౧) శతానందుని తండ్రి కృపాచార్యుల పితామహుఁడు
(౨) కణాదునికి నామాంతరము.
(౩) శాక్యబుద్ధుఁడు

గౌతమునిగోవు రాజమహేంద్రపురము దగ్గఱ గోదావరినదికి దక్షిణపు ఒడ్డున ఉండు కోవూరిక్షేత్రవాసి అగు గౌతముఁడు తపము ఆచరించుచు ఉండఁగా ద్వాదశవర్షక్షామము ఒకటి సంభవించెను. అప్పుడు అక్కడ ఉండిన ఋషులు అందఱును అతని చెంతకు వచ్చిరి అతఁడు వారిని ఆదరించి ప్రతిదినమును తాను అనుష్ఠానమునకు కూర్చుండఁ బోవునపుడు పిడికెఁడు వడ్లు కొని పోయి గోదావరి యిసుకలో మడిచేసి చల్లివచ్చిన ఆవడ్లు అతని తపోమహిమచే అప్పుడె మొలచి పైరై ఆయన అనుష్ఠానము

నైజవేర్చుకొను నంతలో పండి సిద్ధము అగును అంతట ఆధాన్యమును తెచ్చి తనయొద్దకు వచ్చియుండు ఋషులకు అందఱకు భోజనము జరగించును ఇట్లు పండ్రెండు ఏండ్లును కడపి క్షామము తీఱఁగానే ఆ ఋషులు అందఱు తమ తమ నివాసములకు పోవుచు గౌతముని తమవెంట రమ్ము అని వేఁడిరి అందులకు అతఁడు ఒప్పకపోఁగా వారు ఒక మాయాగోవును సృష్టిచేసి అతఁడు నిత్యము వేసికొను వరిపైరును మేసి పోవునట్లు చేసిరి అప్పుడు గౌతముఁడు ఒక దర్భకఱ్ఱతో దానిని కొట్టి అదలింపఁగా అంతమాత్ర మున నే ఆ మాయాగోవు తనదూడతో కూడ పడి చచ్చెను అంతట ఆఋషులు గౌతముఁడు గోహత్య చేసెను అని నిందించి అతనిని చాంద్రాయణవ్రతము ఆచరింపుము అని విధించి చనిరి కనుక ఎవరేని అదలించిన మాత్రమున మిక్కిలి బాధింపఁబడిన వారి వలె అభినయించిరేని "అబ్బా గౌతముని గోవురా ఇది" అని అందురు

గౌరముఖుఁడు. రు॥ శమీకుని శిష్యుఁడు.

గౌరి (౧) పార్వతి.

(౨) వరుణుని భార్య

గౌరీగంగ. కైలాసపర్వతమునందలి ఒక నది

గౌళులు చూ॥ పంచగౌళులు

## గ్ర

గ్రసనుఁడు. తారక యుద్ధమున విష్ణువుచే చంపఁబడిన రాక్షసుఁడు

గ్రామదేవత. గంగమ్మలోనగు స్త్రీదేవత ఒక్కొక్క విశేషమును పట్టి పరాశక్తిరూపమైన దేవిని ఒక్కొక నామముతో అక్కడక్కడ పూజింతురు. అందులకు కారణములు ఆయాయి స్థలపురాణముల వల్లను ఇతిహ్యాములవల్లను ఎఱుఁగఁదగి ఉండును.

## ఘ

ఘంటాకర్ణుఁడు వీఁడు పిశాచ నాయకుఁడు అగు కుబేర కింకరుఁడు శ్రీకృష్ణుఁడు ఒకప్పుడు బదరీవనమునందు సమాధియోగమున ఉండఁగా వీఁడు చూచి సంభాషించి నియమము అనుష్ఠించి తన పిశాచదేహమును వదలి పుణ్యలోకమునకు పోయెను

ఘటోత్కచుఁడు భీమసేనునికి హిడింబ వలన పుట్టిన కొడుకు భారతయుద్ధమునందు ఒక్కరేయి ఒక అక్షౌహిణిదండును చంపి, కడపట అర్జునుని చంపవలెను అని కర్ణుఁడు ఇంద్రునివలన కైకొనిన శక్తిచే చంపఁబడెను

ఘట్టుప్రభువు. ఒకానొక ఆంధ్రకవి ఇతఁడు కుచేలోపాఖ్యానము సురాభాండేశ్వరము అను గ్రంథములను రచించెను

ఘుర్మ్యుఁడు. గాంధారుని పుత్రుఁడు

## ఘూ

ఘూర్జరము ఒకానొకదేశము ఇది పశ్చిమసముద్రతీరమందు ఉండును దీనినేగుజరాతి అందురు

ఘూర్జరులు ఘూర్జర దేశస్థులు పంచద్రావిళ్లలో ఒక్కరు

## ఘృ

ఘృతాచి. ఒక అప్సరస.

## ఘో

ఘోషమణి నకులుని శంఖము

## చ

చండకౌశికుఁడు. ఒకానొకముని గౌతమవంశస్థుఁడు మగధదేశపు రాజు అగు బృహద్రథుఁడు ఇతని అనుగ్రహము వలన

ఒకమామిడిపండును పడసి దానిచే జరాసంధుఁడు అను కొమారుని పడసెను

చండముండులు ర॥ శుంభనిశుంభులభృత్యులు చూ॥ కౌశికీదేవి

చండామార్కుఁడు శుక్రుని పుత్రుఁడు దైత్యులకు పురోహితుఁడు (చండుఁడు మార్కుఁడు అని రెండునామములుగా కొందఱు చెప్పుదురు )

చండికేశ్వరుఁడు / చండుఁడు } ఒకబ్రాహ్మణ చిన్నవాఁడు ఇతఁడు ఈశ్వరునియందు అతిభక్తి కలిగి తదేకధ్యానమున పూజచేయువేళ తండ్రి దానికిభంగము చేయ రాఁగా ధ్యానపరత్వమున అతనిని ఎఱుఁగక కాళ్లు విఱుగ కొట్టెను అపుడు ఈశ్వరుఁడు ప్రత్యక్షమై పితాపుత్రులకు ఇరువురకును మోక్షము ఇచ్చెను అనిప్రసిద్ధి

చందన అంగదేశముగుండ ప్రవహించు ఒక నది

చంద్రకేతుఁడు శ్రీరాముల తమ్ముఁడు అగు లక్ష్మణుని రెండవ కొడుకు

చంద్రగిరి నరస భూపాలుని రాజధాని

చంద్రగుప్తుఁడు నందులకు అనంతరము మగధ దేశమునకు రాజులు అయిన మౌర్య్యులకు మూల పురుషుఁడు ఇతని తల్లి మురా · ఆమె పేర ఈవంశస్థులు మౌర్య్యులు అనఁబడిరి ఇతఁడు క్రీ॥ శ॥ మున్నూఱు సంవత్సరములకు ముందు రాజ్యము చేసినట్లు తెలియఁబడుచు ఉన్నది

చంద్రభాగ సింధునదికి ఉపనది

చంద్రమతి హరిశ్చంద్రుని భార్య ఈమె మహాపతివ్రత. తనభర్తయొక్క సత్యసంధత నిలుపుటకై తాను దాసిగా అమ్ముడుపోవుటకాక ప్రాణత్యాగమునకును ఒడఁబడెను

చంద్రరేఖ ఒక అప్సరస

చంద్రలోకము స్వర్గమునందు పితరులు ఉండులోకము దీనిని పితృలోకమనియు చెప్పుదురు

చంద్రవక్త్రుఁడు నా॥ చంద్రకేతుఁడు

చంద్రశర్మ విష్ణుశర్మకొడుకు విక్రమార్కునితండ్రి ఇతఁడు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర జాతులు నాలుగింటను నలుగురు కన్యకలను పెండ్లాడి బ్రాహ్మణ స్త్రీయందు వరరుచిని క్షత్రియస్త్రీయందు విక్రమార్కుని వైశ్య స్త్రీయందు భట్టిని శూద్ర స్త్రీయందు భర్తృహరిని కొమారులుగా కనియెను అందు భట్టి విక్రమార్కునకు మంత్రి అయ్యెను

చంద్రాలోకము ఒక అలంకార శాస్త్రము ఇది కాళిదాసకృతము

చంద్రాశ్వుఁడు నా॥ దండాశ్వుఁడు.

చంద్రుఁడు. (౧) ఒక గ్రహము. అత్రి కొడుకు తల్లి అనసూయ ఇతఁడు నక్షత్రములకు బ్రాహ్మణులకు ఓషధులకు యజ్ఞములకు తపస్సుకు అధిపతి ఈతనికి దక్షప్రజాపతి కొమార్తెలు అగు అశ్విన్యాదులు ఇరువదియేడుగురు భార్యలు అయిరి అందు రోహిణి ప్రియభార్య వీరినేనక్షత్రములు అందురు. చంద్రునికి బృహస్పతి భార్య అగు తారయందు బుధుఁడు పుట్టెను ఇందుఁడు సోముఁడు ఇత్యాదులు చంద్రునకు నామాంతరములు చంద్రుఁడు సముద్రమథనమప్పుడు పాలసముద్రమునందు పుట్టెను అనియు పురాణములు చెప్పుచున్నవి (ఇది కల్పభేదమువలన కలిగినది అని కొందఱు చెప్పెదరు ) మఱియు ఇతనియందు కుందేలు ఉన్నది అనియును జింక ఉన్నది అనియును కావ్యములయందు వర్ణింపఁబడుటచేత ఇత

నికి శశాంకుఁడు మృగాంకుఁడు అను నామములును కలవు అమృతకిరణుఁడు అగుటచే ఇతని కిరణములను దేవతలు పానము చేయుదురు కనుక విధుఁడు అనియు అనఁబడును అందఱు భార్యలందును సమముగా ప్రవర్తింపక రోహిణియందుమాత్రము ప్రీతి గలవాఁడైనందున దక్షుఁడు ఇతనికి క్షయ రోగము కలుగుఁగాక అని శపించెను

చంపానగరము అంగదేశపురాజు అయిన చంపునిచే నిర్మింపఁబడిన పట్టణము ఇది అంగదేశమునకు రాజధానిగా ఉండెను

చంపుఁడు ఇ॥ (౧) హరితునికొడుకు సుదేవుని తండ్రి

(౨) అం॥ పృథులాక్షుని కొడుకు. చంపానగరమును నిర్మించినరాజు

చక్రవాళము లోకాలోకపర్వతము ఇది చక్రాకారముగ భూమిని చుట్టి ఉండును కనుక దీనికి ఈనామము కలిగెను

చక్రసమీరదైత్యుఁడు చూ॥ తృణావర్తుఁడు

చతురంగుఁడు అం॥ రోమపాదుని కొడుకు

చమసోద్భేదము ఒకతీర్థము

చర్మణ్వతి ఒకనది ఇది వింధ్యపర్వతమున ఉత్పత్తి అయి ఉత్తరవాహిని అగుచు యమునయందు సంగమము అవును

చక్షుర్నది గంగతో కలియు ఒక నది

చక్షుర్మనువు సర్వతేజస్సుయొక్క కొడుకు ఇతఁడు స్వాయంభువ మనువువంశస్థుఁడు తల్లి ఆకూతి భార్య నడ్వల. కొడుకులు- పురువు కుత్సుఁడు త్రితుఁడు ద్యుమ్నుఁడు సత్యవంతుఁడు ఋతుఁడు వ్రతుఁడు అగ్నిష్టోముఁడు అతిరాత్రుఁడు సుద్యుమ్నుఁడు శిబి ఉల్ముకుఁడు అనువారు పన్నిద్దఱు ఇందు కడపటికొడుకు అయిన ఉల్ముకుఁడు అంగుని తండ్రి.

చక్షువు యయాతి పౌత్రుఁడు తండ్రి అనువు

## చా

చాణూరుఁడు ర॥ కంసుని భటుఁడు అగు మల్లుఁడు వీఁడు మిక్కిలి శూరుఁడు కృష్ణుఁడు వ్రేపల్లెనుండి మధురానగరమునకు వచ్చినప్పుడు కంసునిపంపున అతని ఎదిరించి మల్లయుద్ధముచేసి అతనిచేత చంపఁబడెను

చాముండేశ్వరి వింధ్యవాసిని అయిన పరాశక్తి ఈమె మైసూరికి సమీపమున ఒక కొండయందు ప్రతిష్ఠింపఁబడి ఉండును చూ॥ కౌశికీదేవి

చారణులు దేవతాభేదము

చారుపదుఁడు, చారువు } పు॥ మనస్యునికొడుకు

చార్వాకము ఒక మతము ఈమతస్థులు ఇంద్రియగోచరములు అయిన ప్రత్యక్ష విషయములు తప్ప తక్కినవానిని నమ్మరు సర్వము స్వభావసిద్ధములు అనియు దైవము లేదు అనియు వారు వాదింతురు. ఇట్టివే నాస్తిక మతములు. ఈమతమును అవలంబించువారు చైతన్యులు అనఁబడుదురు

చార్వాకుఁడు (౧) దుర్యోధనునికి మిత్రుఁడు అగు ఒకరాక్షసుఁడు వీఁడు, ధర్మరాజు కౌరవులను నాశముచేసి కృతకృత్యుఁడై పట్టాభిషేకము చేసికొను కాలమున, ఋషివేషముతో వచ్చి దానికి విఘ్నముచేయబూని ఋషులకోపదృష్టిచే నీఱై నశించెను

(౨) చార్వాకమతమును స్థాపించినవాఁడు

చాక్షుషుఁడు ఒకమనువు విశ్వకర్మ కొడుకు అని శ్రీమద్భాగవతమునందు చెప్పి ఉన్నది.

## చి

చిత్రకుఁడు ఒక యాదవుఁడు వృష్ణివంశమున జనించినవాఁడు వృష్ణియొక్క రెండవకొడుకు

చిత్రకూటము ఒకానొకకొండ ఇది ఇప్పుడు బండల్కాండు అని చెప్పఁబడు దేశమునందు ఉన్నది వాల్మీకియొక్క ఆశ్రమము ఇందు ఉండెను రాముఁడు అరణ్యవాసమునకు పోవునపుడు ఇందు కొన్నిమాసములు నివసించి ఉండెను ఇది శృంగిబేరపురమునకు నిరృతిదిశయందు ఉండును

చిత్రకేతుఁడు (౧) య॥ వసుదేవుని తమ్ముఁడైన దేవభాగుని పెద్దకొడుకు

(౨) శూరసేనదేశపురాజు ఇతఁడు సంతానములేక ఉండి చిరకాలమునకు ఒకపుత్రుని పడసెను ఆపుత్రుఁడు (తనమాఱుతల్లులు విషముపెట్టి చంపఁగా) బాల్యముననే చచ్చినందున చిత్రకేతుఁడు, పుత్రశోకమును సహింపలేక కడు దుఃఖితుఁడై విలపించుచు ఉండెను అప్పుడు నారదుఁడును అంగిరసుఁడును వచ్చి అతనికి జ్ఞానోపదేశము చేసిపోయిరి అంతట అతఁడు తెలివిని ఒంది జ్ఞానవంతుఁడై దేహమును వదలి దేవత్వమును వహించి విద్యాధరాధిపతి అయి ఒకప్పుడు కైలాసమునకు పోయి అచ్చట పార్వతితో కూడుకొని ఉండు శివునిచూచి జగత్కర్తలు అయినవారు కూడ ఇట్లు మిథునరూపముగ ఉండుదురా అని పార్వతీదేవి వినునట్లు పలికెను అందులకు ఆమె కోపించి అతనిని రాక్షసుఁడు అగునట్లు శపించెను. అంత అతఁడు వృత్రాసురుఁడుగ పుట్టి ఇంద్రుని చేత చంపఁబడి మోక్షమును పొందెను

చిత్రగుప్తుఁడు యమునియొద్ద ఉండు గణకుఁడు ఇతఁడు మనుజులయొక్క నిత్యకృత్యములను అప్పుడప్పుడు వ్రాయుచు ఉండును కనుక వారువారు చేసిన కృత్యములను వీనిలెక్కప్రకారము విచారించి యముఁడు ఎల్లవారిని దండించుచు ఖండించుచు ఉండును

చిత్రరథుఁడు (౧) ఒకగంధర్వుఁడు చూ॥ మూడవ కౌశికుఁడు

(౨) య॥ ఛేరుశంకుని పుత్రుఁడు శశిబిందుని తండ్రి

(౩) అ॥ దివీరథుని కొడుకు

(౪) దుర్యోధనుని తమ్ముఁడు

చిత్రరేఖ (౧) బాణాసురుని మంత్రియైన కుంభాండుని కూఁతురు ఉషకు చెలికత్తె ఈమె చిత్రముల వ్రాయుటయందు మిగుల నేర్పరి కనుక ఈపేరు పొందెను

(౨) నా॥ చిత్రాదేవి

చిత్రవాహనుఁడు మణలూరుపురపు రాజు అర్జునునిభార్యయైన చిత్రాంగదయొక్క తండ్రి బభ్రువాహనుని మాతామహుఁడు

చిత్రసేనుఁడు (౧) ఒకగంధర్వుఁడు. అర్జునునికి స్నేహితుఁడు పాండవులు ద్వైతవనమున ఉండు సమయమున దుర్యోధనాదులు వారికి తమ ఐశ్వర్యముచూపి పరిహసింపదలఁచి ఘోషయాత్రనెపమున ఆవనమునకువచ్చి పాండవులు అచ్చట ఒకసరస్సుగట్టున సద్యస్కాండము అను యజ్ఞము చేయుచు ఉండఁగా దాని యావలిగట్టున గుడారములు వన్నించుచు ఉండిరి అప్పుడు చిత్రసేనుని దూతలు వచ్చి ఈసరోవరము మారాజునకు క్రీడార్థము కల్పింపఁబడినది మీరు ఇచటనిలువక తొలఁగిపొండు అనఁగా వారిమాట వినక ఈగంధర్వునిచేత తమ ఆఁడువారితో కూడపట్టుపడిరి అప్పుడు ధర్మరాజు భీమార్జున నకులసహదేవులను పంపి వారిని విడిపించెను.

(౨) దుర్యోధనుని తమ్ములలో ఒకఁడు
(౩) కర్ణుని కొడుకు వీఁడు నకులునిచేత చంపఁబడెను
(౪) నరిష్యంతునికొడుకులలో ఒకఁడు
(౫) జరాసంధుని మిత్రుఁడు చూ॥ నా॥ డిచికుఁడు

చిత్రాంగద అర్జునునిభార్య చిత్రవాహనుని కూఁతురు కొడుకు బభ్రువాహనుఁడు

చిత్రాంగదుఁడు (౧) ఒకానొక గంధర్వుఁడు
(౨) విచిత్రవీర్యుని అన్న ధృతరాష్ట్రుని పెదతండ్రి ఇతఁడు బాల్యముననే తనపేరుకల గంధర్వునిచేత చంపఁబడెను
(౩) దుర్యోధనునితమ్ములలో ఒకఁడు

చిత్రాంగి రాజరాజనరేంద్రుని భోగస్త్రీ అతి దుర్మార్గురాలు కనుక లోకులు సాధారణముగా దుష్టులైనస్త్రీలను చిత్రాంగి అనిచెప్పి నిందింతురు

చిత్రాదేవి కుబేరునిభార్య ఈమెను చిత్రరేఖ అనియు అందురు

చిత్రాయుధుఁడు ఒక గంధర్వుఁడు

చిత్రోపల. ఋక్షపర్వతమునందు ఉండి వెలువడెడు ఒకనది

చిదంబరము ఒకదివ్యక్షేత్రము. పంచలింగములలో ఒకటి అగు ఆకాశలింగము ఇచట మూర్తీభవించి ఉండును

చిన్నయసూరి, (పరవస్తు) ఒకానొక అధునికపండితుఁడు ఈయనచే రచింపఁబడిన నీతిచంద్రిక అను వచనకావ్యము ఒకటి కలదు అది ప్రాచీనకవితలమాడ్కి మిక్కిలి ప్రౌఢముగాను లక్షణములకు ముఖ్యలక్ష్యముగాను చక్కని ప్రయోగములు కలదిగాను ఉన్నది ఈయన తెనుఁగునకు ఒక వ్యాకరణము రచియించెను అది బాలవ్యాకరణము అనుపేరిచే ఇప్పటి విద్యార్థులకు మిక్కిలి ఉపకారకముగా ఉన్నది ఈయన కాలముచేసి ఇప్పటికి రమారమి పదునైదుసంవత్సరములు అయెను

చిరకారి రు॥ మేధానిధికొడుకు ఒకప్పుడు ఇతనితండ్రి తనపత్నిపై కోపించి ఆమెను చంపుము అని చెప్పఁగా ఇతఁడు ఏపనియును చిరవిచారముతో చేయును కాన ఆపనిని అప్పుడే నెఱవేర్పక కొంతసేపు యోచించుచు ఉండెను. ఇంతలో మేధానిధి కోపముచల్లారి అకర్మమును నిలిపి కొడుకుయొక్క చిరకారితను సంస్తుతించెను కనుక ఇతనికి ఈపేరు కలిగెను

చిరాయువు నా॥ శతాయువు పురూరవుని కొడుకు

## చూ

చూళి రు॥ బ్రహ్మదత్తుని తండ్రి

## చే

చేది య॥ విదర్భుని మూఁడవకొడుకు అగు రోమపాదుని వంశస్థుఁడు అగు ఉశికుని కొడుకు ఈతనివంశము చేదివంశము అనియు ఇతఁడు ఏలినదేశము చేదిదేశము అనియు చెప్పఁబడును

చేదిపుఁడు కు॥ ఉపరిచరవసువుయొక్క కడపటి కొడుకు

## చై

చైతన్యులు వీరు లింగధారులవలె వర్ణాశ్రమధర్మముల నిరాకరింతురు వీరికి భక్తి ప్రధానము వీరు విష్ణువును పూజింతురు చూ॥ చార్వాకము

చైత్రరథము. కుబేరుని ఉద్యానవనము

చైద్యులు  యాదవులలో ఒక తెగవారు విదర్భుని పుత్రుఁడు అగు రోమపాదుని వంశస్థుఁడైనచేది అనువానియందు కలిగినవారు కనుక వీరికి ఈపేరు వచ్చెను

## చో

చోరుఁడు  ఒకానొక సంస్కృతకవి నా॥ బిల్హణుఁడు

చోళదేశము  చోళుఁడు ఏలినదేశము దీనికి రాజధాని కాంచీపురము

చోళుఁడు  దిష్యంతుని పౌత్రుఁడు అయిన ఆక్రీతుని కొడుకు ఇతఁడు ఏలినదేశము చోళదేశము అనఁబడును

## చ్య

చ్యవనుఁడు  (౧) భృగువునకు పులోమయందు పుట్టిన పుత్రుఁడు. ఇతనికి సుకన్యయందు ప్రమతియు మనుకన్యకయందు ఔర్వుఁడును పుట్టిరి ఈ చ్యవనుని తండ్రి అగు భృగువు బ్రహ్మమానస పుత్రుఁడు అగు భృగువుకాఁడు మఱియు ఈతని పుత్రుఁడు అగు ప్రమతికి రురుఁడును రురునికి శునకుఁడును పుట్టిరి మఱియొక పుత్రుఁడు అగు ఔర్వునికి ఋచికుఁడును ఋచికునకు జమదగ్నియు జమదగ్నికి పరశురాముఁడును పుట్టిరి

(౨) కు॥ సుహోత్రునికొడుకు

(౩) మిత్రాయువుకొడుకు.

## జ

జంతుఁడు  (౧) సోమకుని కొడుకు.

(౨) వృషతుని అన్న.

జంబుకుమారుఁడు  ర॥ శూర్పణఖ కొడుకు రావణుని మేనల్లుఁడు. వీనితండ్రి విద్యుజ్జిహ్వుఁడు

జంబుకేశ్వరము  తిరుచినాపల్లి శ్రీరంగము ఈ రెంటికి మధ్యప్రదేశమునందు ఉండు పుణ్యక్షేత్రము ఇచట అప్లింగము ఉండును (అప్పు+లింగము=అప్లింగము)

జంబుమాలి  (౧) ర॥ ప్రహస్తుని కొడుకు రావణుని సేనాధిపతులలో ఒకఁడు హనుమంతునిచేత అశోకవనభంగ సమయమున చంపఁబడెను

జంభారి  ఇంద్రుఁడు జంభుఁడు అను అసురుని చంపుటచే ఇతనికి ఈనామము కలిగెను

జంభుఁడు.  తారకయుద్ధమునందు దేవేంద్రునిచే చంపఁబడిన ఒక అసురుఁడు

జక్కన.  ఒక ఆంధ్రకవి ఇతఁడు విక్రమార్కచరిత్రమును తెనిఁగించెను అందు అద్భుతకధలు అనేకములు కలవు

జగన్నాథము  ఇది పురుషోత్తమ (విష్ణు) క్షేత్రము. కృష్ణుని నిర్యాణమునకు పిమ్మట ఆయన దేహమును దహనము చేయుచు ఉండఁగా సముద్రముపొంగి ద్వారకా పట్టణమును ముంచెను అప్పుడు ఆదేహము సంపూర్ణదగ్ధము కాక సముద్రమునందు కొట్టుకొనిపోవుచు ఉండఁగా దానిని కొందఱు భక్తులు దారువునందు సంపుటముచేసి ఇచట స్థాపించిరి

జటాయువు  అనూరుని రెండవ కొడుకు ఇతనితల్లి శ్యేని తాత కశ్యపుఁడు అవ్వ వినత. అన్న సంపాతి ఇతఁడు పంచవటియందు శ్రీరాముని ఆశ్రమమున ఉండి సీతను రావణాసురుఁడు ఎత్తుకొనిపోవు కాలమున వానిని అడ్డగించి వానిచేత చంపఁబడెను

జటాసురుఁడు  ర॥ వీఁడు గంధమాదనమునందు భీమసేనునిచే చంపఁబడెను.

జటిల   జటిలుని కూఁతురు ఈమె ఒకకాలమున ఏడుగురు పురుషులకు భార్యగా ఉండెను (జటిలుఁడు గోతముని వంశస్థుఁడు)

జఠరపర్వతములు   నీలపర్వతమునకును నిషధపర్వతమునకును నడుమ ఉండు పర్వతములు ఇందలిజనులు జరఠులు అనఁబడుదురు

జనకుఁడు   (౧) చూ॥ నా॥ మిథిలుఁడు

(౨) హ్రస్వరోముని కొడుకు మిథిలాపట్టణమునకు రాజు సీతాదేవితండ్రి ఇతఁడు మహాజ్ఞాని తత్వవేత్త సంసారమును వదలకయే ముక్తి చెందెను నా॥ధర్మధ్వజుఁడు.

జనమేజయుఁడు.   (౧) అ॥ పురంజయుని కొడుకు

(౨) పూరువు కొడుకు

(౩) కు॥ పరీక్షిత్తుని కొడుకు ఉదంకుని ఉపదేశమున ఇతఁడు సర్పయాగము ఒనరించెను చూ॥ పరీక్షిత్తు

జనస్థానము   దండకారణ్యమునందు రాముఁడు వాసముచేయుచు ఉండిన పంచవటికి సమీపప్రదేశము. ఇందు రావణాసురుని మూలబలములలో ఒకభాగము అగురాక్షససేన ఉండెను. దానికి నాయకుఁడు ఖరుఁడు. ఇక్ష్వాకుమహారాజు, తనకొమారులలో కడపటివాఁడు అయినదండుఁడు నీతిమాలి ప్రవర్తించుచు ఉండఁగా, వానిని పట్టణమునుండి వెడలఁగొట్టెను అంతట వాఁడు సాధుహింసకులు అగు రాక్షసులను కూడి శుక్రాచార్యులకు శిష్యుఁడై వింధ్యపర్వతము దగ్గఱ మధుమంతము అనుపట్టణము ఒకటి నిర్మించుకొని అందు వాసము చేయుచు ఉండి ఒకనాఁడు శుక్రుని ఆశ్రమమునకుపోయి అచ్చట విహరించుచు శుక్రునికూఁతురు అగు అరజ అనుదానిని చూచి మోహించి బలాత్కరించి చెఱిచెను అది శుక్రుఁడు విని కోపించి అప్పుడు దండుఁడు ఉన్నచోట చుట్టు పండ్రెండు ఆమడలమేర మట్టివాన కురియునట్లును, దండుఁడును వానివారలును అందు అణఁగి నశించునట్లును శపించెను అంతట అచ్చటిజనులు అందఱు వెఱచి పాఱిపోయిరి దండుఁడు తనపరివారముతోడ ఆమట్టివానయందు అణఁగి నశించెను కావున ఆచోటు దండునిపేర దండకారణ్యము అనఁబడెను అట్టి జనశూన్యము అగు అడవియందు ఇదిజనులు ఉండుచోటుగా ఏర్పడెను కనుక దీనికి ఈపేరుకలిగెను. (చూ॥ దండకారణ్యము)

జనార్దనుఁడు   విష్ణువునకు నామాంతరము

జన్మము   జన్మము అనఁగా ఆత్మకు శరీరముతోడి సంబంధము ఈశ్వరుఁడు జీవునికి కర్మానురూపముగా శరీరములను ఫలములను ఇచ్చుచు ఉన్నాఁడు అనఁగా జీవుఁడు పూర్వజన్మములయందు చేసిన పుణ్యకర్మములను అనుసరించి వివేకముగల మనుష్యాదిజన్మములను పాపకర్మములను అనుసరించి వివేకముచాలని పశ్వాదిశరీరములను పొందుటయేకాక ఆయాజన్మములయందును సుఖదుఃఖరూపఫలములను ఆవలస్వర్గ నరకాదిలోకములను పొందుచు ఉన్నాఁడు బీజాంకురన్యాయముగా ప్రవాహరూపము అగు కర్మపరంపరను నివర్తింపచేయవలయు ఆత్మ అనాది, ఆయాత్మకు శరీరధారణహేతువులు అయిన కర్మములును అనాదులు, కర్మములవలన దేహము కలుగుచు ఉన్నది, దేహముచేత కర్మములు చేయఁబడుచు ఉన్నవి, ఈరెంటిలో ఏది ముందో ఎఱుఁగఁబడదు చెట్టువలన విత్తు కలుగుచు ఉన్నది, విత్తువలన చెట్టు కలు

గుచు ఉన్నది, ఈ రెంటిలో ఏదిముందో తెలియఁబడదు ఆలాగుననే ఆత్మకర్మములును నిత్యములయి ఉన్నవి కర్మములు సుఖదుఃఖహేతువులు అగు కార్యములు సుఖహేతువు అగు కార్యము పుణ్యకర్మము అనియు, దుఃఖహేతువు అగు కార్యము పాపకర్మము అనియు, చెప్పఁబడును దుఃఖము మనకు ఎట్లు విడువ తగినదో అట్లే నశ్వరమయిన సుఖమును విడువ తగినది మనము కోరకయే ఎట్లు దుఃఖములు కలుగుచు ఉన్నవో అట్లు సుఖములును మనము కోరకయే పూర్వాపూర్వ కర్మములచేత కలుగుచు ఉన్నవి పుణ్యము చేసినవాఁడును అపుణ్యమునకు అనురూపమైన ఫలమును అనుభవించుటకుఁగాను జన్మము ఒక్కటి ఎత్తవలయు కనుక శబ్దమయవేదమార్గము అయిన కర్మఫలబోధన ప్రకారము వ్యర్థములు అగు స్వర్గాది నానాలోకసుఖములను ఇచ్చించువాఁడు కలలు కనుతెఱఁగున పరిభ్రమించుచు ఉండును, నిరవద్య సుఖలాభమును చెందనేరఁడు కాఁబట్టి విద్వాంసుఁడు అగువాఁడు నామమాత్రసారములు అగు భోగములలో ఎంతట దేహనిర్వాహము సిద్ధించునో అంతియ కైకొనుచు అప్రమత్తుఁడు అయి సంసారము సుఖము అని ఎంచక ఒండుమార్గమున సిద్ధి కలదేని పరిశ్రమచేయ ప్రయత్నించుచు ఉండును

"సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వకర్మ । వశమునను నొకవేళ వర్తించు దీపించు తటిన్నైన నొకవేళఁ దలఁగిపోవు । చెడునేని దేహంబు చెడుఁగాని పురుషుండు చెడఁడాతనికి నింత చేటులేదు । పురుషునికిని దేహపుంజంబునకు వేఱుగాని యేకత్వంబుగానరాదు । ధాతువుల వెలుంగుదహనుని కైవడిఁ । గాయములఁజరించుగాలిభంగి । నాశలీనమైన నభముచాడ్పున వేఱు । తెలియవలయు దేహిదేహములకు"



జపేశ్వరము నైమిశారణ్యమునందలి ఒకదివ్యక్షేత్రము చూ॥ నంది

జమదగ్ని ఒకమహర్షి ఇతనితండ్రి ఋచికుఁడు (చూ॥ చ్యవనుఁడు) తల్లి గాధిరాజు కూఁతురు అగు సత్యవతి (కౌశికి). కొడుకులు ఉరుమతి ఉత్పాపసుఁడు విశ్వావసుఁడు పరశురాముఁడు అని నలుగురు అందు పరశురాముఁడు ముఖ్యుఁడు జమదగ్ని తండ్రి అగు ఋచికుఁడు సత్యవతిని పెండ్లాడి కన్యాశుల్కమునందు ఉండి సంతానమును కోరి తనకని ఒకచరువును (చరువు= హోమమునకు తగిన పక్వాన్నము) తన మామకని ఒకచరువును కల్పించి ఆరెంటిని తనభార్యముందర పెట్టి, రాజులకు గెలువరానివాఁడును రాజులనెల్ల నాశము చేయువాఁడును అగు కొడుకు దీనివలన జనించును, ఈచరువును మీతల్లికి ఇమ్ము, తపస్సంపత్తియు శమంబును కల సుపుత్రుఁడు దీనివలన పుట్టును, ఈచరువు నీవు కైకొనుము; అని తెలియ చెప్పి అతఁడు స్నానార్థము నదికి చనియెను అంతట తీర్థయాత్ర చేయ పోయి ఉండిన గాధి, తనభార్యతో కూడ అచ్చటికి వచ్చెను సత్యవతి అట్లు వచ్చిన తల్లిదండ్రులను చూచి సంతసించి తనపెనిమిటి చేసిన రెండుచరువులను తల్లికి చూపి వాని ప్రభావమును చెప్పెను అందులకు ఆమె సంతోషించి తనకూఁతుతోడ తాను స్నానముచేసి వచ్చి, ఇది తనది ఇది కూఁతురుది అనుభేదము తెలియక, తనచరువు కూఁతునకు ఇచ్చి కూఁతు చరువు తాను ఉపయోగించెను సత్యవతియును ఆభేదము తెలిచి తల్లి ఇచ్చినదానినే పుచ్చుకొన్నను అంత ఋచికుఁడు వచ్చి భార్యను చూచి, తనదిన

జ్ఞానముచేత చరువులు మారుట తెలిసికొని నీవు క్షత్రియనాశకరము అగు గర్భమును తాల్చితివి అనఁగా ఆమె వెఱచి అతని పాదములమీఁద పడి మీరు ఇట్లు చెప్పవచ్చునా అని అడిగెను అంత అతఁడు ఇది నీవల్ల వచ్చిన తప్పుకాదు నీతల్లివలన అయినతప్పు చరువ్యత్యాసముచేత నీకు క్రూరకర్ముఁడు అగు కొడుకును మీతల్లికి బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును తపోధనుఁడును అగు కొడుకును పుట్టుదురు, అని చెప్పి అందులకు ఆమె దుఃఖింపఁగా ఈచరు మహిమము నీకొడుకునందు పొందక మనుమనియందు ప్రవర్తిల్లెడు గాక అని అనుగ్రహించెను అది కారణముగా పరశురాముఁడు భృగువంశజాతుఁడు అగు జమదగ్ని మహామునికి జనించియు క్రూరకర్ముఁడై చలము పట్టి రాజులను ఎల్ల నాశము చేసెను

జమదగ్ని, తనభార్య అగు రేణుక అంగదేశపురాజు అగు చిత్రసేనుఁడు అనువాని మోహించి వ్యభిచరించినందున, కోపించి తన చిన్నకొడుకు అగు పరశురామునిచేత ఆమెను చంపించి, మరల పరశురాముఁడు తనతల్లిని బ్రదికింపవలెను అని ప్రార్థింపఁగా ఆమెను బ్రదికించెను

జయంతపురము. గౌతమాశ్రమ సమీపమున ఉండు ఒకపట్టణము ఇది నిమిచే నిర్మింపఁబడెను

జయంతుఁడు (౧) ఇంద్రుని పెద్దకొడుకు ఇతఁడును కుబేరుని కొడుకైన నలకూబరుఁడును మన్మథుఁడును మహా సౌందర్యవంతులు అని ఎన్నఁబడుదురు

(౨) ధర్మునికి మరుద్వతియందు పుట్టిన రెండవకొడుకు.

(౩) విష్ణుపరిచరులలో ఒకఁడు

(౪) విశ్వామిత్రుని కొడుకు.

(౫) అజ్ఞాతవాసకాలమున భీమునకు సంకేతముగా పెట్టఁబడినపేరు

జయత్సేనుఁడు (౧) కు॥ సార్వభౌముని కొడుకు

(౨) అజ్ఞాతవాసకాలమున నకులునకు సంకేతముగా పెట్టఁబడినపేరు

జయద్బలుఁడు అజ్ఞాతవాసకాలమున సహదేవునకు సంకేతముగా పెట్టఁబడినపేరు

జయద్రథుఁడు (౧) అం॥ బృహద్రథుని కొడుకు ఈతనిభార్య సూతవంశస్థురాలు కనుక ఇతనికొడుకు విజయుఁడును వాని వంశస్థులును సూతులు అయిరి

(౨) ధృతరాష్ట్రునియల్లుఁడు మూ॥ సైంధవుఁడు

(౩) అ॥ తితిక్షువుకొడుకు

(౪) బా॥ బృహత్కాయుని కొడుకు. విశ్వజిత్తుయొక్క తండ్రి

జయధ్వజుఁడు య॥ కార్తవీర్యార్జుని పెద్ద కొడుకు తాళజంఘునితండ్రి.

జయవిజయులు వైకుంఠ ద్వారపాలకులు వీరు ఒకప్పుడు శిశువేషములు తాల్చివచ్చిన సనకసనందనులను వైకుంఠములోపలికి పోనీక అడ్డగింపఁగా, వారు కోపించి వీరిని క్రూరరాక్షసులరు అగుఁడు అని శపించిరి. అదికారణముగ వీరు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, అన ప్రథమమున దితికి జనించిరి. పిదప రావణకుంభకర్ణులు అన రెండవజన్మమున కైకసికి పుత్రులైరి. శిశుపాలదంతవక్త్రులు అనమూడవజన్మమున దమఘోషునకు సాత్వతియందు పుట్టిరి వీరిని ప్రథమజన్మమున వరాహనారసింహావతారములను ద్వితీయ జన్మమున రామావతారమునను తృతీయ జన్మమున కృష్ణావతారమునను

విష్ణువు చంపెను అంతట వీరు విష్ణుసాయుజ్యమును పొందిరి

జయుఁడు (౧) య॥ సాత్యకి కొడుకు

(౨) య॥ వసుదేవుని తమ్ముఁడు అగు ఆనకుని కొడుకు

(౩) మి॥ సుశ్రుతుని కొడుకు

(౪) అజ్ఞాతవాసకాలమున ధర్మరాజు సంకేతముగా పెట్టుకొన్న పేరు

జయులు కల్పాదియందు సృజింపఁబడిన ద్వాదశదేవఋషులు వీరు ప్రతిమన్వంతరమునను దేవతలుగా పుట్టుదురు చూ॥ ఆదిత్యులు

జరత్కారుఁడు యాయావరవంశమునందు జనించిన ఒక బ్రహ్మర్షి ఇతనిభార్య వాసుకి చెల్లెలైన జరత్కారువు కొడుకు అస్తీకుఁడు ఈయన బహుదినములు బ్రహ్మచర్యాశ్రమమున ఉండి పుత్రసంతానము పడయక పోఁగా ఇతని పితృదేవతలు ఒక అవురు గంట తమకు అవలంబముగా తలక్రిందుగ వ్రేలుచు ఇతనికి కనఁబడిరి వారిని చూచి నంతట సంతానవాంఛ పుట్టి తనపేరుగల కన్యక కావలెను అని విచారించి జరత్కారువును వివాహముచేసి కొనెను

జరత్కారువు కద్రువకూఁతురు వాసుకి చెలియలు జరత్కారునిభార్య అస్తీకునితల్లి

జరాసంధుఁడు కు॥ మగధదేశపురాజు ఉపరిచరవసువు కొడుకు ఐన బృహద్రథుని పుత్రుఁడు వీనికొడుకు సహదేవుఁడు. పట్టణము గిరివ్రజము బృహద్రథుఁడు చిరకాలము తనకు పుత్రులు కలుగక ఉండఁగా తపస్సు చేసి పుత్రులను పడయఁగోరి రాజ్యమును మంత్రి అధీనముచేసి ఒక అడవికి పోయి అచట తపస్సు చేయుచు ఉండిన చండకౌశికుఁడు అనుమునిని ఆశ్రయించి సేవ చేయుచు ఉండెను కొంతకాలమునకు ఆముని ఇతనియందు అనుగ్రహము కలవాఁడై నీవు ఏమికోరి వచ్చి నాకు పరిచర్య చేయుచు ఉన్నావు అని అడిగి ఇతని అభిప్రాయము తెలిసికొని ఒక మామిడిపండును అభిమంత్రించి యిచ్చి దీనిని నీభార్యకు ఋతుకాలమున భుజింప ఇచ్చితివేని నీకు మహాబలపరాక్రమసంపన్నుఁడు అగు కొడుకు కలుగును పొమ్ము అని చెప్పిపంపెను అందులకు బృహద్రథుఁడు సంతోషించి ఆపండు తెచ్చి తనపెద్దభార్యకు ఇచ్చెను ఆమె పెనిమిటివలన దానిమహిమ తెలిసికొని తనకుమాత్రము కాక తనసవతికిని సంతానము కలుగవలయును అనుతలఁపున సగముపండు తాను భుజించి సగముపండు తన సవతికి ఇచ్చెను అంతట ఇరువురును గర్భము ధరించి సగముదేహము ఒకరును తక్కిన సగముదేహము మఱియొకరును ప్రసవించిరి. అప్పుడు దాదులు ఆరెండు ఖండములను ఊరిముందటి చదుకమున వైచి వచ్చిరి అంతట ఆప్రదేశమును ఆశ్రయించి ఉండిన జర అనురాక్షసి ఆహారార్థిని అయి ఆరెండుఖండములను ఒకటిగా చేర్చి యెత్తుకొనిపోపోఁగా అవి ఒకటిగా అతుకుకొని బాలుఁడై ఎత్తరానిభారమున ఏడువసాగెను అందులకు అది ఆశ్చర్యపడి బృహద్రథునకు ఆసమాచారమును తెలుపఁగా అతఁడు వానిని ఎత్తుకొనిపోయి జరచే సంధింపఁబడినవాఁడు కావున జరాసంధుఁడు అనిపేరుపెట్టి పెంచుకొనెను. అట్టి జరాసంధుఁడు తన అల్లుఁడు అయినకంసుని కృష్ణుఁడు చంపెను అని అతనియెడ విరోధించి పదునెనిమిదిమాఱులు మధురాపురముమీఁద దండెత్తి జయము చేకొనియెను పిమ్మట ధర్మరాజు రాజసూయయాగముచేయ యత్నించినప్పుడు

కృష్ణుఁడు భీమసేనునిచే వీనిని చంపించెను వీఁడు విప్రచిత్తియంశమున జనించినవాఁడు

జరిత మందపాలునిభార్య శార్ఙ్గజాతి స్త్రీ)

జలపద ఒక అప్సరస

జహ్నువు (౧) అమవసు వంశస్థుఁడైన సుహోత్రుని కొడుకు ఇతఁడు తనయజ్ఞవాటమున గంగ ప్రవేశించినప్పుడు దానిని పానముచేసి భగీరథుని ప్రార్థనచే మరల తన చెవిగుండ వెడల విడిచెను కనుక గంగకు జాహ్నవి అనునామము కలిగెను ఈతని కొడుకు సుమంత్రుఁడు

(౨) కురువుయొక్క మూఁడవ కొడుకు

## జా

జాంబవంతుఁడు. బ్రహ్మపుత్రుఁడైన భల్లూకరాజు సుగ్రీవునిమంత్రి ఇతఁడు శ్రీరాముఁడు రావణునితో యుద్ధము చేయుకాలమున అతనికి సహాయపడియెను

జాంబవతి. జాంబవంతుని కూఁతురు కృష్ణుని అష్టభార్యలలో ఒకతె ఈమెకొమారుఁడు సాంబుఁడు.

జాజలి ఋ॥ ఈతఁడు తపోనిష్ఠను ఉండఁగా ఇతని జడలయందు పిచ్చికలు గూఁడు కావించుకొని పిల్లలతోకూడ వసించి ఉండెను. చూ॥ తులాధారుఁడు

జాతకర్ణి ఇతఁడు శాకల్యుని శిష్యుఁడు

జాతవేదుఁడు ఆహవనీయాదిరూపుఁడు అయిన అగ్ని చూ॥ పురూరవుఁడు

జాబాలి (౧) ఋ॥ ఒకనైయాయికుఁడు శ్రీరాముని కాలమున ఉండెను. ఇతఁడు నాస్తికుఁడు

(౨) ఋ॥ జాతకర్ణి శిష్యుఁడు

జామదగ్న్యుఁడు. చూ॥ పరశురాముఁడు.

## జీ

జీమూతవాహనుఁడు ఒకానొక ఖేచరుఁడు ఇతఁడు తనదేహమును గరుత్మంతునికి ఆహారముగా ఇచ్చి ఒక నాగకుమారుని బ్రతికించెను

జీమూతుఁడు య॥ వ్యోముని కొడుకు.

జీవలుఁడు ఋతుపర్ణుని గుఱ్ఱపువాఁడు

## జై

జైనులు ఒకానొకమతస్థులు వీరు వేదములు ఈశ్వరప్రోక్తములు అనికాని వేదములయందు చెప్పబడినవి అన్నియు సత్యములు అనికాని నమ్మరు జీవహింస ఏమాత్రమును చేయకూడదు అనుట వీరిముఖ్యసిద్ధాంతము అందుచేతనే రాత్రులయందు వీరు భోజనముచేయరు మఱియు శ్వేతాంబరులు అనియు దిగంబరులు అనియు జైనులు ఇరుతెఱఁగులుగ ఉందురు తఱుచుగా వీరు వాసముచేయు ప్రదేశములు మైసూరు, చిత్తూరు, కాంచీనగరము మొదలగునవి.

జైమిని ఋ॥ వ్యాసశిష్యులలో ఒకఁడు ఇతఁడు సామవేదాధ్యాపకుఁడు ఒకానొకప్పుడు ఇతఁడు తనకుఁగల సందేహములను కొన్నిటిని తీర్ప మార్కండేయ మహామునిని ప్రార్థింపఁగా, అతఁడు ధర్మపక్షులవృత్తాంతము చెప్పి ఆపక్షులముఖముగ అతఁడు అడిగిన ప్రశ్నలకు ఉత్తరము చెప్పించెను ఆధర్మపక్షులచేత చెప్పఁబడినదే మార్కండేయ పురాణము ఇతనిచే ఒకభారతము చెప్పఁబడెను అందు అశ్వమేధపర్వముమాత్రమే లోకమున కానఁబడుచు ఉన్నది

## జ్ఞా

జ్ఞానప్రసూనాంబ వరాశక్తియవతారము అగు కాళహస్తీశ్వరుని భార్య.

## జ్యా

జ్యామఘుఁడు } య॥ రుచికునికొడుకు విదర్భునితండ్రి ఇతఁడు తనభార్యకు మిగుల వెఱచి ఉండెను
జ్యామఘుఁడు }

జ్యేష్ఠాదేవి వరుణునిభార్యలలో ఒకతె ఈమె ధాతృవిధాతలతోఁ గూడ పుట్టింపఁబడిన బ్రహ్మమానసపుత్రిక ఈమె చెలియలు లక్ష్మి ఈమె వరుణునివలన అధర్ముఁడు అను సుతుని పడసెను ఈజ్యేష్ఠాదేవినే కాళికాదేవి అనియు అందురు

జ్యోతిష్మంతుఁడు స్వాయంభువమనువు కొడుకులలో ఒకఁడు ఇతఁడు కుశద్వీపమునకు రాజు. ఇతని కొడుకులు ఏడుగురు

## ఝ

ఝర్ఝురుఁడు. హిరణ్యాక్షుని కొడుకు

## డి

డిచికుఁడు నా॥ చిత్రసేనుఁడు జరాసంధుని చెలికాఁడు. హంసుని సహోదరుఁడు (పాఠాంతరము డిభకుఁడు) వీఁడును హంసుఁడును తపంబున శివుని మెప్పించి ఆయుధములచేత చావులేకుండ వరము పడసి జరాసంధునికి సహాయులై లోకములోని రాజులను ఎల్ల హింసించుచు ఉండఁగా, కృష్ణుఁడు వారితో 'తనకు యుద్ధము పొసఁగినప్పుడు వాగు ఒకనిని ఒకఁడు ఎడఁబాసి యాదవసేనలతో పోరాడుచు ఉండుసమయమునందు డిచికుఁడు చచ్చెను అని హంసునకును హంసుఁడు' చచ్చెను అని డిచికునకును చెప్పించెను అంతట వారు పరస్పర స్నేహాతిశయముచేత మనోవ్యథ పొంది ప్రాణములు విడిచిరి.

## త

తంత్రీపాలుఁడు అజ్ఞాతవాసకాలమున గోపవేషముధరించిన సహదేవుఁడు పెట్టుకొనిన పేరు

తపతి సంవరణుని భార్య కురువుయొక్క తల్లి సూర్యుని కూఁతురు

తప్తకుంభము ఒకనరకము ఇందు సలసల మసలు తైలముచేనిండిన కుండలు మెండుగా ఉండును. పాతకులు ఆకుంభములందు అధోముఖులుగా త్రోయఁబడుదురు అపుడు వారిశరీరములు కరఁగి ముద్దలు అగును వానిని అచటిగ్రద్దలు ఎత్తి శిమిశిమా అను యంత్రములపై వైచును అంతట వారలు మరల యాతనాధారులు అయ్యెదరు

తపుఁడు. అంగిరసుని సంతతివారు అగు కాశ్యపుఁడు వాసిష్ఠుఁడు ప్రాణుఁడు అంగిరసుఁడు చ్యవనుఁడు అను ఏవురకును పుట్టిన పాంచజన్యుఁడు అను అగ్ని

తమస ఋక్షపర్వతమునందు ఉత్పత్తి అగు ఒక నది

తమస్సు ఒక నరకము ఇది మహారౌరవసమాన విస్తీర్ణమును శీతస్వభావమును అంధకార బంధురమును అయి ఉండును. దీనిని అనుభవించు హీనుల యొక్క ఇడుములు కడు బెడిదములు అయి ఉండును

తర్పణము. ఇది ఒకశ్రాద్ధాంగము జలమువిడిచి పితృదేవతలను తృప్తిపొందించుట

తలాతలము ఒక అధోలోకము ఇందు గులకఱాళ్లు నిండుకొని ఉండును దీనిని కాలనేమి మొదలయిన దానవులు ఏలుదురు

తలుఁడు శలునితమ్ముఁడు చూ॥ శలుఁడు

తక్షకుఁడు (౧) వాసుకితమ్ముఁడు కద్రువకొడుకు వీఁడు పరీక్షిత్తును కఱచి చంపెను

అను నెపముచేత జనమేజయుఁడు సర్ప యాగమును చేయ ప్రయత్నించెను భాగవతమందు వాసుకిని జయించి తక్షకుని భార్యను రావణుఁడు ఎత్తుకొని పోయినట్లు చెప్పుదురు

(౨) ఇ॥ శ్రీరాములతమ్ముఁడైన భరతుని జ్యేష్ఠపుత్రుఁడు

తక్షశిల భరతుని పెద్దకొమారుఁడు అగు తక్షకునిచే గాంధారదేశమున నిర్మింపఁబడిన పట్టణము

తక్షుఁడు య॥ వసుదేవుని తమ్ముఁడు అగు వృకుని జ్యేష్ఠపుత్రుఁడు

## తా

తాటక ఒకరాక్షసస్త్రీ మారీచసుబాహువుల తల్లి కడుక్రూరురాలు రాముఁడు విశ్వామిత్రుని యాగమును కాచుటకు పోవునపుడు మధ్యేమార్గమున ఈరాక్షసిని చంపెను సుకేతుఁడు అను యక్షుని కూఁతురు దీనికి వేయియేనుఁగుల బలముగలదు దీని మగఁడు సుందుఁడు అను యక్షుఁడు ఇది భర్తృ మరణానంతరము ఒకనాఁడు అగస్త్యాశ్రమమునకు పోయి అతనిని బెదరింప పోవ అతఁడు దీనిని దీనిసుతులు అగు మారీచసుబాహువులను రాక్షసులు అగునటుల శపించెను

తాపత్యులు తపతివంశమున పుట్టినవారు కౌరవపాండవులు

తామసుఁడు నాలవమనువు ఇతనితండ్రి సురాష్ట్రుఁడు తల్లి ఉత్పలావతి భాగవతమున ఇతఁడు ప్రియవ్రతుని సుతుఁడు అని చెప్పఁబడి ఉన్నది

తామ్ర దక్షప్రజాపతి కూఁతురు కశ్యపుని భార్య

తామ్రపర్ణి (౧) అంజనము అను దిగ్గజము యొక్క భార్య

(౨) దక్షిణ దేశమునందలి ఒక నది దీనియందు ముత్యపుచిప్పలు ఉండును

తామ్రలిప్తి గంగానది సముద్రముతో సంగమము అగు తావున ఉండు ఒక పట్టణము

తామ్రుఁడు ద॥ మురాసురుని కొడుకు కృష్ణునిచే చంపఁబడెను

తార (౧) ఒక అప్సరస

(౨) బృహస్పతిభార్య ఈమెకు చంద్రునివలన బుధుఁడు అను కొడుకు కలిగెను

(౩) తారుని కూఁతురు వాలిభార్య అంగదుని తల్లి వాలి, మరణానంతరము వాలితమ్ముఁడు అగు సుగ్రీవుఁడు ఈమెను పరిగ్రహించెను

తారకజిత్తు చూ॥ కుమారస్వామి

తారకుఁడు (౧) ది॥ ఒకానొక రాక్షసుఁడు తండ్రి వజ్రాంగుఁడు తల్లి వజ్రాంగి వీఁడు బ్రహ్మనుగూర్చి మహాతపము ఆచరించి తాను ఇతరులచేత అవధ్యుఁడు అగునట్లు వరము వేఁడెను అపుడు బ్రహ్మ ఏవారిచే తను చావులేక వరము ఇచ్చుటకు సమ్మతిలేక ఏడుదినముల బాలకునిచేతమాత్రము చచ్చునట్లును తక్కినవారిచే చావక ఉండునట్లును ఆనతిఇచ్చి అంతర్హితుఁడు అయ్యెను. కనుక వాఁడు కడపట ఏడుదినముల బిడ్డఁడు అయిన కుమారస్వామిచే చంపఁబడెను

(౨) దనువు పుత్రుఁడు

(౩) హిరణ్యాక్షుని కొడుకు నా॥ కాలనాభుఁడు

తారుఁడు వాలి సుగ్రీవులమామ. తారతండ్రి. బృహస్పతి కొమారుఁడు ఇతఁడు సర్వవానరులలో మిగుల బుద్ధిమంతుఁడు

తార్క్షి కందరునికి దమనకయందు పుట్టిన పక్షిస్త్రీ వపుస్సు అను అప్సరస దుర్వాస మహర్షియొక్క తపస్సునకు భంగముచేయ పోయి ఆయన శాపమువలన ఈజన్మము ఎత్తెను ఇది ధర్మపక్షుల తల్లి

తార్క్ష్యుఁడు (౧) కశ్యపునకు నామాంతరము
(౨) రు॥ ఇతని ఆశ్రమమున ఒకనాఁడు హైహయవంశోద్భవుఁడైన దుందుమారుఁడు అనురాజు వేఁటాడుచు ఉండి కృష్ణాజినము కప్పుకొని ఉండిన ఇతనికొమారుని ముని అని ఎఱుఁగక మృగభ్రాంతిచే బాణప్రయోగముచేసి చంపెను అప్పుడు ఇతఁడు చింతను ఒందక తనప్రభావముచే కొడుకును పునర్జీవితునిగ చేసికొనెను
(౩) గరుడునకు నామాంతరము
(౪) విష్ణుపరిచరులలో ఒకఁడు

తాళకేతుఁడు పాతాళకేతుని తమ్ముఁడు వీఁడు తన అన్నను కువలయాశ్వుఁడు చంపెను అని ఒక మాయావనమును కావించుకొని అందు ఒక సరోవరమును కల్పించి దాని ఒడ్డున యజ్ఞము చేయ పోయెదను అని కావలి ఉంచి అతని కంఠహారమును కొని తాను అతనియింటికి పోయి కువలయాశ్వుఁడు రాక్షసులచేత మృతిపొందెను అని చెప్పి ఆకంఠహారమును అతనితండ్రి చేత ఇయ్యఁగా కువలయాశ్వుని భార్య అగు మదాలస విని దుఃఖముచే ప్రాణము విడిచి మరల బ్రతికింపఁబడి తనభర్తను కూడెను

తాళజంఘుఁడు య॥ కార్తవీర్యార్జుని పౌత్రుఁడు ఇతనివంశజులు తాళజంఘులు అనఁబడుదురు వీరి రాజధాని మాహిష్మతీపురము

తాళజంఘులు తాళజంఘునివంశస్థులు యాదవులలో ఒకశాఖ.

## తి

తిక్కనసోమయాజి ఒకగొప్ప ఆంధ్రకవి. ఇతఁడు నన్నయభట్టారకునికి పిమ్మట కొంతకాలమునకు భారతశేషమును తెనిఁగించెను ఈయన భారతమును తెనిఁగించుటకుముందు నిర్వచనోత్తర రామాయణము అనుపేర రామాయణము ఉత్తరకాండమును తెనిఁగించెను అది తక్కిన తెనుఁగు కావ్యములవలె వచనములును పద్యములును కలసి ఉండక కేవలపద్యకావ్యము అయి ఉండును. ఇతని నివాసగ్రామము కర్ణాటక దేశమునందలి ఉత్తరపినాకినీ నది గట్టున ఉండెడు నెల్లూరికి పడమట రెండు కోసులదూరమునందు ఉండు పాటూరు ఈయన ఆఱువేలనియోగి. ఈతనితండ్రి కొమ్మనామాత్యుఁడు సహోదరులు కార్యతిక్కన ఖడ్గతిక్కన అనువారు కొమారుఁడు మారన ఈయనకు కవితిక్కన అనునది బిరుదు మీఁద చెప్పిన నెల్లూరికిఆకాలమునందు అధిపతిగా ఉండిన మనుమసిద్ధి అనురాజు ఒద్ది ఆస్థానపండితులలో ఈయనముఖ్యుఁడు ఈయన, నన్నయభట్టు, ఎఱ్ఱాప్రెగ్గడ, ఈముగ్గురును కవిత్రయము అనఁబడుదురు - తెనుఁగునందు వీరి ప్రయోగములే ముఖ్యలక్ష్యములుగా గ్రహింపఁబడును చూ॥ నన్నయ భట్టారకుఁడు

తితిక్షుఁడు. మహామనుని రెండవ కొడుకు

తిమ్మన (౧) ఒక ఆంధ్రకవి కృష్ణదేవరాయల ఆస్థానమునందలి కవులలో ఒకఁడు ఈయన ముక్కుతిమ్మన అనఁబడును "ముక్కుతిమ్మనార్యుముద్దు పలుకు" అని ఇతనికవిత మిగుల ముద్దుగా ఉండును అని పేర్కొనఁబడును ఈయన రచియించిన కావ్యము పారిజాతాపహరణము

(౨) మఱియొక ఆంధ్రకవి ఈయనచే రచియింపఁబడిన కావ్యము సమీర కుమారవిజయము ఉత్తర రామాయణము ను ఈయనచే రచియింపఁబడె కంకంటిపాపరాజు రచియించినట్టు గద్యము వ్రాయబడి యొనని అందురు ఇతనిని నందితిమ్మన్న అందురు

(3) మఱియొక ఆంధ్రకవి ఇతఁడు నిరాటంకము అగు కవితాధారకలవాఁడు అచ్చతెనుఁగు రామాయణము నీలాసుందరీ పరిణయమును రచించిన వాఁడు అచ్చాంధ్రకావ్య ఘటన దుస్సాధ్యము ఐనను ఇతనికి అది సుసాధ్యము అని రచనా శైలినిపట్టి ఊహింపఁబడుచు ఉన్నది మఱియును ఇతఁడు రసికజనమనోభిరామము రుక్మిణీపరిణయము సింహాచలమాహాత్మ్యము రాజశేఖరవిలాసము సారంగధరచరిత్రము సకల లక్షణ సారసంగ్రహము అను మిశ్రకావ్యములను రచియించెను ఇతఁడు కూచిమంచితిమ్మన అనఁబడును

తిమ్మరాజు ఒక ఆంధ్రకవి ఇతఁడు వైష్ణవభక్తుఁడు వైష్ణవాగ్రేసరులు అగు ఆళ్వారులచరిత్రములను ప్రాంకపఱచి పరమ యోగివిలాసము అనుపేర ఒక మహాకావ్యమును రచియించెను అందలి చరిత్రములు అద్భుతములుగ ఉండును ఇతని కొడుకు ఈశ్వర ప్రభువు

తిమ్మరుసు చూ॥ అప్పాజి

తిరుపతి ఒకదివ్యక్షేత్రము త్రిమతస్థులును అట్లు అంగీకరించి ఉన్నారు ఇందు ఒకప్పుడు వైకుంఠవాసుఁడు అయిన విష్ణువు వేంకటేశ్వరుఁడు (లేక శ్రీనివాసుఁడు) అనుపేర సాక్షాత్కరించి ఉండెను ఆ దేవతామూర్తిని అగస్త్యుఁడు పులస్త్యుఁడు మొదలుగాఁగల ఋషులు పూజించిరి అని వామనమహర్షి జనకునకు చెప్పినట్లు ఆస్థల పురాణమునందు చెప్పఁబడి ఉన్నది

తిరుమలరాయలు కృష్ణదేవరాయలపినతండ్రి ఈయనను తిమ్మన అనియు అందురు

తిలోత్తమ ఒక అప్సరస

## తీ

తీర్థకారులు జైనగురువులు వీరు ఇరువది నలువురు అందు మొదటివాఁడు ఆదినాథుఁడు.

## తు

తుంగప్రస్థము రామగిరికి తూర్పున ఉండు కొండ

తుంబురుఁడు గంధర్వగురువు నారదతుంబురులు గొప్పగాయకులు అని ప్రసిద్ధి

తుర్వసువు యయాతికి దేవయానియందు పుట్టిన కొడుకు తండ్రిశాపముచే (చూ॥ యయాతి) తుర్వసు వంశమువారు ధర్మాధర్మవివేక శూన్యులై సంకీర్ణకిరాతదేశములకు రాజులు అయిరి ఈతని దుర్వసుఁడు అనియును అందురు

తులాధారుఁడు వారణాసియందు ఉండిన ఒక వణిగ్వరుఁడు ఇతఁడు జాజలి అను మునికి ఉత్తమాచారప్రకారమును ఎఱిఁగించి బ్రహ్మగీతలు చెప్పెను

తులువవంశము. యయాతికొడుకు అగు తుర్వసువంశమునందు చంద్రగుప్తుఁడు అనువాఁడు జన్మించి అతఁడు శాలివాహనశకమునకు నన్నూఱుసంవత్సరములకు మును మగధ దేశమునకు రాజై ఉండెను ఈచంద్రగుప్తుని వంశమునకు వెనుక శూద్రవంశములు మూడువచ్చెను అందుకడపటిది అగు ఆంధ్రులవంశము శాలివాహన శకము ము

న్నూటయేఁబది సంవత్సరములకు సమాప్తి చెందెను అది తులువవంశము అనఁబడును ఆవంశమున పుట్టినవాఁడే తిమ్మరాజు

తుషితులు దేవతలలో ఒకతెగవారు సంతోషించువారు అని శబ్దార్థము. వీరు ముప్పదియార్వురు భాగవతమున యజ్ఞునికి దక్షిణయందు పుట్టిన పన్నిద్దఱు కొడుకులను తుషితులు అని చెప్పియున్నది వీరు తోషుఁడు ప్రతోషుఁడు సంతోషుఁడు భద్రుఁడు శాంతుఁడు నిడస్వతి ఇధ్ముఁడు కవి విభుఁడు వహ్ని సుదేవుఁడు రోచనుఁడు అనువారు

తుష్టిమంతుఁడు యు॥ కంసునితమ్ముఁడు

## తూ

తూవలకుఁడు ర॥ చాణూర ముష్టికులతో కూడ మల్లయుద్ధమునందు కృష్ణునిచే మడిసిన ఒక అసురుఁడు

## తృ

తృణబిందువు మరుచ్చక్రవర్తి వంశస్థుఁడు అగు బుధ్నుని కొడుకు ఇతనికొడుకు విశాలుఁడు

తృణావర్తుఁడు ర॥ కృష్ణుఁడు వ్రేపల్లెలో శిశువుగా ఉండునప్పుడు సుడిగాలి రూపమున వచ్చి అతనిని ఆకాశమునకు ఎత్తుకొని పోయి అతనిచేత చంపఁబడిన ఒక దైత్యుఁడు ఇతనికి చక్రసమీరదైత్యుఁడు అనియు పేరు కలదు.

## తె

తెనుఁగు. తెలుఁగుభాష. చూ॥ త్రిలింగము.

తెలగనార్యుఁడు. ఒక ఆంధ్రకవి ఇతఁడు యయాతిచరిత్రము అను అచ్చతెనుఁగు కావ్యమును రచియించెను



తెలుఁగు ఆంధ్రభాష ఇది త్రిలింగశబ్దవైకృతము చూ॥ త్రిలింగము

## తే

తేజస్వి అగస్త్యునిపౌత్రుఁడు దృశ్యునిపుత్రుఁడు నా॥ ఇధ్మవాహనుఁడు

తేజోవతి అగ్నిదేవుని పట్టణము

## తై

తైత్తిరీయము ఇది ఒక ఉపనిషత్తు చూ॥ యాజ్ఞవల్క్యుఁడు

## తో

తోయజగర్భుఁడు చతుర్ముఖబ్రహ్మ ఇతఁడు కమలమునందు పుట్టెను కనుక కమలజుఁడు అనియు, కమలమును ఆసనముగా కలవాఁడు కనుక కమలాసనుఁడు అనియు, చెప్పఁబడును పద్మజుఁడు, వనజజుఁడు, అరవిందజుఁడు, నాళీకజన్ముఁడు, పద్మాసనుఁడు, వనజాసనుఁడు, అరవిందాసనుఁడు, నాళీకాసనుఁడు మొదలు అగు పేళ్లు అనేకములు ఇతనికి కలవు

## త్ర

త్రయారణుఁడు చూ॥ నా॥ సూర్యారణ్యుఁడు

త్రయ్యారుణి పు॥ ఋక్షయునికొడుకు ఇతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి.

త్రసదస్యుఁడు ఇ॥ పురుకుత్సుని కొడుకు అనరణ్యుని తండ్రి. నా॥ వసుదుఁడు

త్రిగర్తము. ఒకానొకదేశము ఇది ఆర్యావర్తమునకు వాయవ్యభాగమున ఉండునది

త్రిజట. ర॥ విభీషణుని కూఁతురు సీత రావణునిచేత పట్టువడి ఉండుకాలమున ఈమె సీతకు మిగుల ఊఱటమాటలు చెప్పుచు ఉండెను ఒకప్పుడు రావణుని నాశమున

కు సూచకమైన కల ఒకటి కని రాక్షసస్త్రీలుచేయు నిర్బంధములచే మిగుల ఖిన్నురాలై ఉండినసీతకు ఆస్వప్నవృత్తాంతము చెప్పి శీఘ్రకాలములో రాముఁడు రావణుని నశింపఁజేసి ఆమెను తోడుకొనిపోవును అని ఈమె సమాధాన పఱచెను

త్రితుఁడు బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు

త్రిదివ పారిపత్రపర్వతమునందు ఉత్పత్తి అగు ఒకనది

త్రిధన్వుఁడు ఇ॥ సుమనుని కొడుకు సూర్యారణ్యుని తండ్రి

త్రిపురాసురులు తారకాసురుని కొడుకులు అగు కమలాక్షుఁడు విద్యున్మాలి తారకాక్షుఁడు అనువారు వీరు మహత్తరమైన తపస్సుచేసి శివుని అనుగ్రహమువలన ఇనుముతోను బంగారుతోను వెండితోను చేయఁబడిన మూఁడు జంగమపట్టణములను పొంది లోకములను పాడుచేయుచు ఉండిరి అప్పుడు విష్ణువు ఒకపాషండుని అవతారము ఎత్తి నారదుని తనకు శిష్యునిగా చేసికొని ఈ త్రిపురాసురులకును వీరి కాఁపులకును శివునియందలి భక్తి తొలఁగుటకు తగిన విషయములు' బోధించెను అంత వీరును వీరికాఁపులును శివద్వేషులు అయిరి. అందులకు శివుఁడు ఆగ్రహించి వీరితో యుద్ధముచేసి వీరిని చంపెను వీరు తమ మరణానంతరము ప్రమథ గణములతో చేరిరి

త్రిపృష్ఠుఁడు. య॥ వసుదేవునికి ధృతియందు పుట్టిన కొడుకు

త్రిమూర్తులు బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు ఆదిని నిర్గుణస్వరూపుఁడు అయిన ఈశ్వరుఁడు (శుద్ధబ్రహ్మము లేక శుద్ధచైతన్యము) "బహుస్స్యాం" అని సంకల్పించి సృష్టిచేయ ఉద్యమించెను ఈ సంకల్పస్థితియందు ఆబ్రహ్మము ప్రకృతిపురుషస్వరూపుఁడు అగుచు సత్వరజస్తమోగుణాత్మకుఁడై ఉండెను ఆస్వరూపమునందు అతఁడు శబళబ్రహ్మము లేక మాయావచ్ఛిన్న చైతన్యము అనఁబడును అది అతనికి మాయోపాధిచే అనఁగా ప్రకృతి సంబంధముచేత కలిగెను మాయ అన విచిత్ర సృష్టికి హేతువు ప్రకృతి అన మహదాది వికారములకు కారణము ఇది జ్ఞానవిరోధిగా ఉండుటవలన అవిద్య అనియు చెప్పఁబడును అట్టిప్రకృతి సంబంధముగల శబళబ్రహ్మ స్వరూపమునందు (అనఁగా కేవల సంకల్పస్థితియందు) సత్వరజస్తమోగుణములు మూఁడును సమములు అయి ఉండును సత్వము జ్ఞానసుఖములను వానియందు ఇచ్ఛను పుట్టించుచు ఉన్నది ఇది విష్ణురూపము అయ్యెను రజస్సు రాగతృష్ణలయందు సంగమమును పుట్టించుచు ఉన్నది ఇది చతుర్ముఖబ్రహ్మ స్వరూపము అయ్యెను తమస్సు విపరీతజ్ఞానమును నిద్రాలస్యాదులను పుట్టించుచు ఉన్నది ఇది లయకారణము అగుటవలన రుద్రస్వరూపము అయ్యెను ఆసంకల్పస్థితి వదలి ఈశ్వరుఁడు సృష్టిక్రియారూపుఁడు కాఁగానే ఈసత్వరజస్తమోగుణములకు వైషమ్యము కలిగెను అదియే మహత్తత్వ స్వరూపము అది సాత్వికము రాజసము తామసము అని మూఁడువిధములు కలది. ఆస్థితియందు బ్రహ్మము సూత్రబ్రహ్మము (లేక అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము) అనఁబడును. ఈస్వరూపమున అతఁడు నామరూపాత్మకమైన సకలప్రపంచకమును సృజియించెను. ఆ స్రష్టృసృజ్యతాదాత్మ్య స్వరూపమైన బ్రహ్మము విరాడ్రూపము అనఁబడును జ్ఞ

మాత్రతాదాత్మ్య స్వరూపము విష్ణుస్వరూపము.

విరాడ్రూపస్థితియందు చిత్స్వరూపమైన జ్ఞానమును వృత్త్యవచ్ఛిన్న చైతన్యము అందురు, జ్ఞానశూన్యమై వికారాస్పదమై ఉండుదానిని విషయావచ్ఛిన్న చైతన్యము అందురు

అట్లు విరాట్స్వరూపుఁడు అయిన బ్రహ్మమువలననుండి ప్రపంచసృష్టి కలిగెను ఎట్లు అనిన

(౧) తమస్సృష్టి తమస్సు - మోహము - మహామోహము - తమిస్రము - అంధతమిస్రము, ఇందుండి చేతనములేని స్థావర సృష్టి కలిగెను

(౨) తిర్యక్సృష్టి పశుపక్ష్యాదులు

(౩) దేవసృష్టి తుష్టాత్ములై నిత్యానందులై కేవలసాత్త్విక భూతులైనవారు ఈసృష్టియందు పుట్టిరి "నహదేవా అశ్నంతి నపిబంతి ఏతదేవామృతం దృష్ట్వా తృప్యతి" అని సాత్త్వికమునకు ప్రమాణము

(౪) అర్వాక్సృష్టి తమ ఉద్రేకులు అయి దుఃఖబహుళములు కలిగి కర్మశీలులు అయిన మనుష్యుల సృష్టి

౫ అనుగ్రహసృష్టి ఇది సాత్త్వికతామస మిశ్రగుణములు కల జంతురాశి సృష్టి

౬ కౌమారసృష్టి. ఇది ప్రాకృతము వైకృతము అని రెండువిధములు. ఈసృష్టియందే సనత్కుమారాదులు పుట్టినది

ఈయాఱును, మహత్సృష్టి పంచతన్మాత్రసృష్టి పంచభూతేంద్రియసృష్టి అను మూఁటితో చేరి తొమ్మిదిసృష్టులు అగుచు ఉన్నవి ఇది నవవిధసృష్టి వివరణము

ఈసత్త్వరజస్తమో గుణాత్మకులైన త్రిమూర్తులు తమతమ అంశములను ఒకరొకరు పంచుకొనియు ఉందురు ఆస్థితియందు వారికి నామాంతరములు కలవు అవి విష్ణువ్యూహము బ్రహ్మవ్యూహము రుద్రవ్యూహము అనఁబడును

విష్ణ్వంశము బ్రహ్మాంశము రుద్రాంశము

| | | | |
|---|---|---|---|
| వి | ప్రద్యుమ్నుఁడు | సంకర్షణుఁడు | అనిరుద్ధుఁడు. |
| బ్ర | మనువు | దక్షుఁడు | యముఁడు |
| రు | మృడుఁడు | భవుఁడు | హరుఁడు |

త్రిలింగము శ్రీశైలము, కాళేశ్వరము, ద్రాక్షారామము, ఈమూఁడు లింగములకు నడుమ ఉండు దేశము నా॥ ఆంధ్రదేశము ఈదేశపుభాష తెనుఁగు తెలుఁగు అనఁబడును

త్రిలోచనుఁడు రుద్రుఁడు మూఁడుకన్నులు కలవాఁడు అని వ్యుత్పత్త్యర్థము

త్రివిక్రముఁడు వామనుఁడు చూ॥ బలి

త్రిశంకు ఇ॥ సూర్యారణ్యుని కొడుకు హరిశ్చంద్రుని తండ్రి ఇతని మొదటిపేరు సత్యవ్రతుఁడు ఇతఁడు బొందితో స్వర్గమునకు పోవలెనని వసిష్ఠునివేఁడె; అతఁడు అదిసరిపడదు అనఁగా, అతని కొమారుల చెంతకు పోయి వారిని నిర్బంధించెను. వారు తమతండ్రి చెప్పినదాని ఇతఁడు ఉల్లంఘించి నందులకై చండాలత్వము పొందునట్లు శపియించిరి అటువెనుక విశ్వామిత్రుని ఆశ్రయించి అతఁడు తనతపోబలముచేత శరీరముతోనే దేవలోకమునకు పంపఁగా దేవతలచే అచ్చటనుండి తలక్రిందుగ భూమికి పడఁద్రోయఁబడెను అపుడు విశ్వామిత్రుఁడు వీనిని క్రిందపడకుండ నిలిపి త్రిశంకుస్వర్గము అని మఱియొక స్వర్గమును ఇంద్రునిని తనతపోమాహాత్మ్యముచే సృజియింప యత్నించి దేవతల ప్రార్థనచే మానుకొనెను. త్రిశంకుఁడు

అశ్లేనిలిచెను ఇతనికి గురునాజ్ఞ యుల్లంఘన, చండాలత్వము, నిషిద్ధవస్తు భోజనము అను మూఁడు శంకువులు (శంకువు—మేకు, దోషము) సంభవించినందున త్రిశంకుఁడు అను నామము కలిగెను

త్రిశిరసుఁడు ఈ పేరు కలిగిన రాక్షసులు అనేకులు అందు (౧) విశ్రవసు కొడుకు వీఁడు జనస్థానమందు ఖరునికి సహాయుఁడు అయి ఉండెను

(౨) రావణుని కొడుకు హనుమంతునిచేత చంపఁబడెను

త్రేతాగ్నులు పావకుఁడు పవమానుఁడు శుచి అని మువ్వురు వీరు వసిష్ఠుని శాపముచే పృథుచక్రవర్తి కొడుకు అయిన అంతర్ధానునికి కొడుకులు అయి పుట్టి అప్పుడే చచ్చిరి ఆహవనీయము గార్హపత్యము దక్షిణాగ్ని అని గృహస్థుఁడు ఆరాధింప తగిన అగ్నులు మూఁడు

త్రేతాయుగము మూఁడవయుగము దీనిపరిమితి ౧౨౯౬౦౦౦ సంవత్సరములు చూ॥ యుగములు

త్ర్యంబకుఁడు రుద్రుఁడు మూఁడు కన్నులు కలవాఁడు అని అర్థము

త్ర్యంశుఁడు ద॥ విప్రచిత్తి కొడుకు

## త్వ

త్వష్ట (౧) ప్రి॥ యౌవనుని కొడుకు

(౨) ద్వాదశాదిత్యులలో ఒకఁడు

(౩) శుక్రపుత్రుఁడు దైత్యగురువు

(౪) బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు ఇతని కొమారుఁడు అగు విశ్వరూపుని చంపి ఇంద్రుఁడు బ్రహ్మహత్య సంపాదించుకొనెను

త్వష్టృ. సూర్యుని భార్య అయిన సంజ్ఞాదేవి సూర్యుని వేఁడిమిని తాళ చాలక ఛాయాదేవిని తనకు బదులు ఉండ నియమించి తాను కొన్నిదినములు పుట్టింటను ఉండెను ఆవల కొంత కాలమునకు తండ్రి అది సరి కాదు అన్నందున అతనియిల్లు వదలి ఒక ఆఁడుగుఱ్ఱము (బడబా) రూపమును ధరించి తిరుగుచు ఉండెను అంత ఒకప్పుడు సూర్యుఁడు సంజ్ఞాదేవిని కానక త్వష్టపాలికి ఏగి తన సతివృత్తాంతము అడిగిన, అతఁడు ఆమె వేఁడిమి సహింపనోపక మేరుపర్వత సమీపమున ఉన్నది అని తెలుపఁగా ఆమెమీఁది మోహముచేత తానును అశ్వమై ఆమెతో కలసెను అపుడు వారికి ఇరువురికిని అశ్వనీ దేవతలు పుట్టిరి అనంతరము సూర్యుని అనుమతిపడసి అతని తేజమును త్వష్ట తరిమెనపెట్టి అందు రాలిన రజస్సుచేత విష్ణువుకు చక్రమును, శివునకు శూలమును, ఇంద్రునకు వజ్రాయుధమును, చేసి ఇచ్చెను

## ద

దండకారణ్యము ఇక్ష్వాకు పుత్రుఁడు అగు దండుఁడు అసురకృత్యములచే జననిందితుఁడు అగుటవలన తండ్రిచే వింధ్యశైలమునకు పంపఁబడి అందు మధుమంతము అను పట్టణము ఒకటి నిర్మాణముచేసికొని అసురులతో కలిసి అసురగురువైన శుక్రాచార్యులకు శిష్యుఁడు అయి ఆపురమును ఏలుచు ఉండెను ఒకనాఁడు అతఁడు శుక్రాచార్యుని ఆశ్రమమునకు పోయి అచట్ల తపము ఆచరించుచు ఉన్న అతనిపెద్ద కొమార్తె అగు అరజ అనుదానిని కని మోహించి అది అయుక్తము అని ఆమె ఎంత చెప్పినను వినక బలాత్కారముగా ఆమెను కూడి వెడలిపోయెను పిదప దానివిని శుక్రుఁడు మిగుల ఆగ్రహించి ఆదండుఁడు సపరివారముగ నేలపాలు అగునట్లును, ఆ మధుమంతముచుట్టు ఏఁడుదినములు మట్టి

వాన కురియు నట్లును జనశూన్యము అగు నట్లును శాపము ఇచ్చెను చూ॥ జనస్థానము

దండపాణి కాశియందు ఉండు ఒక దేవత

దండాశ్వుఁడు. ఇ॥ నా॥ దృఢాశ్వుఁడు తండ్రి దుంధుమారుఁడు కొడుకు హర్యశ్వుఁడు

దండి ఒకానొక సంస్కృతకవి ఇతఁడు చేసినకావ్యములలో దశకుమార చరిత్రము అను వచనకావ్యము ఒకటిమాత్రము కానఁబడుచున్నది. "దండినః పదలాలిత్యం" అని ఇతని కవిత్వము మిక్కిలి లలితము అని పేర్కొనఁబడి ఉండెను

దండుఁడు (౧) ఇక్ష్వాకుపుత్రుఁడు చూ॥ దండకారణ్యము

(౨) ర॥ సుమాలి కొడుకు

దంతఘాతకుఁడు. హరిశ్చంద్రుని భ్రమింప చేసి బేతావటము క్రింద చేర్చుటకై విశ్వామిత్రునిచేత సృజియింపఁ బడిన ఒకరాక్షసుఁడు

దంతవక్త్రుఁడు. వృద్ధశర్మునికి వసుదేవుని చెలియలు ఐన శ్రుతదేవియందు పుట్టిన కొడుకు వీడును శిశుపాలుఁడును సనకసనందనుల శాపముచే అసురకృత్యములు కల వారుగా పుట్టిన జయవిజయులు. వీఁడు కృష్ణునిచేత చంపఁబడెను.

దంష్ట్రి. శుక్రునిపుత్రుఁడు దైత్య గురువు

దత్త. జంభునికూఁతురు హిరణ్యకశిపునిభార్య

దత్తాత్రేయుఁడు. అత్రికి అనసూయయందు విష్ణువుయొక్క అంశమున, పుట్టిన కొడుకు చూ॥ దుర్వాసుఁడు.

దధిముఖుఁడు సుగ్రీవుని మేనమామ. మధువనమునకు కావలి ఉండిన వానరుఁడు

దధివాహనుఁడు అ॥ అంగుని కొడుకు.

దధీచి ఒకానొకముని ఇతఁడు ఇంద్రునకు తనవెన్నెముకను ఇయ్యఁగా దానితో అతఁడు నూఱు అంచులు కల వజ్రాయుధమును చేసికొనెను. పరులనిమిత్తము తన దేహమును విడిచినందున ఇతఁడు మహాదాత అని పేర్కొనఁ బడియెను ఇతఁడు రుద్రరహితమైన యాగము చేయకూడదు అని దక్షుని ఆక్షేపించెను

దను కశ్యపునిభార్య దక్షప్రజాపతి కూఁతురు ఈమెసంతతివారు దానవులు అనఁబడుదురు

దమనిక ఒకానొక అప్సరస మేనక కూఁతురు సువర్ణ గోత్రుఁడైన కందరుఁడు అనుపక్షివరుని భార్య తార్క్షి తల్లి.

దమయంతి నలునిభార్య విదర్భరాజు అగు భీముని కూఁతురు ఈమె స్వయంవరము నందు ఇంద్రాదిదేవతలను వరింపక నలుని వరించెను. అందులకు కలి మిగుల కోపించి ఆమె పురుషుఁడు అగు నలుని అతని దాయాది అగు పుష్కరునితో జూదమాడునట్లుచేసి అతనికి అనేకములు అయిన ఇడుములు కలుగునటుల చేసెను ఈమె పతియందు అతి అనురాగవతి అయినను అతనిని పాసి కొన్ని దినములు సేవకావృత్తిని ఉండెను. కడపట భర్తను కలసి రాజ్యము మరలచేసి సమస్తసుఖములను అనుభవించెను.

దమలిప్తులు. గంగకు పశ్చిమమున ఉండు దేశస్థులు.

దరుఁడు. య॥ అణువుకొడుకు నా॥ అంధకుఁడు.

దర్పకుఁడు మన్మథునకు నామము.

దర్మషణుఁడు. స్పృంజయుని రెండవకొడుకు

దర్శుఁడు. ధాతకు సినీవాలియందు పుట్టిన కొడుకు

దివిద్యోతుఁడు య॥ దుందుభికొడుకు నా॥ అభిజిత్తు

దశకంఠుఁడు } చూ॥ రావణుఁడు
దశగ్రీవుఁడు }

దశరథుఁడు (౧) ఇ॥ కల్మాషపాదుని పౌత్రుఁడైన మూలకుని (నారీకవచుని) కొడుకు వృద్ధశర్మని తండ్రి

(౨) ఇ॥ అజమహారాజు కొడుకు ఇతనికి ప్రధానభార్యలు కౌసల్య సుమిత్ర కైకేయి అని ముగ్గురు ఇతఁడు చిరకాలము పుత్రులులేక ఉండి పుత్రకామేష్టి అనుయాగముచేసి రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు అను నలువురు కొడుకులను వడసెను అందు కౌసల్యాపుత్రుఁడు అగు రామునకు యువరాజ్యాభిషేకముచేయ యత్నించి ఉండుసంగతి కైకేయి ఎఱిఁగి తనకొడుకు అగు భరతునకు ఆయువరాజ్య పట్టము కట్టునట్లును రామునకు పదునాలుగు సంవత్సరముల వనవాసము ఆజ్ఞాపించునట్లును తనభర్తను అడిగెను ఆయనకు అది సమ్మతి లేక పోయినను (పూర్వము దేవాసురయుద్ధమునందు దేవతలకు సహాయము చేయఁబోయి శంబరాసురుఁడు అనువానితో యుద్ధముచేయునపుడు ఆయసురుఁడు అనేకమాయలు కావింపఁగా కైకేయి తాను ధవళాంగుఁడు అను మునివలన వడసిన మంత్రవిద్యచేత ఆమాయలనెల్ల అణఁచివేయ అందులకు దశరథుఁడు మెచ్చుకొని నీకు ఏమివరముకావలెను అడుగుము అనఁగా రెండువరములు అడిగి అవి తనకు కావలసినప్పుడు ఇచ్చునట్లు మాట తీసికొని ఉండెను కనుక ఆవరములు ఇప్పుడు ఇమ్మనిన) దశరథుఁడు ఏమియు చెప్పనేరక ఊరక ఉండెను కైకేయి రామునితో నిన్ను మీతండ్రి వనవాసము చేయుటకు పొమ్మనెను అని చెప్ప అతఁడు అట్లేచేసెను అది కారణముగ దశరథుఁడు మృతిచెందెను

ఈదశరథమహారాజు ఒకప్పుడు వేఁటాడపోయి, ఒక ఋషిపుత్రుఁడు అంధులగు తనతల్లిదండ్రుల కొఱకు కమండలముతో తటాకమున జలము ముంచుచు ఉండఁగా ఆనీళ్లు ముంచెడు చప్పుడువిని ఏనుఁగు తొండముతో నీళ్లు త్రాగుచు ఉన్నది అని నిశ్చయించి బాణమును సంధించి ఏసెను ఆయేటుతగిలినతోడనే ఆఋషిపుత్రుఁడు మృతి పొందెను పిదప రాజు తనతప్పితము తెలిసికొని అచటికి పోయి అతనిని ఊఱడించి తాను తెలియక ఇట్టిపనిచేసితిని అని ఆదంపతులకు చెప్పెను వారు పుత్రశోకమును భరింపలేక నీవును మావలె పుత్రశోకముచే మృతిపొందుదువుగాక అని శపించి ప్రాణములను విడిచిరి

(౩) య॥ నవరథుని కొడుకు

(౪) అ॥ చూ॥ నా॥ రోమపాదుఁడు

దశార్ణము కాశీదేశమునకు దక్షిణమునను పడమటను ఉండు దేశము

దశార్హుఁడు య॥ నిర్వృతి కొడుకు

దక్షప్రజాపతి (౧) నవబ్రహ్మలలో (లేక ప్రజాపతులలో) ఒక్కఁడు కొందఱు ఇతఁడు బ్రహ్మయొక్క అంగుష్ఠముననుండి పుట్టినవాఁడు అందురు కొందఱు బ్రహ్మమానసపుత్రుఁడు అందురు ఇతనిభార్య ప్రసూతి విష్ణుపురాణప్రకారము దక్షప్రజాపతికి కొమార్తెలు ఇరువదినలువురు వారిలో శ్రద్ధ లక్ష్మి ధృతి తుష్టి పుష్టి మేధ క్రియ బుద్ధి లజ్జ వపువు శాంతి సిద్ధి కీర్తి ఈపదిముగ్గురు ధర్మునిభార్యలు (ధర్మదేవ

రములని ఎఱుఁగవలయును ) ఈవీరియందు ధర్మునకు పుట్టిన పుత్రులు క్రమముగా కాముఁడు దర్పుఁడు నియముఁడు సంతోషుఁడు లోభుఁడు శ్రుతుఁడు దండుఁడు భోధుఁడు వినయుఁడు వ్యవసాయుఁడు క్షేముఁడు సుఖుఁడు యశుఁడు

(౨) ఇతఁడు ప్రచేతస్సులకు చంద్రుని (సోముని) కూఁతురు అగు మరీషయందు పుట్టిన కొడుకు ఈయన చక్షుర్మనువు కాలమున ఉండినట్లు కొందఱు చెప్పుదురు ఇతఁడు బ్రహ్మయాజ్ఞవడసి మైథునక్రియవలన సృష్టిచేయ ఆరంభించెను తత్పూర్వము సంతానము దృష్టిశ్వర్శేచ్ఛాదులవలన కగలుగుచుఉండినట్టు తెలియవచ్చుచున్నది ఈతఁడు వీరణప్రజాపతి కూఁతురు అగు అసిక్నిని భార్యగాగ్రహించి ఆమెయందు తొలుత హర్యశ్వులు అనుననేక పుత్రులను పడసెను వారు అందఱును నారదుని ఉపదేశమున ప్రజాసృష్టియందు ఇచ్ఛ ఉడిగిరి మరల శబలాశ్వులు అనుననేకపుత్రులను పుట్టించెను. వారలును అట్లు అయిరి అంత దక్షుఁడు నారదుని మీఁద కోపించి అతనికి అనపత్యతయును నిరంతర సంచారమును కలుగునట్లు శపించి అఱువండ్రు కొమార్తలను అసిక్నియందు పుట్టించెను. అందు ధర్మునికి పదుగురను, కశ్యపునికి పదుమువ్వురను, చంద్రునకు ఇరువదియేడుగురను, అరిష్టనేమికి నలుగురను, అంగిరసునకు ఇరువురను, కృశాశ్వునకు ఇరువురను బహుపుత్రునకు ఇరువురను ఇచ్చి వివాహములు చేయించెను శ్రీమద్భాగవతమున తార్క్ష్యుడు అను నామాంతరము తాల్చిన కశ్యపునకు మరల నలుగుర కొమార్తలను ఇచ్చినట్లు చెప్పి ఉన్నది.

| ధర్మునిభార్యలు | వారిసంతతి |
|---|---|
| అరుంధతి | పృథివితో చేరిన సమస్తము |
| వసువు | అష్టవసువులు |
| యామి (లేక) జామి | దుర్గ భూములకు అధిష్ఠానదేవత |
| లంఘ (లేక) లంబ | ఘోషుఁడు లేక విద్యోతుఁడు |
| భానువు | భానువులు |
| మరుద్వతి | మరుత్వంతుఁడు జయంతుఁడు |
| సంకల్ప | సంకల్పుఁడు |
| ముహూర్త | మౌహూర్తికులు. |
| సాధ్య | సాధ్యులు |
| విశ్వ | విశ్వేదేవతలు |

చంద్రునిభార్యలు అశ్విని భరణి కృత్తిక రోహిణి. మృగశిర ఆరుద్ర పునర్వసు పుష్యమి. ఆశ్లేష మఖ పుబ్బ ఉత్తర హస్త చిత్త స్వాతి విశాఖ అనూరాధ జ్యేష్ఠ మూల. పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణము ధనిష్ఠ. శతభిషక్కు పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి అనువారు ఈ యిరువదియేడుగురును నక్షత్రములు అనఁబడుదురు

కశ్యపుని పదుమువ్వురుభార్యల నామము లనుగూర్చి చూ॥ కశ్యపుఁడు

తొల్లి దక్షుఁడు యాగముచేసినపుడు రుద్రునికి హావిర్భాగము ఇయ్యనందున అతనికి మరల జన్మము కలిగెను అని అందురు

శ్రీమద్భాగవతమున అరుంధతిని దక్షపుత్రిగా చెప్పి ఉండలేదు ఆమెకు మారు కకుద్దేవిని చెప్పి ఉన్నది కకుద్దేవికి సంకటుఁడును, సంకటునకు కీకటుఁడును, కీకటునకు దుర్గాభిమానులైన దేవతులును పుట్టినట్లు చెప్పి ఉన్నది మఱియు యామి

సంతతికి స్వర్గుడు నంది అనునిరువురు పుట్టినట్లును సంకల్పకు కాముడు పుట్టిన ట్లును శ్రీమద్భాగవతమువలన తెలియఁబడు చు ఉన్నది

దక్షిణ రుచిప్రజాపతికి స్వాయంభువమనువు కూఁతురగు ఆకూతియందు పుట్టినకన్య ఈమె తన అన్న అయిన యజ్ఞుని వివా హము అయ్యెను

## దా

దానవులు కశ్యపునికి దనువునందు పుట్టిన వారును వారి సంతతివారును అందు ము ఖ్యులు అయోముఖుఁడు ఏకచక్రుఁడు పులోముఁడు కపిలుఁడు అంధకుఁడు (కొ అకిదానవుఁడు) అరిష్టుఁడు అరుణి అను తాపకుఁడు ద్విమూర్ధన్యుఁడు శంబరుఁడు హయగ్రీవుఁడు విభావసుఁడు శంకుశిర స్సు స్వర్భానుఁడు వృషపర్వుఁడు విప్ర చిత్తి (ఇతనికి సింహికయందుఁ పుట్టిన కొడుకులు రాహువు కేతువు) వాతాపి ఇల్వలుఁడు నముచి రెండవ స్వర్భానుఁడు కాలనాభుఁడు వక్త్రయోధి త్ర్యంశుఁడు శల్యుఁడు నభుఁడు నరకుఁడు పులోముఁ డు ఖస్పృఘుఁడు రెండవ అంధకుఁడు ధూ మ్రకేతువు విరూపాక్షుఁడు దుర్జయుఁడు వైశ్వానరుఁడు రెండవ తారకుఁడు.

దామగ్రంథి. అజ్ఞాతవాసకాలమున అశ్వపా లక వేషము ధరించిన నకులుఁడు ఉంచి కొనిన నామము

దామోదరుఁడు కృష్ణుఁడు యశోద బాల్య మునందు ఇతని నడుమున త్రాడువేసి రో టితో కట్టెను కనుక ఇతనికి ఈనామము కలిగెను.

దారుకుఁడు. కృష్ణునిసారథి దారకుఁడు అని యు అందురు

దాశార్ణ. వింధ్యపర్వతమున ఉత్పత్తి అయి ఉత్తరవాహిని అగు ఒకనది యమున యందు సంగమము అగును

దాక్షాయిణి పార్వతికినామము దక్షుని కూఁ తురు అని వ్యుత్పత్త్యర్థము

## ది

దిక్పాలకులు చూ॥ అష్టదిక్పాలకులు

దిగ్గజములు చూ॥ అష్టదిగ్గజములు

దితి కశ్యపునిపెద్దభార్య దక్షప్రజాపతి కూఁ తురు ఈమె సుతులు దైత్యులు అనఁబడు దురు

దిలీపుఁడు (౧) ఇ॥ వృద్ధశర్మునికి నామము (౨) ఇ॥ అంశుమంతునికొడుకు భగీరథుని తండ్రి ఈతనిభార్య సుదక్షిణ.

దివిరథుఁడు అ॥ దధివాహనునికొడుకు

దివోదాసుఁడు. (౧) కా॥ నా॥ ద్యుమం తుఁడు భగీరథుని కొడుకు

(౨) పా॥ ముద్గలుని కొ డుకు అహల్యయొక్క అన్న

దివ్యుఁడు య॥ సాత్వతుని కొడుకు

దిష్టుఁడు ఇక్ష్వాకునితమ్ముఁడు ఇతని కొడు కు నాభాగుఁడు

దిష్యంతుఁడు ధుర్యచిత్తు స్వీకారపుత్రుఁడు. దుష్యంతుని తమ్ముఁడు

## దీ

దీర్ఘతముఁడు (౧) ఉతథ్యుని కొడుకు భార్య ప్రద్వేషిణి కొడుకులు గౌతమాదు లు ఈ దీర్ఘతముఁడు జాత్యంధుఁడు అ యినందున ఇతనిభార్య బుద్ధిపుత్రి అయి నను తన్నుమెచ్చక ఉండెను. అందుకు ఇతఁడు అలిగి "పతిహీనలైన భామినులతి ధనవతులయ్యుఁగులజలయ్యును ననలంకృత లయ్యెడు మాంగల్య రహితులయ్యెడుఁ గృప

ణవృత్తినిదియు మొదలుగాక” అనిశాపము ఇచ్చెను

(౨) కా॥ సురాష్ట్రుని కొడుకు ధన్వంతరి తండ్రి

దీర్ఘబాహువు ఖట్వాంగుని కొడుకు రఘు మహారాజుతండ్రి

దీర్ఘాదేవి నిరృతి భార్య

## దు

దుండి
దుండివిఘ్నేశ్వరుఁడు } కాశియందు ఉండు విఘ్నేశ్వరుఁడు

దుంధుఁడు ఒకరక్కసుఁడు. చూ॥ దుందుమారుఁడు

దుందుభి (౧) య॥ నరుని కొడుకు

(౨) మయుని రెండవ కొడుకు మండోదరి సహోదరుఁడు

(౩) మాయావి రెండవ కొడుకు వాలిచే చంపఁబడెను వీని చంపి కళేబరమును వాలి పాఱవైచినపుడు దానినుండి రక్తబిందువులు మతంగమహర్షి తపముచేయుచు ఉండిన ఋశ్యమూక పర్వతమున పడెను అందుకు అతఁడు కోపగించికొని ఆకొండమీఁదికి వాలి వచ్చిన అతనికి తల సహస్ర వ్రక్కలు అగునట్లుగా శాపము ఇచ్చెను

దుందుమారుఁడు. ఇ॥' నా॥ కువలయాశ్వుఁడు దుందుఁడు అను రాక్షసుని చంపుటచే ఇతనికి ఈపేరు కలిగెను

దుర్గ (౧) వింధ్యపర్వతమున ఉండి వెలువడు ఒకనది

(౨) శివునిభార్య. చూ॥నా॥భద్రకాళి ఉమ. పార్వతి.

దుర్జయుఁడు దనువుపుత్రుఁడు.

దుర్దముఁడు (౧) గాంధారుని పౌత్రుని పుత్రుఁడు

(౨) య॥ భద్రసేనునిపుత్రుఁడు



దుర్మదుఁడు య॥ ఈపేరున వసుదేవునకు ఇద్దఱు కొడుకులు ఉండిరి

దుర్మర్షణుఁడు దుర్యోధనుని తమ్ముఁడు

దుర్ముఖుఁడు (౧) దుర్యోధనుని తమ్ముఁడు.

(౨) మాల్యవంతుని కొడుకు

దుర్యోధనుఁడు (౧) ధృతరాష్ట్రునకు గాంధారియందుపుట్టిన నూర్గురు కొడుకులలో పెద్దవాఁడు ఇతఁడు దుశ్శాసన కర్ణశకునుల దుష్టవచనములు విని పాండవులతో మత్సరముపూని భీష్మద్రోణ విదురులమాటలు వినక జాత్యంధుఁడు అయిన ధృతరాష్ట్రుని తనచర్యలకు ఒడంబడునటుల కావించుకొని కడపట నాశము పొందెను. ఇతనిని ఇతని అనుజులను భీముఁడు ఒక్కఁడే చంపెను. ఇతఁడు కలియంశమున పుట్టెను.

(౨) మనువంశమునందలి ఒక రాజు సుదర్శన తండ్రి

దుశ్శాసనుఁడు ధృతరాష్ట్రుని రెండవకొడుకు దుర్యోధనుని పెద్దతమ్ముఁడు

దుష్యంతుఁడు పు॥ ఈళినునకు రథంతరయందు పుట్టిన కొడుకు. శకుంతలభర్త భరతుని తండ్రి.

దుస్సల. ధృతరాష్ట్రునికి గాంధారియందు పుట్టిన కొమార్త. దుర్యోధనుని చెలియలు భర్త సింధుదేశపు రాజు అగు జయద్రథుఁడు

దుర్వాసుఁడు. అత్రికిని అనసూయకును రుద్రాంశమున పుట్టిన కొడుకు. ఇతనిసహోదరులు సోముఁడు దత్తాత్రేయుఁడు. ఇతఁడు మహాకోపిష్ఠుఁడు ఇతని శాపకథలు అనేకములు కలవు.

## దూ

దూర్వాక్షి. వసుదేవుని తమ్ముఁడగు వృకుని భార్య.

దూషణుఁడు ర॥ విశ్రవస్సు కొడుకు ఖరుని సహోదరుఁడు జనస్థానమందు ఉండెను

## దృ

దృఢనేమి పు॥ సత్యధృతుని కొడుకు

దృఢవ్రతుఁడు అం॥ విజయుని కొడుకు

దృఢహనువు భా॥ సేనజిత్తు కొడుకు

దృఢాశ్వుఁడు ఇ॥ చూ॥ నా॥ దండాశ్వుఁడు

దృశ్యుఁడు అగస్త్యమహర్షి కొడుకు.

దృషద్వతి యమునకు పశ్చిమమున ప్రవహించి కౌశికితో సంగమము అగునట్టి నది ఇది బ్రహ్మావర్తమునకు ఒకయెల్ల

## దే

దేవకి వసుదేవుని భార్య. శ్రీకృష్ణుని తల్లి ఈమె పెదతండ్రికొడుకు కంసుఁడు, ఈమెయొక్క ఎనిమిదవ కొడుకు కృష్ణుఁడు తన్ను చంపును అని ఆకాశవాణిచెప్పఁగా విని ఈమెను భర్తతోకూడ చిరకాలము చెఱలో ఉంచి ఉండెను అప్పుడు ఈమెకు ఆరుగురు కొడుకులు కలిగిరి కంసుఁడు కొంచమైనను కనికరము లేక పుట్టినప్పుడే ఆశిశువులను చంపెను ఏడవ గర్భమును విష్ణువుయొక్క ఆజ్ఞచేత యోగనిద్ర లేక మాయాదేవి సంకర్షించి రోహిణి గర్భమునందు చేర్చెను. అంతట కడుపు దిగఁబడి పోయెను అని కంసుఁడు ఊరక ఉండెను. పిమ్మట ఎనిమిదవ గర్భమును తాల్చి దేవకి శ్రీకృష్ణమూర్తిని కనియెను దేవకి అదితి అవతారము అనియు మహాత్తరము అయిన తపము ఆచరించి విష్ణుని కృష్ణునిఁగా కనెను అనియు భాగవతమునందు చెప్పఁబడి ఉన్నది

(౨) ఒకానొక నది. ఇది కోసలదేశముగుండ ప్రవహించి గంగలో సంగమము అగుచు ఉన్నది

దేవకుఁడు. య॥ ఉగ్రసేనుని తమ్ముఁడు దేవకి తండ్రి

దేవక్షత్రుఁడు. య॥ దేవరాతుని కొడుకు

దేవగిరి శతద్రూనదికిని యమునానదికిని నడుమ ఉండు ఒక్కపర్వతము

దేవతలు జన్మదేవతలు కర్మదేవతలు అని దేవతలు ఇరుతెఱంగులు - అగ్ని- ఇంద్రుఁడు యముఁడు సూర్యుఁడు వాయువు వరుణుఁడు మొదలు అగువారు జన్మదేవతలు అనఁబడుదురు వీరు లోకోపకారార్థము ఆయాయి అధికారముతో మొదట సృజింపఁబడి వేదవిహితములు అయిన యజ్ఞాదులకు ఉద్దేశ్యులు అయి తమతమ అధికారములను చెల్లించుచు కడవఱకు ఉండి నశించువారు తమతమ సుకృతకర్మములకు అనుగుణముగ స్వర్గాది లోకభోగములను అనుభవించి పుణ్యము క్షీణించిన తోడనే మానవ లోకమును చెందువారు కర్మదేవతలు వీరు నహుషాదులు

పితృదేవతలు అని మఱి ఒక తెగ దేవతలు కలరు వారు మృతులు అయిన వారి పుత్రాదులచేత చేయఁబడు కర్మాదులవలన తృప్తిని పొంది మృతులకును వారి బాంధవులకును పొసఁగిన దుర్గతి నివారింపను సద్గతిని కలుగఁజేయను సమర్థులుగా ఉందురు

ఇంద్రాదులును పితృదేవతలును రాక్షసభీతిచేత కొంతకాలము కాకులు అయి ఉండిరి కాన కాకులకు అన్నము ఇడుట చేత వారికి తృప్తి అగును

యమపురద్వారమున వైవస్వత కులోద్భవములు అయిన కుక్కలు రెండు ఉండును తత్ప్రీత్యర్థము కుక్కలకు అన్నము ఇడుదురు

అగ్నీంద్రాదిజన్మ దేవతలు ముప్పదిమువ్వురు
అష్టవసువులు (ఎనమండ్రు) ౮
"అగ్నిశ్చ పృథివీచవాయుశ్చాంత రిక్షంచా
దిత్యశ్చ ద్యౌశ్చచంద్రమాశ్చ నక్షత్రాణి
వైతేవసవః" (ఏతేషుహీదంసర్వంవసు
నిహితం ఇతితస్మాద్వసవః)
ఏకాదశరుద్రులు (పదునొక్కండ్రు) ౧౧
"దశవై పురుషే ప్రాణాః ఆత్మఏకాదశః"
ద్వాదశాదిత్యులు (పన్నిద్దఱు) ౧౨
"ద్వాదశవైమాసా స్సంవత్సరస్య"
ఇంద్రుఁడు (ఒక్కఁడు) ౧
బ్రహ్మ (ఒక్కఁడు) ౧
అంతు ౩౩

దేవదత్తము అర్జునుని శంఖము దేవేంద్రునిచే ఇయ్యఁబడినది అగుటచే దీనికి ఈ పేరు కలిగెను

దేవదారువనము ఇందు ఒకప్పుడు భృగ్వాది ఋషులు తపము ఆచరించుచు ఉండ వారల మాయామోహితులుగ చేయ రుద్రుఁడు ఒకసుందరము అయిన యౌవన పురుషరూపమును, విష్ణువు జగన్మోహనము అగు ఒక సుందరీరూపమును, తాల్చి అచటికి వచ్చి తాము అచటి ఋషులవలె తపము ఆచరింపవచ్చినట్లు వారితో చెప్పఁగా వారు వీరికలరూపును ఎఱుఁగమిచే వీరి సుందర రూపములు తమకును తమయువిదలకును తపోభంగము కావించును అని భీతిచెంది రుద్రుని చూచి నీకు ఇందు ఉండ ఇష్టము ఉండెనేని నీలింగమును విసర్జించి ఉండుము అనిన అతఁడు నిజలింగోత్పాటనము చేసి దానిని అందు పాఱవైచి అదృశ్యుఁడు అయ్యెను అప్పుడు అనేక మహోత్పాతములు పుట్టెను. అంత ఆఋషులు నిజస్థితిని ఎఱిఁగి దీనికి ఉపశాంతి ఆనతి ఇమ్ము అని బ్రహ్మను ప్రార్థింపఁగా అతఁడు కరుణ కలిగి వారిని రుద్రుని లింగాకారముగ పూజింప నియమించెను అంతట రుద్రుఁడు ప్రసన్నుఁడు అయ్యెను దీనిని దారువనము అనియు అందురు

దేవప్రయాగ ఇది, అలకనంద గంగతో సంగమము అగు స్థానమున ఉండును ఇందు తొమ్మన్నూఱు అడుగుల పొడవున రామచంద్రస్వామిగుడి ఒకటి ఉన్నది

దేవభాగుఁడు య॥ వసుదేవుని తమ్ముఁడు ఉద్ధవుని తండ్రి

దేవభూతి మగధదేశపు రాజులు అగు శృంగులలో కడపటిరాజు చూ॥ కణ్వుఁడు

దేవమిత్రుఁడు మాండూకేయుని శిష్యుఁడు

దేవమీఢుఁడు హృదికుని కొడుకు వసుదేవుని పితామహుఁడు వసుదేవుని తండ్రి అని శ్రీమద్భాగవతమున నవమస్కంధము నందు చెప్పి ఉన్నది

దేవయాన (దేవయాని) శుక్రాచార్యుల కూఁతురు యయాతి భార్య చూ॥ కచుఁడు, వృషపర్వుఁడు

దేవరక్షిత వసుదేవుని భార్య దేవకునికూఁతురు దేవకితోఁడఁబుట్టువు

దేవరాతుఁడు మి॥ సుకేతుని కొడుకు
(౨) య॥ కరంభి (లేక కుంతి) కొడుకు
(౩) చూ॥ నా॥ శునశ్శేపుఁడు.

దేవలుఁడు. (౧)రు॥అష్ట వసువులలో ఒక్కఁడు అయిన ప్రత్యూషుని కొడుకు ఈదేవలునికి క్షమాశర్ముఁడు మనస్వి అని ఇరువురు కొడుకులు ఉండిరి.
(౨) యా॥ అక్రూరుని పెద్దకొడుకు
(౩) యా॥ దేవకుని కొడుకు. దేవకి సహోదరుఁడు.

దేవవతి రా॥ సుకేశునిభార్య గ్రామణి అను గంధర్వుని కూఁతురు నా॥ దేవమణి

దేవవర్ధనుఁడు యII దేవకుని కొడుకు

దేవవ్రతుఁడు భీష్ముఁడు

దేవసేన అరిష్టనేమి కూఁతురు కుమారస్వామిభార్య ఈమెను కేశి అను దానవుఁడు పట్టి ఎత్తుకొని పోవుచుండ ఇంద్రుఁడు విడిపించెను

దేవస్థానుఁడు. ఋII భారతయుద్ధానంతరము కర్ణుఁడు మొదలు అగువారి మరణమునకై దుఃఖించుచు ఉండిన ధర్మరాజునకు ఇతఁడు హితోపదేశము చేసెను

దేవశ్రవసు యII వసుదేవుని తమ్ముఁడు

దేవహూతి స్వాయంభువ మనువుకూఁతురు కర్దమ ప్రజాపతి భార్య కపిలుని తల్లి ఈమె తన పుత్రునివలన భక్తియోగమును ఎఱిఁగి తత్వజ్ఞానము పడసెను

దేవాంతకుఁడు రII రావణుని కొడుకు హనుమంతునిచేత చంపఁబడెను

దేవాతిథి కుII అక్రోధనుని కొడుకు

దేవాపి కుII ప్రదీపుని పెద్దకొడుకు ఇతఁడు తనతమ్ముఁడు అగు శంతనునికి బ్రాహ్మణుల అనుమతిని రాజ్యము వదలిపెట్టి తపస్సునకు పోయెను

దేవావృధుఁడు. యII సాత్వతుని పుత్రులలో ఒకఁడు. ఇతనికి బభ్రువు అను ఒక పుత్రుఁడు ఉండెను.

దేవారణ్యము లౌహిత్య నదీతీరమున ఉండు అడవి. ఇందు మాణిభద్రుఁడు అను యక్షుఁడు గుహ్యకపరివేష్టితుఁడు అయి వసించుచు ఉండును.

## దై

దైత్యులు. దితిపుత్రులు. ఒకనాఁడు దితి పుత్రార్థ కర నిర్భిన్నయై సంధ్యాకాలమున పెనిమిటి అగు కశ్యపునిచేత అతనితో బలాత్కారముగా రమింప అపుడు ధరించిన గర్భమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టిరి ఆసంధ్యాకాల దోషముచే వారు అతిక్రూరులు అయిరి. అందు హిరణ్యాక్షుని జలమధ్యమున లీనము అయిన ధరణిని నిలుప అవతరించిన యజ్ఞవరాహ మూర్తి అగు విష్ణువు సంహరించెను హిరణ్యకశిపుని ఆవిష్ణువే నారసింహరూపమున సంహరించెను దితికి సింహిక అని ఒక కూఁతురు కలదు

దైత్యసేన దేవసేనయొక్క అక్క. అరిష్టనేమి కూఁతురు

## దో

దోష పుష్పార్ణుని రెండవ భార్య. వ్యుష్టి తల్లి

## దౌ

దౌర్వాసము ఒక ఉపపురాణము.

## ద్యు

ద్యుతిమంతుఁడు. స్వాయంభువ మనువు కొడుకులలో ఒకఁడు ఇతనికి క్రౌంచద్వీపము ఇయ్యఁబడెను. కొడుకులు ఏడ్గురు.

ద్యుమంతుఁడు. చూII నాII దివోదాసుఁడు

ద్యుమత్సేనుఁడు సాళ్వదేశపు రాజు. సత్యవంతుని తండ్రి. సావిత్రి మామ. చూII సావిత్రి

## ద్ర

ద్రవిడము. ఆంధ్ర కర్ణాటకములకు దక్షిణమున ఉండు దేశము.

ద్రావిడము. ద్రవిడదేశపుభాష. ఈభాష పరమేశ్వరుని వలనను సుబ్రహ్మణ్యుని వలనను అగస్త్యమహర్షికి ఉపదేశింపఁబడెను. ఇది పాండ్యరాజుల కాలమున మిక్కిలి వృద్ధిని పొందెను. పాండ్యదేశము మిక్కి-

రాజధాని అయిన దక్షిణమధురలో రాజులచేత ఆదరింపఁబడి మూడు సంఘములు ఉండెను అందు మొదటి సంఘమునుండి ఈభాషను పరిశీలన చేసినవారు అగస్త్యఋషి మొదలుగా కల ఏనూట నలువది తొమ్మండ్రు రెండవ సంఘముతో చేరి ఉండినవారు ఏఁబది తొమ్మండ్రు మూడవ సంఘమున ఉండి దీనిని వృద్ధిచేసినవారు నలువది తొమ్మండ్రు అగస్త్యులచేత చేయఁబడిన అగస్త్యము అని చెప్పఁబడు శాస్త్రమే ద్రావిడభాషలోని వ్యాకరణ శాస్త్రమునకు మొదటిది దీనిని అనుసరించి అగస్త్యుని శిష్యులును జమదగ్ని ఋషి కుమారులును అయిన తొల్కాప్యముని మఱియొక వ్యాకరణ శాస్త్రమును చేసెను ఈతొల్కాప్యమునికి తృణధూమాగ్ని అనిసంస్కృతమున పేరు ఈతఁడుచేసిన శాస్త్రమునకు తొల్కాప్యము అని పేరు ఈభాషలో ఆళ్వారాదుల వలన వేదాంత గ్రంథములు అనేకములు చేయఁబడి ఉన్నవి దీనిని ద్రవిడము అనియు చెప్పుదురు

ద్రాక్షారామము ఇది మహారాష్ట్ర కర్ణాటాంధ్రదేశములకు నడుమ ఉండెడు పర్వతములమీఁద ఉండు ఒకశివ క్షేత్రము

ద్రుపదుఁడు పాంచాలదేశపురాజు ఇతని రాజధాని కాంపిల్య నగరము తండ్రి పృషదుఁడు కొడుకులు ధృష్టద్యుమ్నుఁడు శిఖండి కూఁతురు కృష్ణ లేక ద్రౌపది ఈద్రుపదుఁడును ద్రోణాచార్యులును సహాధ్యాయులు ఒకానొకప్పుడు ద్రోణాచార్యులు పేదఱికముచేత తనసహాధ్యాయి అయిన ద్రుపదుని ఒద్దకు వచ్చి తనలేమిడి చెప్పుకొనఁగా ఇతఁడు అతని ఎఱుఁగనివానివలె మాటలాడి అవమానించెను అందుమీఁద ద్రోణుఁడు హస్తిన పురమునకు పోయి భీష్మాచార్యుల నియోగమున కౌరవులకును పాండవులకును అస్త్రవిద్య కఱపి అందు అర్జునుని మహాసమర్థునిఁగ చేసి అతనిని ద్రుపదరాజును గురుదక్షిణఁగా తెచ్చి ఇమ్ము అని వేఁడెను అర్జునుఁడు అట్లే ద్రుపదుని పట్టితేగా ద్రోణుఁడు అతనిని పరిహాసముచేసి పంపెను అదికారణముగ ద్రుపదుఁడు అర్జునుని పెండ్లాడ తగిన కూఁతురును, ద్రోణాచార్యులను చంపఁదగిన కొడుకును, తనకు లభింపఁగోరి యజ్ఞముచేసెను అప్పుడు ఆయజ్ఞాగ్నికుండమునందు ద్రౌపదియు ధృష్టద్యుమ్నుఁడును పుట్టిరి

ద్రుహ్యుఁడు యయాతిపుత్రులలో ఒకఁడు

ద్రోణాచార్యుఁడు భరద్వాజముని కొడుకు అశ్వత్థామ తండ్రి పాండవులకు ధనుర్విద్యాగురువు ఈతఁడు భారత యుద్ధమునందు ధృష్టద్యుమ్నునిచేత చంపఁబడెను ఇతఁడు శుక్రాంశమున జనించినవాఁడు ఇతనికి కుంభజుఁడు అనియు నామము కలదు చూ॥ ద్రుపదుఁడు

ద్రోణుఁడు ఒకపక్షి ధర్మ్మవక్షుల తండ్రి మందపాలుని కొమరుఁడు

ద్రౌపది ద్రుపద మహారాజుకూఁతురు పాండవులభార్య ఈమె తొలిజన్మమున నలాయనుఁడు అనుఋషి కూఁతురు. ఇంద్రసేన అను నామమున మౌద్గల్యుఁడు అను మహామునికి భార్య అయి ఉండిన పతివ్రతాశిరోమణి కర్మవశముచే అతఁడు కుష్ఠవ్యాధిపీడితుఁడై ఉండెను అయినను ఇంద్రసేన అతనిని అతిభక్తితో ఆదరించుచు ఉండును. అది చూచి అతఁడు మిక్కిలి సంతసిల్లి ఆమెను వరమువేఁడుము అనఁగా అప్పుడు ఆమె తనకు కామభోగేచ్ఛ మిగుల కలుగు అనియు అతనిని కామరూపము

ధరించి అయిమప్రకారె అతనతో కూడి రమింపవలయు ననియు వేఁడెను అతఁడు అట్లే ఆమెను కూడి చిరకాలము ఉండి దేవలోకప్రాప్తి చెందును ఇంద్రసేన కాలవశమున శరీరమువిడిచియు కామభోగము సందు తృప్తిలేక మఱుజన్మమున కాశిరాజు కూఁతురు అయిపుట్టి కన్యాత్వమున బహుకాలము ఉండి పశుపతిని ఉద్దేశించి ఉగ్రతపముచేయ అతఁడు ప్రత్యక్షమై వరము వేఁడుము అనఁగా అపేక్షాతిశయముచేత పతి, పతి, పతి, పతి, పతి, అని అయిదు మాఱులు పలికెను. అది కారణముగ ఆమె ద్రౌపదియైపుట్టి పాండవులకు అయిదు గురికిని భార్య ఆయెను ఈమె యజ్ఞకుండమున పుట్టుటచే యాజ్ఞసేని అనియు ద్రుపదుని కూఁతురు అగుటచే ద్రౌపది అనియు పాంచాలుని* కూఁతురు కాన పాంచాలి అనియు చెప్పఁబడును ఈమెకు తల్లిదండ్రులు పెట్టినపేరు కృష్ణ. ఈమెకు ధర్మరాజువలన ప్రతివింధ్యుఁడును, భీమునివలన శ్రుతసోముఁడును, అర్జునునివలన శ్రుతకీర్తియు, నకులునివలన శతానీకుఁడును, సహదేవునివలన శ్రుతసేనుఁడును పుట్టిరి ఈ ఏవురును ఉపపాండవులు అనఁబడుదురు ఈమె శచీదేవియంశము - చూ॥ ద్రుపదుఁడు

## ద్వా

ద్వాపరము ఒకయుగము దీనిపరిమితి౮౬౪౦౦౦ సంవత్సరముల కాలము చూ॥ యుగములు

ద్వారక శ్రీకృష్ణుని రాజధాని ఘూర్జరదేశమున పశ్చిమభాగమునందు ఉండును. హస్తినాపురికిని దీనికిని డెబ్బది ఆమడల దూరము అక్కడక్కడ పలుద్వారములు ఉంచి ఆద్వారములయందెల్ల తగినకావలి ఉంచి ఉండుటఁజేసి దీనికి ఈపేరు కలిగెను

ద్వితుఁడు బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు

ద్విమీఢుఁడు పు॥ హస్తికుని రెండవ కొడుకు ఈతనివంశజులు పౌరవులు అనఁబడుదురు

ద్విమూర్ధ్నుఁడు దనుపుత్రులలో ఒకఁడు

ద్వివిదుఁడు ఒక వానరుఁడు మైందుని సహోదరుఁడు వీఁడు నరకాసురుని సఖుఁడు తనచెలికాఁడు అయిన నరకుని శ్రీకృష్ణుఁడు చంపెను అని ద్వేషించి కృష్ణుఁడు ఏలునట్టి పట్టణములయందు చొచ్చి జనులను తొందరపెట్టుచు ఉండి తుదను బలరామునిచేత చంపఁబడెను

ద్వీపములు. చూ॥ సప్తద్వీపములు

ద్వైతము (౧) ఒకమతము జీవాత్మపరమాత్మలు-వేఱు అనియు, జీవాత్మ సుకృతిజీవుఁడు దుష్కృతిజీవుఁడు అని రెండు రూపములై ఉండును అనియు, ఆయాజీవులు తమతమ ప్రాచీనరూపసదృశ రూపములతోనే ముక్తిని పొందుదురు అనియు, ఈముక్తి పంచభేదజ్ఞానమువలన కలుగును అనియు, ఈమతసిద్ధాంతము

పంచభేదజ్ఞానము అనఁగా

౧ జీవేశ్వర భేదజ్ఞానము
౨ జీవపరస్పర భేదజ్ఞానము
౩ జడజీవ భేదజ్ఞానము.
౪ జడేశ భేదజ్ఞానము
౫ జడపరస్పర భేదజ్ఞానము ఈమతము మధ్వాచార్యులు అగు ఆనందతీర్థులచే స్థాపింపఁబడినది దీనిని మధ్వమతము అనియు ఈమతప్రవర్తకుల మధ్వులు అనియు చెప్పుదురు

---

* పాంచాలదేశపురాజు అగుటచే ద్రుపదుఁడు పాంచాలుఁడు అనఁబడును

(౨) ఒకానొకవనము తనవాస కాలమున పాండవులు కామ్యక వనమును విడలి ఇందు కొంతకాలము వాసము చేసిరి

ద్వైపాయనము ఇది కురుక్షేత్రమునకు సమీపమున ఉండు ఒకమడుగు దుర్యోధనుఁడు తనసేన అంతయు మడిసినవెనుక ఇందు జలస్తంభముచేసి డాఁగి ఉండెను

# ధ

ధనంజయనిఘంటు. ఒకసంస్కృతనిఘంటువు ఇది రెండు అధ్యాయములు కలది అందు రెండవది నానార్థములును ఉభయార్థములును అగు శబ్దములు కలిగి ఉండును ఇది ధనంజయుఁడు అను పండితునిచే చేయఁబడినది

ధనంజయుఁడు (౧) చూ॥ అర్జునుఁడు
(౨) అగ్ని
(౩) ఒక సంస్కృత నిఘంటు కారుఁడు

ధనికుఁడు య॥ దుర్మమునికొడుకు. కార్త వీర్యార్జునుని పితామహుఁడు

ధన్వంతరి దీర్ఘతముని కొడుకు అమృత మథన కాలమునందు పాలసముద్రమున పుట్టిన ధన్వంతరియే ఆయుర్వేదమును కల్పించుట కొఱకు కాశిరాజువంశమున ఈతఁడుగా పుట్టెను అందురు

ధర్మనేత్రుఁడు య॥ హేహయునికొడుకు ఈతనికి ధర్ముఁడు అనియు పేరుకలదు

ధర్మపక్షులు పింగాక్ష విబోధ సువ్రత సుముఖ నామకములు అగు నాలుగుపక్షులు పూర్వము విపులుఁడు అను ఒకముని ఉండెను అతనికి సుకృశుఁడు తుంబురుఁడు అను నిరువురు కొడుకులు ఉండిరి అందు సుకృశుని ఒకప్పుడు ఇంద్రుఁడు పక్షిరూపిపై నరమాంసముపేడఁగా తన నలువురి కొడుకులలో ఎవ్వనినైన ఒకని ఇంద్రునకు ఆహారము కమ్ము అనిన వారు సమ్మతింపక పోయిరి అందుకు వారితండ్రి అలిగి మీరని పక్షులు కమ్ము అని శపించెను అంతట కొడుకులు తండ్రికాళ్లమీఁద పడి ఈశాపము తొలఁగ అను గ్రహింపుము అనిప్రార్థింపఁగా ఆసుకృశుఁడు శాంతివహించి వారికి జైమినిముని సంశయములను నివర్తించి ఆరూపములు వదలి ఉత్తమపదము పడయునట్లు కరుణించెను ఇవి మార్కండేయ పురాణమును జైమినికి చెప్పిన ధర్మపక్షులు.

భారతయుద్ధము జరుగుచు ఉండఁగా అచ్చటమెలఁగుచు ఉండిన ఒకపక్షియొక్క గర్భము అర్జునుఁడు శత్రులమీఁద ప్రయోగించినబాణము తగిలి భేదిల్లఁగా అందలి గ్రుడ్లు నాలుగు ఆయుద్ధరంగమునందు ఒక ఏనుఁగు మెడనుండు ఘంటక్రింద అడఁగి క్రొవ్వాళ్లకు పిల్లలై కిచకిచలాడుచుండ శమీకుఁడు అను ఋషిచూచి తన ఆశ్రమమునకు కొనిపోయిపెంచెను అవియ ఈధర్మపక్షులు ఆవులుఁగులు ఆవల వింధ్యపర్వతము చేరెను.

ధర్మరథుఁడు చిత్రరథుని కొడుకు.

ధర్మరాజు పాండుమహారాజు పెద్దకొడుకు తల్లి కుంతీదేవి ఇతఁడు యమప్రసాదము వలన పుట్టినవాఁడు ఇతనికి మొదటిపేరు యుధిష్ఠిరుఁడు మహాధర్మాత్ముఁడు అగుట చేత ఇతనికి ధర్మరాజు అను పేరు కలిగెను. ఇతనికి ద్రౌపదివలన పుట్టిన కొడుకు ప్రతివింధ్యుఁడు దేవికి అను నామెవలన పుట్టిన కొడుకు యౌధేయుఁడు ఇతనితమ్ములు భీమసేనాదులు నలువురు

ధర్మవ్యాధుఁడు మిథిలానగరమున ఉండిన ఒక ఎఱుకువాఁడు ఎఱుకుకులమున జ

న్మించియు గురుశుశ్రూషవలన సమస్తధర్మములను చక్కఁగా ఎఱిఁగి ఉండెను వీఁడు తొల్లిఁటి జన్మమున బ్రాహ్మణుఁడుగా ఉండి శాపవశమున ఎఱుకువాఁడుగా పుట్టెను కౌశికుఁడు అను బ్రాహ్మణుఁడు ఒకఁడు వీనివలన సమస్త ధర్మములను తెలిసికొనెను

ధర్మవ్రతుఁడు దండకారణ్యమందు ఉండిన ఒక ఋషి ఇతఁడు శ్రీరామునకు పంచాప్సరస్సరస్సుయొక్క కథను తెలిపెను

ధర్మారణ్యము ఒకానొక పట్టణము ఇది కుశుని మూఁడవ కొడుకు అయిన అమూర్తరజస్సు కట్టినది

ధర్ముఁడు (౧) బ్రహ్మకుడిచేత పుట్టిన దేవత ఇతనికొడుకులు శముఁడు కాముఁడు హర్షుఁడు అని ముగ్గురు

(౨) యయాతి పృథుశ్రవుని కొడుకు ఇతనికి ఉశస్సు అనియు పేరుకలదు

## ధా

ధాత. ఒక దేవత. ఇతఁడును విధాతయు స్వాయంభువ మనువునకు సహాయార్థము బ్రహ్మచే పుట్టింపఁబడినవారు (బ్రహ్మకే ధాత విధాత అనుపేళ్లును కలవు) వీరితో కూడ వరుణునిభార్య అయిన జ్యేష్ఠాదేవియు విష్ణుభార్య అగు లక్ష్మియు పుట్టిరి ఈలక్ష్మి మాతృలక్ష్మి అని అందురు శ్రీమద్భాగవతమున ధాతయు విధాతయు లక్ష్మియు భృగువునకు ఖ్యాతియందు పుట్టినటుల చెప్పి ఉన్నది

ధాత్రిక ద్రౌపదియొక్క పరిచారిక ఈపె పాండవులయరణ్యవాసకాలమునందు ద్రౌపదికి పరిచర్య చేయుచుండి సైంధవుఁడు ద్రౌపదిని చెఱఁబట్టిన వృత్తాంతమును పాండవులకు తెలిపెను

ధాన్యమాలిని ఒక అప్సరస దీనివలన రావణుఁడు అతికాయుఁడు అను కొడుకును పడసెను

ధారాపురము విదర్భదేశమున భోజుని కాలమున రాజధానిగా ఉండిన పట్టణము

ధార్ష్టవంశము వైవస్వత మనువు కొడుకు అయిన ధృష్టునివలన కలిగిన వంశము

## ధీ

ధీమంతుఁడు (౧) పురూరవుని కొడుకు

(౨) ప్రియవ్రతుని వంశస్థుఁడు అయిన విరూపాక్షుని కొడుకు

## ధు

ధుర్యచిత్తుఁడు యయాతి పుత్రుఁడు అగు తుర్వసుని పౌత్రునికి పౌత్రుఁడు ఇతనికి మరుత్తుఁడు అనియు నామము కలదు ఇతఁడు తనకు సంతతి లేకపోఁగా భరతుని తండ్రి అగు దుష్యంతుని తమ్ముఁడు అయిన దుష్యంతుని పెంచుకొనెను

## ధూ

ధూమాదిమార్గము కర్మఠులు పితృలోకమునకు పోవుమార్గము పుణ్యక్షయానంతరము వీరికి పునర్జన్మము కలదు వీరికి హోము చేయు అగ్నిహోత్ర ధూమద్వారా ఈలోకము సిద్ధించును కనుక ఇది ధూమాదిమార్గము అనఁబడును

ధూమ్ర ప్రజాపతిభార్య ధరుఁడు అను వసువునకు తల్లి చూ॥ అవుడు, ప్రజాపతి

ధూమ్రకేతువు దనువు పుత్రుఁడు

ధూమ్రాక్షుఁడు సుమాలి కొడుకు లంకాపట్టణమును ముట్టడించినప్పుడు పశ్చిమద్వారమునందు హనుమంతునిచే వీఁడు చంపఁబడెను

## ధృ

ధృతదేవి దేవకుని కూఁతురు వసుదేవుని భార్య

ధృతరాష్ట్రుఁడు విచిత్రవీర్యుని కొడుకు ఇతఁడు అంబికయందు వ్యాసుల వలన దేవరన్యాయమున జనించినవాఁడు ఇతని భార్య గాంధారి ఇతఁడు పుట్టంధుఁడు అరిష్టుని కొడుకు అయిన హంసుఁడు అను గంధర్వపతి అంశము

ధృతుఁడు గాంధారుని పౌత్రుఁడు

ధ్రువుఁడు. (౧) ఉత్తానపాదునికి సునీతియందు పుట్టిన కొడుకు

ఒకనాఁడు ఉత్తానపాదుఁడు సింహాసనముమీఁద కూర్చుండి తనరెండవభార్య అగు సురుచియొక్క బిడ్డను తొడమీఁద ఉనిచికొని ఉండఁగా అప్పటికి నాలుగు ఏండ్ల బాలుఁడుగా ఉండిన ధ్రువుఁడు చూచి బాల్యచాపల్యముచేత తానును తండ్రితొడ ఎక్క కోరెను సురుచి ఆధ్రువుని అభిప్రాయము ఎఱిఁగి కడు అహంకారముతో తండ్రితొడ ఎక్కవలెను అనునపేక్ష కలిగిన నీవు ఏల సునీతికడుపున పుట్టితివి అని అడిగెను ఆమాట ధ్రువుఁడు విని తన హృదయమునకు అది బాణమువలె నాటఁగా ఆవృత్తాంతము తల్లికి ఎఱిఁగించి ఆమెయనుజ్ఞ పడసి నారద మహర్షియొక్క ఉపదేశమున మిక్కిలి ఉగ్రమైన తపస్సు చేసి విష్ణువును ప్రత్యక్షముచేసికొని తల్లితో కూడ అత్యున్నతమైన పదమును పొందెను

(౨) అష్టవసువులలో ఒకఁడు

(౩) పు॥ మతిసారుని రెండవ కొడుకు

(౪) య॥ బలరాముని తమ్ముఁడు

ధృష్టకేతుఁడు (౧)మి॥ సత్యధృతి కొడుకు

(౨)పా॥ధృష్టద్యుమ్నుని కొడుకు

(౩)కా॥ సుకుమారుని కొడుకు వీనికొడుకు వీతిహోత్రుఁడు

ధృష్టద్యుమ్నుఁడు ద్రుపదుని కొడుకు ద్రౌపదితోఁ బుట్టువు ఇతఁడు భారత యుద్ధమునందు పాండవులకు దళవాయి అయి ఉండెను ఇతఁడు అగ్నియంశము చూ॥ ద్రుపదుఁడు

ధృష్టవర్మఁడు య॥ అక్రూరుని తమ్ముఁడు

ధృష్టి య॥ రెండవ కుంతికొడుకు

ధృష్టుఁడు వైవస్వత మనువు కొడుకులలో ఒకఁడు ఇక్ష్వాకుని తమ్ముఁడు ఇతని వలన ధార్ష్టము అనెడి వంశము కలిగి బ్రహ్మభావమును పొంది నెగడెను కొడుకు నాభాగుఁడు

## ధే

ధేనుకాసురుఁడు ది॥ వీఁడు ఒకప్పుడు గాడ్దభాకారుఁడు అయి తన అనుచరులతోడ బృందావనము నందలి జనులను హింసింపఁగా బలరాముఁడు వీనిని చంపెను

## ధౌ

ధౌమ్యుఁడు పాండవుల పురోహితుఁడు

## న

నంద స్థాలపోతకుఁడు అను నాగరాజుకూఁతురు తండ్రిశాపముచే మూకత్వమును పొందఁగా సుశర్మ సారస్వతము అను ఇష్టి కావించి ఆమూకత్వమును పోఁగొట్టెను

నందనము ఇంద్రుని ఉద్యానవనము

నంది శిలాదునికొడుకు శివుని వాహనము అయిన వృషభము ఇతఁడు కోటిసంవత్సరములు అతినిష్ఠురమైన తపస్సుసలిపి

శివుఁడు ప్రత్యక్షముకాఁగా, మరల రెండు కోట్ల సంవత్సరములు తపము ఆచరించునట్లు వరముపొంది శివుని అనుగ్రహము వడసి పార్వతికి పుత్రభావము పొందెను ఇతనిని నందికేశ్వరుఁడు అనియు అందురు ధర్మునికి యామియందు పుట్టిన దుర్గభూమ్యధిష్ఠానదేవతయొక్క రెండవ కొడుకు అని శ్రీమద్భాగవతమునందు చెప్పి ఉన్నది

నందిగ్రామము అయోధ్యకు సమీపమున ఉండు ఒకచిన్నగ్రామము ఇందు రాముఁడు దండకారణ్యవాసము చేయుకాలమున అతని పాదుకలకు రాజ్యవ్యవహారములను నివేదించుచు భరతుఁడు వల్కలజటాధారుఁడై నివసించి ఉండెను

నందిదుర్గము ఒకానొకకొండ దీనిచేరువను ఉండు ఊరికిని ఈపేరుచెల్లును ఇది మైసూరిసీమలో ఉండును దీనియందు క్షీరనదియు ఉత్తరపినాకిని నదియు పుట్టుచు ఉన్నవి.

నందిసింగన ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు ప్రబోధచంద్రోదయమును తెనిఁగించెను

నందుఁడు (౧) శ్రీకృష్ణుని పెంపుడు తండ్రి యోగమాయాసహాయమువలన వసుదేవుఁడు కృష్ణుని పుట్టినతోడనే ప్రేపలెయందు ఇతనియింటతెచ్చి వదలిపెట్టెను ఇతని భార్య యశోద

(౨) య॥ వసుదేవునికి మదిరయందు పుట్టిన కొడుకు

(౩) నా॥ మహాపద్ముఁడు ఇతఁడు మహానందికి శూద్రస్త్రీయందు పుట్టి అతనివెనుక మగధదేశమునకు రాజు ఆయెను పరశురామునివలె ఇతఁడు దేశమును క్షత్రియశూన్యము కావించినందున ఇతనికి వెనుక శూద్రులు రాజులు అయిరి. ఇతఁడు ఏకచ్ఛత్రాధిపత్యమును వహించినట్లు తెలియవచ్చుచు ఉన్నది ఇతనివంశస్థులు తొమ్మండ్రు నూఱు సంవత్సరములు రాజ్యము చేసిరి

(౪) విష్ణుపరిచరులలో ఒకఁడు

నకులుఁడు పాండుభూపతికి మాద్రియందు అశ్వినీదేవతల ప్రసాదమున జనించినవాఁడు ఇతనికి ద్రౌపదియందు శతానీకుఁడు అను కొడుకును చేదిదేశపురాజు కూఁతురు అగు రేణుమతియందు నిరమిత్రుఁడు అను కొడుకును పుట్టిరి

నక్షత్రకుఁడు విశ్వామిత్రుని శిష్యులలో ఒకఁడు వీఁడు హరిశ్చంద్రుని బొంకింప తలఁచి అతఁడు ఇచ్చెదను అన్న ధనమును రాఁబట్టుకొని వచ్చుటకై తనగురువు పంపఁగా హరిశ్చంద్రునివెంట తరువుకాఁడై పోయెను

నగోద్భేదము ఒకతీర్థవిశేషము

నడ్వల చక్షుర్మనువుభార్య ఉల్ముకునితల్లి

నన్నయభట్టారకుఁడు ఆంధ్రకవులలో మొదటివాఁడు వేగిదేశాధీశుఁడైన రాజరాజనరేంద్రుఁడు రాజమహేంద్రమున రాజ్యము చేయుకాలమున అతనియొద్ద ఇతఁడు ఆస్థానపండితుఁడుగా ఉండెను ఇతఁడు తనయేలినవాని ప్రేరేఁపణచేత భారతమున మొదటి రెండుపర్వములను ఆరణ్యపర్వమున కొంతభాగమును తెనిఁగించి కాలధర్మమును పొందెను (తక్కిన భారతవిశేషమును ఎఱ్ఱాప్రెగ్గడయు తిక్కనసోమయాజియు తెనిఁగించిరి చూ॥ తిక్కన) మఱియు ఈయన ఆంధ్రశబ్దచింతామణి అనుపేరఁ తెనుఁగునకు ఒకవ్యాకరణమును రచియించ దానికి లక్ష్యముగా ఈభారతమును రచియించెను అని చెప్పుదురు ఈహేతువును బట్టియే ఇతఁడు వాగనుశాసనుఁడు అనఁబడెను ఈకవి తాను రచియింపఁబూనిన భారతము

ను ముగింపకయే కాలధర్మమును పొందు
టకు కారణము భీమన అను మహాకవియొ
క్క శాపము అని కొందఱుచెప్పుచు ఉన్నా
రు అది ఎట్లు అనఁగా, భీమన ఇతఁడు
భారతమును తెనిఁగించుటకు మునుపే ఒక
భారతమును తెనుఁగున రచియించి ఆగ్రంథ
మును నన్నయభట్టారకునివద్దకు కొనివచ్చి
దానియందలి లోపాలోపములను పరిశీలిం
చి రాజునకుచూపి తనకు సన్మానము కలు
గఁజేయవలయును అని అడుగఁగా దానిని
అతఁడు చదివిచూచి అందలి ప్రయోగపద్ధ
తులు మొదలగునవి మిక్కిలి శ్లాఘనీయ
ములు అయి ఉండఁగా అది బయటవచ్చి
నయెడ తనభారతము అడఁగిపోవును అని
ఎంచి ఆయభిప్రాయమును బయలుపఱ
పక భీమకవితో నేను రాజు ప్రేరేఁపణచేత
ఒకభారతము రచియించుచు ఉన్నాను
ఆదిపర్వముమాత్రము ఇప్పటికి అయినది
ఇప్పుడు ఈగ్రంథమును రాజునకు చూపిన
యెడ తనప్రయత్నము నెఱవేఱుటకు భంగ
ముగా ఇది ఒకటి వచ్చెను అని తిరస్క
రించునుగాని అంగీకరింపఁడు కనుక సమ
యముచూచి నీగ్రంథమును అతనికి చూపి
సన్మానము చేయింతును అని చెప్పి అది
తీసి తన ఒద్ద ఉంచుకొని ఆయనను పంపి
దానిని కాల్చివేసెను ఈసంగతి భీమన
ఎఱుఁగడు కనుకకొన్ని దినములుతాళి నన్న
య భట్టారకునియింటికివచ్చి అప్పుడు ఆ
యన ఇంటలేకపోఁగా ఆయన భార్యను
పిలిచి నీభర్తచేయుచు ఉన్న భారతము
ముగిసెనా అని అడిగినంతట ఆమె ఆరణ్య
పర్వము జరుగుచు ఉన్నది అని చెప్పెను
అదివిని అతఁడు తనకు ఏసమాచారమును
తెలియఁజేయకయే ఇతఁడు గ్రంథరచన
జరపుచు ఉన్నాఁడు కనుక తనగ్రంథమును
ముందుకు రానీయఁజాలఁడు అని ఎంచి
దానివలనిసంతాపముచే ఇఁకను ఆరణ్య
ములోనే పడి ఉన్నాఁడా అని చెప్పఁగా
అదియే శాపముగా తగిలి ఆకాలముందు ఏ
సోవని కలిగి ఊరిముందరి అడవికి పోయి
ఉండిన నన్నయభట్టారకుఁడు అక్కడనే
దేహత్యాగము చేసెను

నభగుఁడు వైవస్వతమనువు పుత్రులలో ఒ
కఁడు కొడుకు నాభాగుఁడు

నభస్వంతుఁడు ద॥ మురాసురుని కొడుకు
శ్రీకృష్ణునిచే చంపఁబడెను

నభస్వతి అంతర్ధానుని రెండవభార్య హవి
ర్ధానుని తల్లి

నభుఁడు ద॥ విప్రచిత్తి కొడుకు

నముచి ద॥ విప్రచిత్తి కొడుకు భార్య స్వర్భా
నుని కూఁతురు అగు ప్రభ ఇతనిని ఇం
ద్రుఁడు చంపెను

నరకము పాపలోకము ఇది రౌరవ మహా
రౌరవాదిభేదములచే ఇరువదియొక్క విధ
ము కలది ఇందు ఉపపాతక మహాపాతక
ములుచేసిన నరులు బాధింపఁబడుదురు.

నరకుఁడు (౧) వరాహస్వరూపుఁడు అ
యిన విష్ణువునకు భూమియందు పుట్టిన అ
సురుఁడు ఇతనిరాజధాని ప్రాగ్జ్యోతిషము
వాహనము సుప్రతీకము అనెడి ఏనుఁగు
పుత్రుఁడు భగదత్తుఁడు ఈనరకాసురుని
చే అదితియొక్క కర్ణకుండలములును, వరు
ణుని ఛత్రంబును, మణిపర్వతము అనియెడు
అమరాద్రిస్థానమును కోలుపోయి ఇంద్రుఁ
డు హరికి విన్నవింపఁగా అతఁడు సత్య
భామా సహితుఁడును గరుడవాహనా రూ
ఢుఁడును అగుచు ప్రాగ్జ్యోతిషపురము చేరి
నరకునియన్న అగు *మురాసురుని వాని
పుత్రులను చంపి పిమ్మట నరకాసురుని వ

ధించి వానిమందిరమున చెఱను ఉంచఁబడిన పదాఱు వేల కన్యలను తెచ్చి తాను వివాహమయ్యెను ఈనరకాసురుని గెలిచి వచ్చినపుడు కృష్ణుఁడు స్వర్గమునకు పోయి అచట సత్యభామ ప్రేరింపఁగా నందన వనమునందలి పారిజాతవృక్షమును భూమికి తెచ్చెను

(౨) ద॥ విప్రచిత్తి కొడుకు

నరనారాయణులు వీరిరువురు విష్ణునియంశమున పుట్టిన మహామునులు ధర్మునకు దాక్షాయణియైన మూర్తివలన పుట్టినట్లు భాగవతము చెప్పుచు ఉన్నది బదరీవనమున అనేకవేలసంవత్సరములు తపమాచరించినట్లును, దేవతలకు సహాయముగ అసురులతో అనేకమారులు యుద్ధమాడి వారిని జయించినట్లును తెలియును.

నరసరాజు ఇతఁడు ఈశ్వరప్రభువు కొడుకు తమ్ముఁడు తిమ్మన నరసరాజునకు నరసింహులు అనియు పేరు కలదు వసుచరిత్రము ఇతని పేర అంకితముగా ఒనర్పఁబడెను

నరసింహావతారము విష్ణువుయొక్క దశావతారములలో నాలవ అవతారము చూ॥ ప్రహ్లాదుఁడు.

నరాంతకుఁడు. ర॥ రావణుని కొడుకు అంగదునిచే చంపఁబడెను.

నరిష్యంతుఁడు (౧) వైవస్వతమను పుత్రులలో ఒకఁడు కొడుకు చిత్రసేనుఁడు

(౨) మరుచ్చక్రవర్తి కొడుకు

నరుఁడు (౧) ఒకదేవఋషి ఇతఁడును నారాయణుఁడు అను ఋషియు విష్ణువుయొక్క అవతారము అని చెప్పుదురు. వీరే కృష్ణార్జునులుగా అవతరించిరి చూ॥ నరనారాయణులు

(౨) ప్రియవ్రతుని వంశస్థుఁడు అగు గయుని కొడుకు.

(౩) పు॥ భుమన్యుని కొడుకు సంకృతి తండ్రి

నర్మద నర్మ అన కేళి దానిని ఇచ్చును గనుక దీనికి నర్మద అను పేరు కలిగె ఇది మేఖలపర్వతమున పుట్టుటచేత దీనికి మేఖలకన్యక అనియు పేరు కలదు

నర్మద నాగులసహోదరి అనియు పురుకుత్సుని భార్య అనియు పురాణప్రసిద్ధి చూ॥ పురుకుత్సుఁడు

నల గంగలోసంగమము అగు ఒకనది

నలకూబరుఁడు కుబేరుని కొడుకు మిక్కిలి చక్కనివాఁడు వీనిసహోదరుఁడు మణిగ్రీవుఁడు తొల్లి ఒకప్పుడు నలకూబరమణిగ్రీవులు కైలాస పర్వతమునందు మదిరాపానమత్తులు అయి నిర్వాణముగా క్రీడించుచు ఉండిరి అప్పుడు అచటికి నారదుఁడు వచ్చెను మత్తుచే ఒడలు తెలియని వారు అగుటచేత అతఁడు వచ్చినది ఎఱుఁగక వస్త్రములుధరింపక ఉండిరి అందుకు అతఁడు వీరిని ఇద్దఱిని మద్దిమ్రాఁకులు కమ్మ ని శపించెను అంత చిరకాలమునకు నందుని యింట పెరుగుచు ఉన్న కృష్ణుఁడు వెన్న దొంగిలించెను అని యశోద తన్నుఱోటికి కట్టివేయఁగా ఆరోలు ఈడ్చుకొని ఆరెండువృక్షములనడుమ రాఁగా అవి రెండును పెల్లగిల్లిపడి వారికి శాపవిమోచనము ఆయెను

నలిని హస్తికుని కొడుకు అగు అజమీఢుని రెండవ భార్య

నలుఁడు. (౧) యదువు మూఁడవ కొడుకు

(౨) యయాతిపౌత్రుఁడు అణువు రెండవ కొడుకు

(౩) నిషధదేశమునకురాజు వీరసేనుని కొడుకు. భార్య దమయంతి. కొడుకు

ఇంద్రసేనుఁడు కూఁతురు ఇంద్రసేన ఇతని భార్య అగు దమయంతికి స్వయంవరము చాటింపఁగా ఆవర్తమానము విని కలిపురుషుఁడు వరింపఁదలఁచివచ్చి తానువచ్చునంతలో దమయంతి నలుని పెండ్లాడెను అని మాత్సర్యముపట్టి ఇతనికి పెక్కు ఇడుమలు కలుగ చేసెను

(౨) విశ్వకర్మవలన పుట్టిన ఒకవానరుఁడు ఇతఁడు వానరసేన లంకకు పోవుటకై సముద్రమునకు సేతువును కట్టినవాఁడు

నవఖండములు చూ॥ నవవర్షములు

నవగ్రహములు సూర్యాదిగ్రహములు అవి సూర్యుఁడు చంద్రుఁడు అంగారకుఁడు బుధుఁడు గురుఁడు శుక్రుఁడు శని. రాహువు కేతువు

నవరథుఁడు య॥ భీమరథుని కొడుకు

నవరాత్రి ఆశ్వయుజశుక్లపాడ్యమి మొదలు నవమివఱకు కల తొమ్మిదిరాత్రులు కృతయుగమున ఒకప్పుడు సుకేతనుఁడు అను రాజు తనజ్ఞాతులచే రాజ్యభ్రష్టుఁడై భార్యతోకూడ అడవులు తిరుగుచు కష్టమును అనుభవించుచు ఉండఁగా అంగిరసుఁడు అను ఋషి అతనికి నవరాత్రిపూజావిధులను ఉపదేశించెను అతఁడు అపేరీతిని ఆ పూజసలిపి మరల యథాప్రకారము తన ఐశ్వర్యమును పొందెను. ఈఐతిహ్యమును పట్టి లోకులు దుర్గ లక్ష్మి సరస్వతి వీరిలో ఒక్కొక్కదేవిని మూఁడేసిదినములు పూజింతురు ఈతొమ్మిది రాత్రులయందును ఆదేవతలను పూజించుటకు వసతికాని ఎడల కడపటిదినము అగు నవమినాఁడు విద్యాపీఠమున పుస్తకములనుపెట్టి దేవీత్రయమును కల్పవిధిప్రకారము పూజింతురు అట్లు పూజించుటచే ఆదినము మహానవమి. అనియు సరస్వతీదేవిని పూజించు... స్వాతిపూజాదినము అనియు ఆయుధములను పెట్టిపూజించుటచే ఆయుధపూజాదినము అనియు చెప్పఁబడును మఱునాటి దశమితిథికి విజయదశమి అని పేరు

నవవర్షములు భరత హేమకూట నైషధ ఇలావృత నీల శ్వేత కురు భద్రాశ్వ కేతుమాలవర్షములు చూ॥ అగ్నీధ్రుఁడు

నవవిధసృష్టి చూ॥ త్రిమూర్తులు

నహుషుఁడు ఒకానొక రాజు ఇతఁడు చంద్రవంశస్థుఁడు అగు ఆయువునకు స్వర్భానవియందు పుట్టినవాఁడు పురూరవుని పౌత్రుఁడు ఈతని భార్య ప్రియంవద పుత్రులు యతి యయాతి సంయాతి ఆయాతి ఉద్ధవుఁడు అని ఏవురు శ్రీమద్భాగవతమునందును, విష్ణుపురాణము నందును, నహుషుని కొడుకులు యతి యయాతి సంయాతి ఆయాతి వియతి కృతి అని ఆఱుగురు చెప్పఁబడి ఉన్నారు

ఈతఁడు తన గుణాతిశయముల చేత దేవతలవలన ప్రార్థింపఁబడి దేవేంద్రునికి బ్రహ్మహత్యాదోషము సంభవించి ఉండు కాలమున దివిజరాజ్యము చేసెను అట్లయినను ఇతఁడు దేవరాజ్యము లభింపఁగానే గర్వించి వేదములనుగూర్చి నిర్లక్ష్యముగ భాషించినందున అగస్త్యుఁడు ఇతని అజగరము అగునట్లు శపించెను ఆశాపము పాండవుల అరణ్యవాసకాలమున తాను అడిగిన కొన్నిప్రశ్నలకు ధర్మరాజు సమాధానము చెప్పఁగా వినినంతట తీఱెను

## నా

నాగధన్వము ఇది ఒకపుణ్యక్షేత్రము ఇందు వాసుకిని నాగేంద్రత్వమునకు అభిషేకము చేసిరి

నాగమాంబిక కృష్ణదేవరాయల తల్లి

నాగముఖ్యులు కద్రువయందు కశ్యపునకు వేవురుకొడుకులు పుట్టిరి వారెల్ల నాగులు అయిరి వారు శేష, వాసుకి, ఐరావత, తక్షక, కర్కోటక, ధనంజయ, కాళియ, మణినాగ, ఆపూరణ, పింజర, ఏలాపుత్ర, వామన, నీల, అనీల, కల్మాష, శబల, ఆర్యక, ఆగ్రక, కలశపోతక, సురాముఖ, దధిముఖ, విమలపిండక, ఆప్త, కోటరక, శంఖ, వాలశిఖ, నిష్ఠానక, హేమనేత్ర, నహుష, పింగళ, బాహ్యకర్ణ, హస్తికర్ణ, ముద్గరపిండక, కంబళ, అశ్వతర, కాళీయకవృత్త, సంవృత్తక, శంఖముఖ, కుష్మాండక, క్షేమక, పిండారక, కరవీర, పుష్పదంష్ట్ర, బిల్వక, బిల్వపాండర, మూషికాద, శంఖశిరః, పూర్ణదంష్ట్ర, హారిద్రక, అపరాజిత, జ్యోతిక, శ్రీవహ, కౌరవ్య, ధృతరాష్ట్ర, శంఖపిండ, పుష్కర, శల్యక, విరజః, సుబాహు, శాలిపిండ, హస్తిపిండ, పిటరక, ముఖర, కోణనాసిక, కుటర, కుంజర, ప్రభాకర, కుముద, కుముదాక్ష, తిత్తిరి, హాలిక, కర్దమ, బహుమూలక, కర్కర, అకర్కర, కుండోదర, మహోదర, ప్రభృతులు

నాగవీధి ధర్మునికూఁతురు తల్లి జామి లేక యామి నక్షత్రవీధియొక్క ఉత్తర భాగమునకు అభిమానిని అగు దేవత.

నాచనసోమనాథుఁడు ఇతఁడు ఒక గొప్ప ఆంధ్రకవి ఉత్తర హరివంశము అను మహాకావ్యమును రచియించెను ఇందలి ప్రయోగములును దీనిశైలియు అసదృశములు

నానార్థరత్నమాల ఒకానొక సంస్కృత నిఘంటువు ఇది ఇరుగపదండ నాథుఁడు అను పండితునిచే చేయఁబడినది

నాభాగుఁడు (౧) ఇక్ష్వాకుని తమ్ముఁడు అయిన దిష్టునికొడుకు ఇతఁడు తనకృత్యములవలన వైశ్యత్వమును పొందెను మార్కండేయ పురాణమున ఇతఁడు సుప్రభ అను ఒక వైశ్యస్త్రీని గాంధర్వవివాహమున పెండ్లాడినందున వైశ్యుఁడు ఆయెను అని చెప్పఁబడి ఉన్నది వీనికొడుకు బలంధనుఁడు విష్ణుపురాణ వ్యాఖ్యానకర్త నాభాగుఁడు వైశ్యత్వమును చెందకముందే బలందనుఁడు పుట్టినందున అతనికి క్షత్రియత్వము పోలేదు అనుచున్నాఁడు మఱికొందఱు అతఁడు తన తపో బలముచేత మరల రాజర్షి అయినట్లు చెప్పెదరు

(౨) ఇక్ష్వాకుని మఱి ఒక తమ్ముడు అయిన నభగుని పుత్రుఁడు ఇతఁడు అంబరీషుని తండ్రి. ఇతని సత్యమునకు మెచ్చి రుద్రుఁడు అంతర్దర్శిత్వంబును సనాతనంబగు బ్రహ్మజ్ఞానమును ఇతనికి ఉపదేశించెను

(౩) ఇ॥ సుహోత్రునికొడుకు

నాభి ఆగ్నీధ్రుని తొమ్మండ్రు కొడుకులలో ఒక్కఁడు ఈతని పాలికి జంబూ ద్వీపము వచ్చెను భార్య మేరుదేవి కొడుకు ఋషభుఁడు చూ॥ భరతఖండము

నారదీయము (౧) పదునెనిమిది పురాణములలో ఒకటి ఇది నారదప్రోక్త బృహత్కల్ప ధర్మాదులను కలది దీనిగ్రంథసంఖ్య ౨౫౦౦౦

(౨) ఉపపురాణ ములలో ఒకటి

నారదుఁడు బ్రహ్మకొడుకు ఇతఁడు కడచిన మహాకల్పమునందు ఉపబర్హణుఁడు అను గంధర్వుఁడుగా ఉండి ఒకనాడు విశ్వస్రష్టలు అయిన బ్రాహ్మణులు దేవసత్రము అనియెడు యాగమును చేయుచు నారాయణ కథలు గానము చేయ ఇతనిని పిలువఁబంపిరి అప్పుడు ఆచటికి ఇతఁడు పోయి

కొన్ని విష్ణుగాథలు పాడి అందు వచ్చి ఉండిన సతులను చూచి మోహితుఁడై వారలను కూడి చనెను అంత ఆబ్రాహ్మణులు కోపించి ఇతనిని శూద్రజాతిసతికి సుతుఁడవు అగుము అని శపియింపఁగా అట్లు పుట్టి పూర్వజన్మ వాసనవలన బ్రహ్మవాదులు అయిన పెద్దలకు శుశ్రూషలుచేసి ఆపుణ్యమున ఈమహాయుగమునందు బ్రహ్మమానసపుత్రుఁడు అయి జన్మించెను చూ॥ పర్వతుఁడు

ఇతఁడు కలహప్రియుఁడు దక్షప్రజాపతి కొడుకులనందఱకు విరక్తిమార్గము ఉపదేశించి సృష్టికి పరాఙ్ముఖులనుగా చేసినందున ఇతనిని అతఁడు అనపత్యుఁడును అస్థిరుఁడును అగునట్లు శపించెను

నారసింహకవి ఒక ఆంధ్రకవి ఇతఁడు విష్ణుమాయా విలాసమును ద్విపదగా రచియించెను

నారసింహము ఇది ఉపపురాణములలో ఒకటి

నారాయణకవచము ఇది ఒక మహామంత్రము దీనిని జపియించిన విష్ణుభక్తులకు మోక్షము కలుగును

నారాయణగోపాలురు కృష్ణునితో సమానమైన బలపరాక్రమములు కల పదివేవురు గొల్లవాండ్రు వీరు భారతయుద్ధమున దుర్యోధనునికి సహాయమువచ్చి అర్జునునిచేత చంపఁబడిరి

నారాయణాఖ్యానము నారాయణ ఋషిచే నారదునకు చెప్పఁబడిన శ్రుతిగీత ఒకనాఁడు నారదుఁడు నారాయణాశ్రమమునకు చని ఋషిగణ సమేతుఁడు అయిన నారాయణ ఋషిని, సత్త్వాదిగుణ శూన్యము అయిన బ్రహ్మమునందు సత్త్వాది గుణగోచరము అయిన వేదములు ఏక్రమమున ప్రవర్తించును అని అడుగఁగా ఆమహర్షి అంతకుముందు సనకసనందనాదులకు బ్రహ్మ చెప్పిన ప్రకారము పరమతత్త్వార్థ ప్రతిపాదకము అయిన శ్రుతిగీతలను నుడివెను

నారాయణామాత్యుఁడు ఒక ఆంధ్రకవి ఇతఁడు హంసవింశతి అను గ్రంథమును రచియించెను ఇతఁడే పంచతంత్రమును పద్యకావ్యముగా చేసెను అని చెప్పుదురు

నారాయణుఁడు భగవంతుఁడు అయిన ఈశ్వరునకు నామము నారము అనఁగా ఉదకము అది స్థానముగా కలవాఁడు కనుక భగవంతుఁడు నారాయణుఁడు అనఁబడును మహాప్రళయమప్పుడు సమస్తము జలార్ణవము అయి అంతట అంధకారము నిండిఉండఁగా, భగవంతుఁడు ఆజలము పైని యోగనిద్రను తేలుచు ఉండి యజ్ఞవరాహ రూపమును పొంది, జలమున మునిఁగి ఉన్న భూమిని పైకి ఎత్తి నీటిపైని నావ చందంబున తేలించెను ప్రళయకాలమున తునియలు అయిన పర్వతాదులను మరల ఎప్పటియట్లకావించి సమస్తమును చక్కచేసెను

నారీకవచుఁడు ఇ॥ నా॥ చూ॥ మూలకుఁడు

నారీతీర్థములు సౌభద్రము, పౌలోమము, కారండవము, ప్రసన్నము, భారద్వాజము, అను నామములతో దక్షిణాపథమునందు ప్రసిద్ధములు అయిన పంచతీర్థములు ఇందు ఒక మునిశాపమున నంద, సౌరభేయి, సమీచి, వళి, లత, అనువారు అయిదుగురు అప్సరసలు మహాగ్రాహములు అయి ఉండఁగా అర్జునుఁడు తీర్థయాత్ర చేయు కాలమున వారిని శాపవిముక్తులనుగా చేసెను.

నావాఁడ ఆంధ్రదేశమున ఒక సామంతరాజు పట్టణము.

నాలాయని నలాయనుఁడు అను ఋషి కూఁతురు ఈమె పేరు ఇంద్రసేన ఈమె మౌద్గల్యుఁడు అను కుష్ఠురోగి అయిన ఋషికి భార్య అయి ఉండి పిమ్మట ద్రౌపది ఆయి జన్మించి పాండవులు ఏవురకును భార్య ఆయెను చూ॥ ద్రౌపది

నాళీజంఘుఁడు ఒకబకశ్రేష్ఠుఁడు నా॥ రాజధర్ముఁడు మధ్యదేశమునందు గౌతముఁడు అను బ్రాహ్మణుని కొమారుఁడు ఒకడు, వేదాధ్యయనాది విప్రకర్మ విరహితుఁడు అయి బోయలతో కలసి ధనముఘటింప తిరుగుచు ఒకనాఁడు నాళీజంఘుని ఒద్దకు పోఁగా అతఁడు తనసఖుఁడు అగు ఒక దైత్యభర్తవలన వానికి ధనము ఇప్పించెను ఆధనమును కైకొనిపోవునపుడు ఆక్రూరుఁడు కొంత అయిన నెనరులేనివాఁడు అయి నిద్రపోవుచు ఉన్న నాళీజంఘుని తన ఆహారార్థము చంపెను అంత నాళీజంఘుని చెలికాఁడు అగు దైత్యుఁడు ఇది ఎఱిఁగి ఆబ్రాహ్మణుని వధించెను వాఁడు కృతఘ్నుఁడు ఐనందున వాని మాంసమును కుక్కలుకూడ ముట్టవయ్యె ఆవల నాళీజంఘుఁడు తన మహానీయత వలన పునర్జీవితుఁడు అయి ఆబ్రాహ్మణుని మరల బ్రదికించి ఇఁక ఇట్లు చేయకుము అని బుద్ధిచెప్పి పంపెను

# ని

నికుంభుఁడు (౧) ఇ॥ ఇతనితండ్రి హర్యశ్వుఁడు. కొడుకు బర్హిణాశ్వుఁడు ఆబర్హిణాశ్వుఁడు అమితాశ్వుఁడు లేక సంభవాశ్వుఁడు లేక సంహతాశ్వుఁడు అనియు అనఁబడును

(౨) ర కుంభకర్ణుని కొడుకు వీఁడు హనుమంతునిచే చంపఁబడెను

నికృంతనము ఇది ఒకనరకము ఇందు అనేకములు అగు కుమ్మరిసారులు ఉండును. వానిచే క్రూరకర్ములు త్రిప్పఁబడి చెడియు మరల యాతనాధారులు అయ్యెదరు

నిచక్నుఁడు కు॥ అభిమన్యునికి ఏడవతరము వాఁడు వీనికాలమున హస్తినాపురము గంగయందు మునిఁగి పోయె ఆవల కౌశాంబి రాజధాని అయ్యెను

నిధాఘుఁడు పులస్త్యుని కొడుకు ఋభుని శిష్యుఁడు

నిబంధనకారులు శ్రుతిస్మృతులను సూత్రములనుబట్టి ఆచారవిధులను ఏర్పఱిచిన కొందఱు పురోహితులును ఆచార్యులును వానియందు ముఖ్యముగ శుభాశుభ కర్మములయొక్క ప్రయోగములను గుఱించి చెప్పఁబడియుండును అవి యజ్ఞాజీయము నిర్ణయసింధువు ధర్మప్రవృత్తి ధర్మసింధువు అభినవషడశీతి వైద్యనాధ దీక్షితీయము హేమాద్రి పరాశరమాధవీయము మొదలగునవి

నిబంధనగ్రంథములు అనేక విహిత ధర్మములు శ్రుతి స్మృతులయందు కాక మఱికొన్ని నిబంధనగ్రంథములయందు చెప్పఁబడి ఉన్నవి. వానియందు ఒక్కొకవిషయమును సిద్ధాంతీకరించి దానికి ప్రమాణముగ స్మృతివాక్యములను ఉదాహరించి వానిపై పెద్దల అభిప్రాయములను నిరూపించి స్థాపించి ఉందురు బహుతరముగ ఈనిబంధన గ్రంథములను అనుసరించియే లోకమున ఆచారములు జరగుచువచ్చును ఇవి అన్నియు అచారకాండము వ్యవహారకాండము ప్రాయశ్చిత్తకాండము అని మూఁడుభాగములుగ ఉన్నవి

నిమి ఇక్ష్వాకుపుత్రులలో ఒకఁడు ఇతఁడు ఒకానొక సమయమునందు ఒకయాగము చేయ కోరి తనపురోహితుఁడైన వసిష్ఠుని

ఒద్దకు పోయి తాను చేయఁబూనిన యజ్ఞము నడపింప ప్రార్థించెను అందులకు అతఁడు నన్ను ఇంతకుముందే ఇంద్రుఁడు తనయజ్ఞమునకు అధ్వర్యుఁడుగా వరించి పోయి ఉన్నాఁడు కనుక ఆయజ్ఞమును నెఱవేర్చివచ్చి నీయజ్ఞమును నడపెదను అని చెప్పెను దానికి ఇతఁడు కోపించి ఆయనను విడిచి గౌతమఋషిని వరించి ఆయనచేత యజ్ఞమును సాగించెను అనంతరము వసిష్ఠుఁ ఇంద్రుని యజ్ఞమును నెఱవేర్చివచ్చి ఇతనియొక్క ఇంటివాకిట చేరి కాచి ఉండెను అప్పుడు ఒడలికచేత పగలు అని ఎంచక ఇతఁడు నిద్రించుచు ఉండెను కనుక ఆవృత్తాంతము విచారింప అనుకూలింపక పోయెను అంతట వసిష్ఠుఁడు కులగురుఁడను అగు నన్ను విడిచి యజ్ఞము చేయటగాక నేనువచ్చి వాకిట నిలిచి ఉన్నను విచారింపక మత్తుఁడై నన్ను అవమానించిన ఈదుష్టుఁడు అంగహీనుఁడు అగుగాక అని శపించెను అదిహేతువుగ ఇతఁడును వసిష్ఠుని అట్లే శపించెను అపుడు బ్రహ్మ వీరితెఱఁగు ఎఱిఁగి నిమిని సకల ప్రాణులకనురెప్పలయందు వసించునట్లును, వసిష్ఠుని మిత్రావరుణులకు కొడుకై దేహధారి అగునట్లును అనుగ్రహించెను కనుకనే రెప్పపాటునకు నిమిషము అనుపేరు కలిగెను. ఇతని కొడుకు మిథిలుఁడు

నిమ్నుఁడు యా॥ అనమిత్రునిజ్యేష్ఠపుత్రుఁడు ఇతని కొడుకులు సత్రాజిత్తు ప్రసేనుఁడు అని ఇరువురు.

నియతి మేరుపుకూఁతురు విధాతభార్య

నిరృతి అష్టదిక్పాలకులలో ఒకఁడు. ఇతఁడు ఏలునట్టిదిక్కు దక్షిణపశ్చిమము భార్య దీర్ఘాదేవి వాహనము నరుఁడు పట్టణము కృష్ణాంగన ఆయుధము కుంతము

నివాతకవచులు దైత్యులలో ఒక తెగవారు ప్రహ్లాదుని వంశస్థులు భారతమున వీరినిదానవులు అని చెప్పి ఉన్నది వీరు అందఱును తుల్యరూపబలప్రభలు కలవారు వీరిసంఖ్య ముప్పదికోట్లు సముద్రమధ్యము వాసస్థానముగా చేసికొని దేవతలకు మిక్కిలి బాధ కావించుచు ఉండఁగా వీరిని ఇంద్రప్రేరితుఁడై అర్జునుఁడు చంపెను

నిశాకరుఁడు (౧) ఒకానొక ఋషి ఇతని ఆశ్రమమునందు ఉండి సంపాతియు జటాయువును మింటికి ఎగసి సూర్యుని కిరణములవేఁడిమికి తాళలేక మూర్ఛిల్లి జటాయువు జనస్థానమునందు పడఁగా, సంపాతి మఱియు మీఁదికి ఎగసి సూర్యునికిరణముల సెగచే ఱెక్కలుకాలి అంచుండి ఈమునివరుని ఆశ్రమమునందు పడి దుఃఖించుచు ఉండెను అదిచూచి కరుణించి ఈ నిశాకరుఁడు రఘువంశశేఖరుఁడు అగు శ్రీరాముఁడు తనభార్యను కపటరాక్షసునిచే కోలుపోఁగలఁడు, అప్పుడు ఆదేవిని హనుమంతాది వానరులు వెదకవత్తురు, నీవు ఆవానరులకు రామునిభార్య అగు సీత ఉండు చోటు తెలియఁబఱచితివేని నీఱెక్కలు మరల మొలచును; అంతఃర్యంతము ఇచ్చటనే వసింపుము అని అనుగ్రహించెను. ఈతని ఆశ్రమము వింధ్య పర్వతమునందు ఉండెను

(౨) చంద్రునికినామాంతరము

నిశుంభుఁడు ది॥ చూ॥ శుంభనిశుంభులు

నిషధము. వింధ్యపర్వత సమీపమున పయోష్ణీనదీతీరమునందు ఉండుదేశము దీనికి నలుఁడు రాజుగా ఉండెను.

నిషధుఁడు (౧) కురుని నాలవ కొడుకు

(౨) శ్రీరాముల కొడుకు అగు కుశుని పౌత్రుఁడు.

## నీ

నీపుఁడు బా॥ పారునికొడుకు ఇతనికి నూర్వురు కొడుకులు కలరు వారిలో జ్యేష్ఠుఁడు సమరుఁడు అతఁడు కాంపిల్యాధిపతి అయ్యెను

నీలకంఠక్షేత్రము హిమవత్పర్వత సమీపమున కౌశికీనది పుట్టుచోటు

నీలుఁడు (౧) పు॥ అజమీఢునికొడుకు

(౨) రాజసూయయాగమునకై పాండవులు దిగ్విజయము చేయునవసరమున సహదేవునితో యుద్ధముచేసిన మాహిష్మతీపురి రాజు

(౩) అగ్నివలన పుట్టిన ఒక వానరుఁడు సుగ్రీవుని సేనా నాయకులలో ఒకఁడు

## నృ

నృగుఁడు (౧) వైవస్వతమనువు రెండవ కొడుకు. ఇక్ష్వాకుని తమ్ముఁడు. ఇతఁడు మహాఖ్యాతికి ఎక్కిన రాజు వాపీకూపతటాక వనములు అనేకములు ఇతఁడు ప్రతిష్ఠచేసెను అయినను ఇతఁడు ఒకప్పుడు అజ్ఞానముచే ముందు తాను ఒక బ్రాహ్మణునికి దానము ఇచ్చిన గోవును మరల ఇంకొకనికి దానము ఇచ్చుటచేసి ఊసరవెల్లి అయి శ్రీకృష్ణుని సంస్పర్శన దర్శనములవలన ఆరూపముమాని దివ్యరూపధరుఁడును దివ్యవిమానారూఢుఁను అయి దివమునకు చనియెను

(౨) అ॥ ఉశీనరుని రెండవకొడుకు

నృసింహాకవి ఒక ఆంధ్రకవి ఇతఁడు కవికర్ణరసాయనము లేక మాంధాత చరిత్రము అను కావ్యమును రచియించెను

## నై

నైమిశము ఒక అడవి తొల్లి, మరీచి అత్రి భృగువసిష్ఠుఁడు క్రతువు అంగిరసుఁడు, వీరి వంశజులు అగు ఆఱుతెగలవారు తాము తపము ఆచరింప తావుచూపుము అని బ్రహ్మను వేఁడఁగా అతఁడు మనోమయ చక్రమును ఒకటిని సృజియించి దానిని దొర్లించి వారలఁ గాంచి మీరు ఈచక్రము వెన్నంటిచనుఁడు, అది ఎచటనిలుచునో అదియె మీకు తపస్సుచేయుటకు తగినచోటు అగును, అని ఆనతిచ్చెను అది పోవుచు పోవుచు ఒకచోట నేమి (అనఁగా చక్రపు ఇనుపకట్టు) వదలి తట్టుపడెను ఆస్థలము నైమిశము అన పరఁగెను ఈనైమిశము పురాణ ప్రసిద్ధమైన అరణ్యము పెక్కండ్రు ఋషులు అనేక సంవత్సరములు ఇచట తపము అచరించుటవలన దీనిని మహాపుణ్యక్షేత్రము అని కొనియాడుదురు

నైషధము పంచకావ్యములలో ఒకటి ఇది శ్రీహర్షునిచేత చేయఁబడినది దీనికి మల్లినాథసూరి వ్యాఖ్యానము రచించి ఉన్నాఁడు నిషధదేశపురాజు నిషధుఁడు (నలమహారాజు) అతని కథ ఇందు చెప్పఁబడి ఉండుటచేత దీనికి ఈపేరు కలిగెను

## న్య

న్యగ్రోధుఁడు య॥ కంసుని తమ్ముఁడు

న్యాయశాస్త్రము ప్రత్యక్షానుమానాది ప్రమాణములను ఎఱుఁగ తగిన శాస్త్రము. ఇదియే తర్కశాస్త్రము అనఁబడును.

## ప

పంచగౌడులు సారస్వతము, కన్యకుబ్జము, మిథిలము, గౌడము, ఉత్కలము, అను ఈ అయిదు దేశములయందలి బ్రాహ్మణులు.

పంచచూడ ఒక అప్సరస నారదుఁడు ఒకప్పుడు వనితలస్వభావము ఎట్టిది అని అడు

గంగా ఈమె అతనికి ఆవిధము అంతయు చెప్పెను

పంచజనుఁడు (౧) ది॥ సంహ్లాదుని కొడుకు

(౨) ద॥ సాందీపునిపుత్రుని ప్రభాసతీర్థములోనికి తీసికొనిపోయిన రాక్షసుఁడు వీఁడు తనగురుపుత్రుని కొనిపోయెను అని కృష్ణుఁడు వీనినిచంపి వీని మెడ యెముకను పుచ్చుకొనెను అదియే పాంచజన్యము అనఁబడిన కృష్ణునిశంఖము

పంచద్రావిళ్లు ఆంధ్రము, ద్రవిడము, కర్ణాటకము, మహారాష్ట్రము, ఘూర్జరము, ఈ అయిదు దేశములయందలి బ్రాహ్మణులు

పంచపర్వములు సంక్రమణము, అమావాస్య, పూర్ణమాసి, కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, అనునవి అయిదును

పంచలింగములు పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్మకములు అయిన అయిదులింగములు అందు పృథివీలింగము కంచియందును, అప్లింగము జంబుకేశ్వరమందును, తేజోలింగము అరుణాచలమునందును, వాయులింగము కాళహస్తియందును, ఆకాశలింగము చిదంబరమునందును ఉండును, ఈ అయిదును శివక్షేత్రములలో మిక్కిలి మహిమ కలవి

పంచవటి రాముఁడు వనవాసముచేయునపుడు దండకారణ్యమునందు ఆశ్రమము కావించుకొని ఉన్నచోటు. అయిదుమఱ్ఱిచెట్లు చేరిక అనిశబ్దార్థము ఇది గోదావరిపుట్టు తావునకు సమీపమున ఉండును ఈతావున ఇపుడు నాసికాపురి ఉన్నది

పంచశిఖుఁడు రు॥ ఇతఁడు తత్వజ్ఞానఘనుఁడు అని ప్రసిద్ధి మిథిలాధినాథుఁడు అయిన జనకునికి తత్వోపదేశము చేసిన మహాత్ముఁడు

పంచసాయకుఁడు మన్మథుఁడు అయిదుబాణములు కలవాఁడు అని శబ్దార్థము అవి అరవిందము అశోకము చూతము నవమల్లిక నీలోత్పలము అనునవి

పంచాప్సరసము ఒకానొకకొలను దీనిని మందకర్ణుఁడు నిర్మించెను ఇది దండకారణ్యమునందు ఉండును

పంప ఒకానొకసరస్సు ఇది కిష్కింధాపురమునకు సమీపమున ఉన్నది

పతంజలి సంస్కృత వ్యాకరణమునకు భాష్యము కావించిన విద్వాంసుఁడు ఇతఁడు యోగశాస్త్రప్రవర్తకుఁడు ఈతనిని ఆదిశేషావతారము అని అందురు

పదార్థచింతామణి ఒకానొక వైద్యశాస్త్రము ఇందు సమస్తపదార్థముల గుణాగుణములు చెప్పఁబడి ఉండును

పద్మనాభుఁడు విష్ణువునకు నామము

పద్మావతి వింధ్యపర్వత సమీపదేశమునందలి ఒకపట్టణము

పయోష్ణి ఒకానొకనది ఇది విదర్భదేశము గుండ ప్రవహించి వరదయందు సంగమము అగును

పరమేష్ఠి (౧) బ్రహ్మకు నామాంతరము.

(౨) ఇంద్రద్యుమ్నుని కొడుకు.

పరశురాముఁడు. జమదగ్ని కొడుకు తల్లి రేణుక విష్ణువుయొక్క దశావతారములలో ఆఱవ అవతారము ఇతఁడు తనతండ్రిని కార్తవీర్యార్జునునిపుత్రులు "హోమపశువుకొఱకు" చంపఁగా వారిపై కోపించి భూమిని క్షత్రియశూన్యముగ చేయనిశ్చయించి ముయ్యేడుమాఱ్లు రాజులమీఁద దండెత్తి గర్భములనున్న పిండములతోడ చంపి వారి నెత్తుటిచేత పితరులకు తర్పణము చేసెను మఱియు ఆనెత్తురు శమంతపంచకము ఆ

సు పేర అయిదుమందుగురు అయ్యెను ఇతఁ
డు రుద్రునిగూర్చి ఘోరతపము ఆచరించి
అతనికి శుశ్రూష చేయునట్లు వరము నొంది
ఆవల అతని యనుగ్రహమున దివ్యాస్త్ర
చయములు పడసె అస్త్రవిద్యయందు ఇత
నితో సమానులులేరు ఇతఁడు చిరంజీవి
చూ॥ జమదగ్ని

**పరావసువు** రు॥ రైభ్యునికొడుకు అర్వావ
సుని సోదరుఁడు

**పరాశరస్మృతి** కలియుగమునందు అనుష్ఠింప
వలయు ధర్మములను గూర్చి చెప్పినట్టి ధర్మ
శాస్త్రము విద్యానారాయణుఁడు అనఁ
బరఁగిన మాధవాచార్యులు మిగుల విచారణ
చేసి దీనికి మాధవీయము అను గొప్పవ్యా
ఖ్యాన గ్రంథమునుచేసి ఉన్నాఁడు

**పరాశరుఁడు** వసిష్ఠునిపౌత్రుఁడు శక్తిపు
త్రుఁడు వ్యాసునితండ్రి శుకునిపితామహుఁ
డు ఇతఁడు తనతండ్రి అగుశక్తిని రాక్ష
సుఁడు మ్రింగెను అని (చూ॥ కల్మాషపా
దుఁడు) క్రోధముచే లోకములోని యెల్ల
రాక్షసులు నాశము అగునట్లు సత్రయా
గము ఒకటిచేయఁగా దాని చూచి పుల
స్త్య పులహ క్రతువులు వసిష్ఠనియొద్దకు
వచ్చి నీపౌత్రుని సత్రయాగమును ఉడిగిం
పుము అని వేఁడిరి అంతట వసిష్ఠుని ఉప
దేశమున ఇతఁడు ఆసత్రమును ఉడిపెను
ఒకనాడు పరాశరుఁడు యమునానదిని
దాఁటిపోవలసి పడవరేవునకుపోయి పడవ
ఎక్కిపోవుచు ఆపడవను నడపుచు ఉన్న
దాశరాజుకూఁతురు అగు సత్యవతిని చూ
చి మోహించి ఆమెకు యోజనగంధిత్వమును
అనుగ్రహించి చుట్టుపట్టులవారికి తమపొలఁ
కువ కానరాకుండునటుల ఒక చీఁకటిని
కల్పించి ఆమెను కలసెను అప్పుడు ఆమె
యందు అతనికి సద్యోగర్భమున వ్యాసుఁ
డు పుట్టెను

**పరీక్షిత్తు** (౧) కురునికొడుకు
(౨) అభిమన్యుని కొడుకు తల్లి
ఉత్తర కొడుకు జనమేజయుఁడు ఇతఁడు
ఒకనాఁడు వేఁటాడ పోయి ఒకవనము
నందు తనయేటుతప్పించుకొని పాఱపోయిన
మృగమును వెదకుచు, మౌనవ్రతమును ధరించి
తపస్సుచేయుచు ఉండిన శమీకుఁడు అను
ఋషిని కని, మృగము ఎటుపోయెను
అని అడిగి అతఁడు ఉత్తరము చెప్పక
పోఁగా, తన్ను అతఁడు లక్ష్యముచేసి మాట
లాడకపోయెను అని ఎంచి ఒక మృతసర్ప
కళేబరమును అతనికంఠమునఁదు మాలెగా
వైచి తనపురమునకువచ్చి చేరెను అంతట
అతనికొడుకు అగు శృంగి తనతండ్రిమెడను
రాజు చచ్చినపామును వైచిపోయెను అను
మాట విని అదిమొదలు ఏడు దినములలోపల
ఇతఁడు తక్షక నాగముచే కఱవఁబడి
చచ్చుఁగాక అని శపించెను ఆవృత్తాంతము
ఇతఁడు వినివిరక్తుఁడై శుకమహాముని వలన భాగ
వతమును విని ఆయేడవనాడు తక్షకుఁడు
వచ్చి కఱవఁగా మృతుఁడై ముక్తిని బొందెను
పిదప ఇతని కొడుకు అగు జనమేజయుఁడు
రాజ్యముచేయుకాలమున ఉదంకుఁడు అను
ఋషి (తాను గురుకార్యార్థము పోవునపు
డు తనకు అపరాధము చేసిన తక్షకునియం
దలి విరోధమునచేత) జనమేజయుని పట్టను
పోయి మీతండ్రి అగు పరీక్షిత్తును తక్షకుఁడు
కఱచి చంపెను కనుక అట్టిదుష్టుని సపరి
వారముగ నాశముచేయుట ఉత్తమము అని
చెప్పి అతనికి సర్పయాగముచేయు బుద్ధిని
పుట్టించెను అట్లు ఉదంకునిచే ప్రేరేపింపఁ
బడి జనమేజయునిచే చేయఁబడిన సర్పయా
గము వాసుకి చెలియలు అగు జరత్కా
రు కొడుకు అస్తీకునిచే నివారింపఁబడెను
అనంతరము జనమేజయుఁడు వ్యాసుని

అనుమతిని భారతకథను వైశంపాయనునిచే వినెను

(3) సూర్యవంశమున పుట్టిన రాజులలో ఒకఁడు ఇతఁడు అయోధ్యను ఏలుచు ఉండెను అని భారతమున చెప్పఁబడి ఉన్నది ఇతఁడు ఒకప్పుడు వేఁటాడపోయి మార్గమున సుశోభ అను పేరుగల మండూకరాజు కూఁతురు అగు ఒకకన్యకను వివాహమై ఆమెయందు ముగ్గురు పుత్రులను పడసెను ఆమె మిక్కిలి దుష్టప్రవర్తనము కలది అయి అనకులను ప్రసిద్ధులగు రాజులను చిక్కుల పెట్టినందున తనపుత్రులు కపటులు అగునట్లు తనతండ్రిచే శపింపఁబడెను

పర్జన్యుఁడు మేఘములకు అధిదేవత ఇది సూర్యవరుణ ఇంద్రులకు నామాంతరము అయి ఉండును

పర్వతుఁడు నారదునిచెల్లెలి కొడుకు ఇతఁడును నారదుఁడును మహీమండలమున సంచరించు కుతూహలముతో వెడలి తమనిజచిత్తవృత్తులను ఒండొరులకు దాఁపక ఉండునట్లు సమయముచేసికొని పోవునపుడు ఒకకాలమున సృంజయుఁడు అనురాజు పాలికిపోయి అతనిప్రార్థనచే అతనికొమార్తె అగు సుకుమారి అనుకన్యకవలన పరిచర్యలను కైకొనుచు కొన్నిదినములు ఉండిరి అప్పుడు నారదుఁడు ఆచిన్నదానియందు మోహము కలవాఁడు అయి నానాటకృశించుటను చూచి తత్కారణమును తనకు తెలియ చేయమికి అచిన్నదానిపాణిగ్రహణానంతరము నారదుని వానరముఖుఁడు అగునట్లు పర్వతుఁడు శపియించెను అందుకు నారదుఁడు పర్వతునికి నాకలోకమునకు పోక ఉండునట్లు ప్రతిశాపము ఇచ్చెను అవల కొంతకాలమునకు వెనుక వీరు ఇరువురును అన్యోన్య శాపవిమోచనము చేసికొనిరి

పర్యంతభూములు ఆర్యావర్తమునకు వెలుపల ఉండుమ్లేచ్ఛము తురుష్కము మొదలగు ధర్మాధర్మవివేక శూన్యులు అయిన సంకీర్ణవరజాతులు అగు కిరాతుల దేశములు

పలాశిని ఒకానొకనది ఇది శుక్తిమంతము నందు ఉత్పత్తి అయి మహానదితో సంగమము అగును

పల్వలుఁడు ర॥ ఇల్వలుని కొడుకు బలరామునిచే చంపఁబడెను

పశుపతి (౧) రుద్రునకు నామము
(౨) అష్టమూర్తులలో ఒకఁడు

## పా

పాంచజన్యము విష్ణుశంఖము చూ॥ పంచజనుఁడు

పాంచాలము ఒకానొకదేశము ఇది హస్తినాపురమునకు వాయవ్యమున హిమవంతమునకును చర్మణ్వతికిని నడుమ ఉండును దీనికి ఈనామము పూర్వము ప్రసిద్ధము అయి ఉండెను అజమీఢుని రెండవ కొడుకు అగు నీలునివంశస్థుఁడు అయిన భర్మ్యాశ్వుఁడు తనయేవురు పుత్రులనుచూచి వీరేవురు తనవిషయములకు (అనఁగా దేశములకును శబ్దాదివిషయములకును నర్థము) చాలుదురు అని పలికెను కనుక పంచ అలం అనురెండు శబ్దములనుండి పాంచాలము అను నామము కలిగెను ఈదేశము ఉత్తరపాంచాలము దక్షిణపాంచాలము అని రెండుభాగములు అయి ఉండును అందు ఉత్తరపాంచాలమునకు అహిచ్ఛత్రము ముఖ్యపట్టణము దక్షిణపాంచాలమునకు మాకందియు కాంపిల్యమును ముఖ్యపట్టణములు పాంచాలరాజులు సంవరణుని హస్తినాపు

రమునుండి వెడలగొట్టినట్లును, కురురాజు మరల ఆపట్టణమును జయించి వశపఱుచుకొనినట్లును తెలియవచ్చుచు ఉన్నది.

**పాండవులు** పాండురాజు కొమారులు వీరు అయిదుగురు ౧ ధర్మరాజు ౨ భీమసేనుఁడు ౩ అర్జునుఁడు ౪ నకులుఁడు ౫ సహదేవుఁడు ఇందు మొదటి ముగ్గురును కుంతికొడుకులు కావున కౌంతేయులు అనియు కడపటి ఇరువురును మాద్రి కొడుకులు కనుక మాద్రేయులు అనియు చెప్పఁబడుదురు వీరు పాండురాజు మృతి చెందిన పిదప హస్తినాపురియందు ధృతరాష్ట్రుని ఒద్ద పెరుగుచు ధనుర్వేదాది విద్యలయందు మహానిపుణులు అయి ఉండఁగా వీరిమేలిమిచూచి ధృతరాష్ట్రుని పెద్దకొడుకు అయిన దుర్యోధనుఁడు ఓర్వచాలక, శకుని కర్ణదుశ్శాసనులతో కూడుకొని అనవరతము వీరలకు హింసకావించుచు ఉండెను అది ఎట్లనిన ఒకనాడు దుర్యోధనుఁడు భీముఁడు నిద్రపోవుచు ఉండుతఱిని అతనిని లావుత్రాళ్లతో కట్టి గంగమడుగునందు త్రోయించెను మఱియొకనాడు అతని సర్వాంగములందును కృష్ణసర్పములను పట్టి కఱపించెను ఇంకొకనాడు భోజనసమయమునందు వానికి విషము పెట్టించెను అతఁడు అనంతసత్త్వుఁడును దివ్యపురుషుఁడును కాన అవియెల్ల అతనిని చంపనేరవయ్యెను మఱియు దుర్యోధనుఁడు పాండవులకు అందఱకును అపాయముచేయ సమకట్టి వారణావతమునందు ఒక్కయిల్లు ఒకటి కట్టించి అందు పాండవులను చేర్చి అనలము దరికొల్పయత్నించఁగా వారు ఈవృత్తాంతమును విదురుని మూలముగ ఎఱిఁగి అచటినుండి తప్పించుకొనిపోయి జననీసహితముగ విప్రవేషధారులు అయి ఏకచక్రాపురమందు కొంతకాలము ఉండి అనంతరము ద్రుపదరాజుపట్టణమునకు పోయి అచట అర్జునుఁడు ద్రౌపదీస్వయంవరమున మత్స్యయంత్రమును అశ్రమమున ఉరలనేసి సకలరాజలోకంబును ఓడించి ద్రౌపదిని చేకొని గురువచనమున ఆమెను ఏవురును వివాహము అయిరి అంత ఆవృత్తాంతము అంతయు ధృతరాష్ట్రుఁడు ఎఱిఁగి పాండవులను రావించి వారికి అర్ధరాజ్యము ఇచ్చి ఇంద్రప్రస్థపురమున ఉండ పంచిన, వారి రాజ్యవిభూతియు గుణసంపదయు చూచి దుర్యోధనుఁడు ఓర్వ చాలక శకునికైతవమున మాయజూదము ఆడి ధర్మరాజును పరాజితుని చేసి పండ్రెండు ఏండ్లు వనవాసమును ఒకయేడు జనపదమున అజ్ఞాతవాసమును చేయునట్లుగా సమయముచేసి భూమి వెలువరించెను అట్లు పాండవులు వనవాసముచేసి సమయము తప్పక అజ్ఞాతవాసమును జరపి మరలివచ్చి తమపాలు అడిగిన ఈయక దుర్యోధనుఁడు వారలతో విరోధించి ఎదిరించి యుద్ధముచేసి మడిసెను పాండవులును శత్రువులనుచంపి రాజ్యమును మరలకైకొని అశ్వమేధాదియాగములచే జనులకు హర్షము కావించుచు ఉండి కృష్ణనిర్యాణానంతరము పరీక్షిత్తునకు రాజ్యాభిషేకముచేసి స్వర్గారోహణము కావించిరి.

**పాండురాజు** విచిత్రవీర్యుని కొడుకు తల్లి అంబాలిక అన్న ధృతరాష్ట్రుఁడు ఇతనికి కుంతి మాద్రి అను ఇరువురు భార్యలు కలరు ఒకనాడు ఇతఁడు వనమునందు వేటాడుచు ఉండి మృగరూపధారుఁడై క్రీడించుచు ఉండిన ఒకమునీశ్వరుని అతనిపత్నిని పొడగని మృగదంపతులని ఎంచి ఏసెను. అప్పుడు ఆమునిదంప

ఖులు ఆయమెుప నుచ్చి తమ నిజరూపములతో కనఁబడి ఆవేదన సహింప చాలక మా అసువులను ఇపుడు ఎడఁబాయచేసితివి కావున నీవు నీభార్యలతో సంభోగించినయెడ మరణము ఒందుదువు కాక అనిశపించి తమ ప్రాణములను విడిచిరి కనుకనే ఈపాండురాజునకు సంతానము పొందు యోగ్యతలేక పోయెను చూ॥ కుంతి ఇతఁడు మరుద్గణాంశమున జనియించెను

పాండ్యము చోలరాజ్యమునకు దక్షిణమున కన్యాకుమారివఱకు కలదేశము దీనిని పాండ్యుఁడు కావించెను దీనికి రాజధాని మధుర

పాండ్యుఁడు దుష్యంతుని తమ్ముఁడు అగు దిష్యంతుని పౌత్రుఁడు అయిన ఆక్రీతుని కొడుకు ఇతఁడు పాండ్యదేశమును కావించెను

పాకయజ్ఞము అష్టక పార్వణ (స్థాలీపాక) శ్రాద్ధ (మాసి) సర్వబలి ఈశానబలి ఆగ్రహాయణి మొదలుగా కల యజ్ఞము చూ॥ యజ్ఞములు

పాకశాసనుఁడు ఇంద్రుఁడు పాకుని శిక్షించినవాఁడు అని శబ్దార్థము

పాకుఁడు వృత్రాసురుని తమ్ముఁడు వీని చంపినందున ఇంద్రునకు పాకశాసనుఁడు అను నామముకలిగెను

పాటలావతి ఒకానొకనది ఇది ఋక్షపర్వతమున ఉత్పత్తి అగును

పాటలీపుత్రము నా। ప్రతిష్ఠానపురము మగధదేశపురాజు అగు ఉదయాశ్వుఁడు నిర్మించిన పట్టణము దీనికి కుసుమపురి అనియు నామముకలదు

పాణిని సంస్కృతవ్యాకరణకర్త సరస్వతీదేశమున జన్మించినట్లు తెలియును ఇతఁడు చేసిన వ్యాకరణము సంస్కృతభాషకు ఆధారము

పాతాళకేతుఁడు మదాలసను ఎత్తుకొనిపోయి గాలవునికి తపోభంగము కావించిన ఒక రక్కసుఁడు

పాద్మకల్పము చతుర్ముఖబ్రహ్మయొక్క ఆయుఃపరిమాణములో పూర్వార్ధము చూ॥ వారాహకల్పము

పాద్మము ఒకపురాణము ఇది పద్మగర్భప్రోక్తము అగు పాద్మకల్ప వివరణాదులను కలది దీనిగ్రంథసంఖ్య ౫౫౦౦౦

పాపరాజు (కంకంటి) ఒక ఆంధ్రకవి ఇతఁడు శ్రీమద్రామాయణమునందు ఉత్తరకాండమును తెనిఁగించెను దానికి ఉత్తరరామాయణము అనిపేరు మఱియు ఇతఁడు విష్ణుమాయావిలాసమును యక్షగానముగా రచియించినట్లు చెప్పుచు ఉన్నారు ఈయనకు ఉత్తరరామాయణ రచనయందు సహాయుఁడు నందిలిమ్మన్న

పారాశరము ఒక ఉపపురాణము

పారిజాతము ఒకకల్పవృక్షము సత్యభామ ప్రేరేఁపణచే కృష్ణుఁడు ఈవృక్షమును స్వర్గలోకమునుండి భూమికి తెచ్చినట్లుచెప్పి ఉన్నది చూ॥ నరకుఁడు

పారిపత్రము కరూశదేశములకు ముఖ్యపట్టణము ఇది వింధ్యపర్వతమునకు కొంత ఉత్తరమున ఉండునటుల తెలియఁబడును

పారుఁడు. (౧) బా॥ పృథుసేనుని కొడుకు ఇతనికొడుకు నీపుఁడు

(౨) బా॥ సమరుని కొడుకు

(౩) రు॥ ఇతఁడు తనకూఁతురు అగు కలావతిని ఒక గంధర్వుఁడు వివాహార్థము వేఁడఁగా అతనికి ఇయ్య సమ్మతింపనందున ఆగంధర్వుఁడు రాత్రిపూఁటవచ్చి ఇతనిని చంపెను

**పార్వతి** (౧) హిమవంతునికి మేరువుకూఁతురైన మనోరమయందు పుట్టిన రెండవ కొమార్తె ఈమెయొక్క అక్క గంగాదేవి తొలిజన్మమున ఈమె దక్షునికూఁతురు అయినట్టి ఉమాదేవి అపుడు తనతండ్రి అయిన దక్షప్రజాపతి చేసిన యజ్ఞమునకు తనభర్త అగు రుద్రుని పిలువక అవమానించెను అని అలిగి మహాకాళీ స్వరూపమును వహించి అత్యాగ్రహమున దేహత్యాగముచేసి ఆవల పార్వతిగ పుట్టి రుద్రునికి భార్య అయ్యెను ఈమె ఒకకాలమున రుద్రునితో కూడి ఉండఁగా దేవతలు ఆకూటమికి విఘ్నముచేసిరి అందువలన వారికి స్వభార్యల యందు పుత్రసంతానము లేకుండునటుల ఈమె శపియించెను మఱియు ఆకాలమునందు రుద్రునికి రేతస్సుజాఱి భూమి యందు పడెను భూమి దానిని ధరింపను ఓపక దేవతలసహాయమున అగ్నిని వాయువును వహించునట్లు చేయఁగా వారు ఆరేతస్సును హిమవత్పర్వత సమీపమున గంగ యందు చేర్చిరి అది కారణముగా గంగ గర్భము తాల్చి ఆగర్భమును ధరింపలేక శరవణమునందు విడిచిపుచ్చెను అందు కుమారస్వామిపుట్టెను అతనికి షట్కృత్తికలు పాలిచ్చిరి కనుక కార్తికేయుఁడు అను పేరును, ఆపాలు ఆఱుముఖములతో ఒక్కతేపనె అతఁడు పానముచేసెను కనుక షణ్ముఖుఁడు అనుపేరును, అతనికి కలిగెను స్ఖలితము అయిన రేతస్సువలన పుట్టినందున స్కందుఁడు అనియు అందురు ఇది కాక పార్వతి తనదేహమున కూడవలసిన తనభర్తయొక్క రేతస్సును భూమిధరించినందున భూమికి బహు భోగలు కలుగునట్లు శాపము ఇచ్చెను. మఱియు గంగా నిర్గతమైన ఈసౌమ్యతేజము వలన సువర్ణము మొదలగు లోహములు కలిగినట్లును, ఆగంగానిక్షేపమువలన పొదలునట్టి సువర్ణ ప్రభల చేత తృణవృక్షలతాగుల్మ ప్రభృతి ఉద్భిజ్జములు సువర్ణంబులు అయ్యెను అనియు పురాణములు చెప్పుచు ఉన్నవి

(౨) ఒకనది ఇది మాళవమున ప్రవహించును దీనికి సర అనియు నామాంతరము

**పార్ష్ణిసేనుఁడు** ఋ॥ ఇతని యాశ్రమమునందు పాండవులు ఉండునపుడు అర్జునుఁడు దివ్యాస్త్రములు పడసి దేవలోకమున ఉండి వచ్చి అన్నదమ్ములతో చేరుకొనెను ఈ ఆశ్రమము, కుబేరుని ఉపవనమునకు సమీపమున ఉండును

## పి

**పింగళ** దక్షిణ దిశయందు ఉండు ఆఁడు ఏనుఁగు దీనిభర్త వామనము

**పిండము** భక్ష్యరూపముగ పితృదేవతలకు ఇయ్యఁబడునది ఇది వర్తులాకారమై కపిత్థప్రమాణము అయి ఉండును.

**పిండారకము** ఒకానొక పుణ్యక్షేత్రము ఇది ద్వారకాపుర సమీపమున ఉండును ఇందు కొందఱు మహర్షులు తపము ఆచరించుచు ఉండఁగా యాదవులు దర్పించి కృష్ణుని పుత్రుఁడు అగు సాంబుని, గర్భిణీ స్త్రీరూపముగ అలంకరించి, ఈచూలాలికి ఏశిశువు కలుగును చెప్పుఁడు అని పరిహాసముగ అడుగ, వారు అది ఎఱిఁగి మిగుల కినుకతో యదుకులమును నిర్మూలము చేసెడు ఒకముసలము ఉదయించును అనిరి అనంతరము సాంబుని గర్భమునందు ఒక ముసలము పుట్టెను అదిచూచి వారు మిగుల జడిసి ఆముసలమును చూర్ణము కావించి సాగరమున కలిపిరి అంత ఆచూ

ష్టము ముయ్యంచు తుంగగా మొలిచెను పిదప కొంతకాలమునకు యాదవులు అందఱు సముద్రస్నానముచేయ పోయి మదిరాపానమత్తులు అయి ఒకరితో ఒకరు కలహించి ఆముయ్యంచు తుంగపెఱికికొని ఒకరిని ఒకరు కొట్టుకొని చచ్చిరి

పితరులు పితృదేవతలు వసురుద్రాదిత్య రూపులు అయి చంద్రలోకమున ఉండువారు వీరు అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, అని రెండువిధములు, అందు అగ్నిష్వాత్తులు యజము చేయనివారు, బర్హిషదులు యజ్ఞముచేసినవారు చూ॥ అగ్నిష్వాత్తులు

పితృగణము అంగిరస్సునకు స్వధయందు పుట్టినవారు

పిప్పలుఁడు (౧) ర॥ ఇల్వలుని పుత్రుఁడు

(౨) అరిష్టుని తమ్ముఁడు మిత్రునికి రేవతియందు పుట్టిన రెండవకొడుకు

పిశాచక ఋక్షపర్వతమునందు పుట్టిన ఒకనది

పిశాచదేశములు పాండ్యము కేకయము నేపాళము బాహ్లికము కుంతలము చోళము మొదలగునవి కొన్ని

పిశాచులు (౧) దేవయోనులలో ఒకతెగవారు

(౨) పాపకృత్యములవలన పార్థివదేహమ్మును పొందక వాయుదేహముతో సంచరించు జీవులు ఆజీవులు తమతమ పాపకర్మములు విమోచనము కాఁగానే ఆ వాయు దేహములను వదలుదురు

## పు

పుంజికస్థల ఒక అప్సరస. వరుణునికూఁతురు

పుండరీకము (౧) ఆగ్నేయ దిక్కునందలి దిగ్గజము ... మగయేనుఁగు

(౨) ఒకానొక తీర్థము.

పుండరీకాక్షుఁడు విష్ణువునకు నామము (తామరలవంటి కన్నులు కలవాఁడు అని శబ్దార్థము)

పుండ్రము బంగాళదేశపు పశ్చిమభాగమునకు ప్రాచీన నామము

పుండ్రుఁడు అ॥ బలియొక్క నాలవ కొమరుఁడు పౌండ్రదేశము ఇతనినామముచే పరఁగును

పుత్తు ఒకనరకము ఈనరకమునందు పడనీయక తండ్రిని కాపాడువాఁడు అగుటచేత సుతునకు పుత్రుఁడు అను పేరు కలిగెను

"పున్నామ్నోనరకాద్యస్మా
త్పితరంత్రాయతేసుతః।
తస్మాత్పుత్త్ర ఇతిప్రోక్తః॥"
అని ప్రమాణవచనము

పునర్వసువు (౧)య॥దవిద్యోతుని తమ్ముఁడు తండ్రి దుందుభి

(౨) ఒకానొక నక్షత్రము

పురంజయుఁడు (౧) ఇ॥ వికుక్షి కొడుకు కకుత్స్థునికి పూర్వనామము ఇతనికి ఇంద్రవాహనుఁడు అనియు పేరు కలదు

(౨) పు॥ సువీరునికొడుకు నా॥ సృపంజయుఁడు

(౩) అ॥ సృంజయుని కొడుకు

పురందరుఁడు. (౧) వైవస్వత మన్వంతరమునందలి దేవేంద్రుని పేరు ఇది ఇంద్రునికి సామాన్య నామముగాను వాడఁబడును

(౨) అంగిరసుని వంశస్థుఁడు అగు ఒక అగ్ని.

పురాణములు జగత్సృష్టి మన్వంతరక్రమము లోనుగా కల కథలను తెలిపెడు గ్రంథములు ఇవి వేదములకు వ్యాఖ్యానముల వంటివి. ఇవి, బ్రాహ్మము, పాద్మము, శైవ

వము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము, అని పదునెనిమిది

పురుకుత్సుఁడు ఇ॥ మాంధాత జ్యేష్ఠపుత్రుఁడు ఇతని భార్య నాగుల సహోదరి అయిన నర్మద ఇతఁడు కశ్యపపుత్రులు అయిన మౌనేయులవలని భయమును నాగులకుమాన్పినందున వారు తమసహోదరి అయిన నర్మదను ఇతనికి ఇచ్చి వివాహముచేయించిరి ఇతని కొడుకు త్రసదస్యుఁడు లేక వసుదుఁడు

పురుజిత్తు (౧) య॥ రుచికుని కొడుకు
(౨) య॥ వసుదేవుని తమ్ముఁడు అయిన కంకుని మూఁడవ కొడుకు

పురుజుఁడు పు॥ సుశాంతి కొడుకు

పురుమీఢుఁడు. పు॥ హస్తికుని మూఁడవకొడుకు-అజమీఢుని తమ్ముఁడు

పురుహోత్రుఁడు య॥ అనువు కొడుకు

పురూథుఁడు య॥ వసుదేవునకు సహదేవియందు పుట్టిన కొడుకు

పురూరవుఁడు వైవస్వతమనువు కొమార్తె అగు ఇలకును చంద్రుని కొడుకు అగు బుధునికిని పుట్టినరాజు ఇతఁడు రాజ్యమదముచేత విప్రులకు అవమానముచేసి వారిచే ఉన్మత్తుఁడు అగునట్లు శపియింపఁబడెను ఈ పురూరవునకు ఊర్వశివలన ఆయువు, ధీమంతుఁడు, అమవసువు లేక విజయుఁడు, చిరాయువు లేక శతాయువు, శ్రుతాయువు లేక వసుమంతుఁడు, అను పుత్రులు ఉదయించిరి ఈతనిరాజధాని ప్రతిష్ఠానపురము ఊర్వశి స్వర్గలోకమును వదలి పురూరవునితో భూలోకమున బహుకాలము ఉండినందున స్వర్గలోకము మిక్కిలి చిన్నఁబోయెను అని దేవేంద్రుఁడు ఆమెను పిలువఁబంచెను ఆమె అట్లుతన్నువదలిపోఁగా పురూరవుఁడు విరహవేదనను సహింపను ఓపక గంధర్వులను ప్రార్థనచేసెను అప్పుడు వారు అతనికి ఒకస్థాలి ఇచ్చిరి దానిని అతఁడు కొంతకాలము ఊర్వశిగా భావించి ఉండి ఆవలదానిని వనమునందు విడిచిపెట్టెను దానివలన అశ్వత్థవృక్షము పుట్టెను ఆ అశ్వత్థముచేత అరణులు రెండుకావించి ఒక అరణి తాను అనియు ఒక అరణి ఊర్వశి అనియు ఆరెంటినడుమను ఉన్న కాష్ఠము పుత్రుఁడు అనియు మంత్రము చెప్పుచు తరువఁగా జాతవేదుఁడు అను అగ్ని సంభవించెను ఆ అగ్ని ఆహవనీయాదిరూపమున నెగడి పురూరవుని పుణ్యలోకమునకు పంపెను

పురోచనుఁడు దుర్యోధనుని చెలికాఁడు అగు ఒక శిల్పి వీఁడు లక్కయింట పాండవులను కాల్చుటకు దుర్యోధనునిచే పంపఁబడెను పాండవులు దుర్యోధనుని ఉద్దేశ్యమును ఎఱిఁగి వీనికంటె ముందే హెచ్చరిక పడి వీఁడు నిద్రించు అవసరమున లక్కయింటికి నిప్పుపెట్టి విదురుని సహాయముచే కావింపఁబడి ఉండిన బిలముగుండ తప్పించుకొని వెళ్లిరి

పులస్త్యుఁడు బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు ఇతనికి హవిర్భుక్కునందు అగస్త్యుఁడును విశ్రవస్సును పుట్టిరి

పులహుఁడు బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు ఇతనికి కిన్నరుఁడు, కింపురుషుఁడు మొదలయిన కొడుకులు పుట్టిరి.

పులోముఁడు. (౧) ద॥ విప్రచిత్తికొడుకు.

(౨) దనుపుత్రులలో ఒకఁడు ఈతనిని చంపుటచే దేవేంద్రునకు పులోమజిత్తు అను నామము కలిగెను ఇతని కూఁతురు కనుక దేవేంద్రుని భార్య అగు శచి పౌలోమి అను పేరు పడసెను

పుల్లయ ఒకానొక ఆంధ్రకవి ఇతఁడు బ్రహ్మోత్తరఖండమును తెనిఁగించెను ఇందు తెనుఁగు మఱుఁగు పదములు కొన్ని ఉన్నవి కాని లక్షణవిరుద్ధములు అగు ప్రయోగములు అనేకములు కానఁబడుచు ఉన్నవి

పుష్కరము ఒకానొక పుణ్యతీర్థము మాళవదేశ ప్రాంతముఁయందు ఉండును

పుష్కరవతి ఒకానొక పట్టణము ఇది శ్రీరాముని తమ్ముఁడు అయిన భరతుని రెండవకొడుకు అగు పుష్కరునిచే నిర్మింపఁబడినది

పుష్కరారణ్యము పుష్కరతీర్థముచెంత ఉండెడి అరణ్యము

పుష్కరారుణి పు॥ రుక్షయని కొడుకు ఇతనివంశస్థులు బ్రాహ్మణులు అయిరి

పుష్కరిణి (౧) ఉల్ముకుని భార్య అంగుని తల్లి

(౨) వ్యుష్టి భార్య సర్వతేజస్సు తల్లి

పుష్కరుఁడు (౧) య॥ వసుదేవుని తమ్ముఁడు అగు వృకుని రెండవకొడుకు

(౨) నలుని పినతండ్రికొడుకు ఇతఁడు కలిచే ప్రేరేపింపఁబడి నలునితో జూదము ఆడి సర్వస్వమును గెలుచుకొని అతనిని వనమునకు తఱిమెను చూ॥ నలుఁడు

(౩) శ్రీరాముని తమ్ముఁడు అయిన భరతుని రెండవకొడుకు

పుష్పకము కుబేరుని విమానము మణిమయము అయిన ఈవిమానమును కుబేరుఁడు బ్రహ్మవలన పడసి దీనిపైని ఎక్కి యథేచ్ఛముగా సంచరించుచు ఉండెను అనంతరము కుబేరుని జయించి దీనిని రావణుఁడు కైకొనియెను రావణుని చంపినపిమ్మట ఇది శ్రీరాముని చేరెను ఈవిమానమునందు ఎందరు కూర్చుండినను ఒకమనుష్యుఁడు కూర్చుండ తగినంత చోటుమాత్రము విడుదలగా ఉండును

పుష్పదంతము వాయవ్యదిక్కునందలి మగయేనుఁగు

పుష్పదంతుఁడు విష్ణుపరిచరులలో ఒక్కఁడు

పుష్పవంతుఁడు ఉపరిచరవసువు వంశస్థుఁడు అగు ఒకరాజు

పుష్పార్ణుఁడు ధ్రువునికొడుకు అగు వత్సరునికి సర్వర్థియందు పుట్టినకొడుకులలో పెద్దవాఁడు ఇతనికి ప్రభ, దోష, అని ఇరువురు భార్యలు కలరు అందు ప్రభకు ప్రాతర్మధ్యందిన సాయములును దోషకు ప్రదోష నిశీథ వ్యుష్టులును కలిగెను

పుష్పోత్కట సుమాలి కూఁతురు విశ్రవస్సుని భార్యలలో ఒకతె ఈమెకు మహోదర మహాపార్శ్వాదులు అగు రాక్షసులు పుట్టిరి

పుష్యమిత్రుఁడు మగధదేశపు రాజులు అయిన మౌర్వ్యులలో కడపటి రాజు అగు బృహద్రథుని సేనాపతి ఇతఁడు తనయేలినవానిని చంపి తాను రాజు ఆయెను ఇతని కొడుకు అగ్నిమిత్రుఁడు ఈతని వంశజులు శృంగులు అనఁబడుదురు

పుళిందులు ఆనర్తదేశమునందును విదర్భదేశమునందును ఒకభాగమున ఉండు జనులు

## పూ

పూతన ఒకరాక్షసి ఇది కృష్ణుఁడు బిడ్డగా ఉండునపుడు వ్రేపల్లెకు పోయి చనుమొన

లయందు విషము ఉంచికొని బాలింత వేషమున కృష్ణునికి పాలిచ్చు విధమున అభినయించి అతనిని చంప యత్నించెను అప్పుడు కృష్ణుఁడు దీని చనుఁబాలు త్రాగువానివలె పాలతోకూడ ప్రాణములను సయితము పీల్చినందున ఇది చచ్చెను

పూరువు యయాతికి శర్మిష్ఠయందు పుట్టిన కొడుకు తనతండ్రి అభీష్టమును నెఱవేర్చినందున తనకంటె పెద్దవారు అగు సోదరులు ఉండియు ఇతఁడే రాజ్యార్హుఁడు ఆయెను కొడుకు జనమేజయుఁడు

పూర్ణిమ. ధాతకు అనుమతియందు పుట్టిన కూఁతురు

పూర్వచిత్తి ఒక అప్సరస ఆగ్నీధ్రునిభార్య

పూషుఁడు ద్వాదశాదిత్యులలో ఒక్కఁడు దక్షయాగమునందు వీరభద్రుఁడు ఇతని పండ్లు పెకలించెను

## పృ

పృథ కుంతీదేవి

పృథివి లేక పృథ్వి భూదేవి విష్ణుభార్య ఈమెకు బహుభర్తలు కలుగునటుల పార్వతీదేవిచే శాపము కలిగెను చూ॥ పార్వతి

పృథుకర్ముఁడు
పృథుకీర్తి
పృథుజయుఁడు
పృథుదానుఁడు
పృథుయశుఁడు.
} య॥శశిబిందువు కొడుకులు

పృథులాక్షుఁడు చతురంగుని కొడుకు

పృథువు (౧) ఇ॥ అనేనస్సు కొడుకు విశ్వగంధునితండ్రి ఇతనికి శాశ్వతుఁడు విశ్వకుఁడు అను నామములును కలవు

(౨) ప్రసాదుని కొడుకు

(3) బా॥ పారుని కొడుకు

(౪) ఒకచక్రవర్తి స్వాయంభువుని వంశస్థుఁడు వేనుని కొడుకు భార్య అర్చి కొడుకులు విజయాశ్వుఁడు లేక అంతర్ధానుఁడు, ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు ఇతనికి సనత్కుమారుఁడు బ్రహ్మజ్ఞానము ఉపదేశించెను మఱియు ఇతఁడు భూమిని గోవుగాను మనువును దూడగాను చేసి ఓషధులు పిదికెను

(౫) య॥ రుచికుని కొడుకు జ్యామఘుని సోదరుఁడు

పృథుశ్రవుఁడు య॥ శశిబిందువు కొడుకు ధర్ముని తండ్రి

పృథుసేనుఁడు బా॥ ప్రాజ్ఞుని కొడుకు పారుని తండ్రి

పృశ్ని య॥ అనమిత్రుని కొడుకు శ్వఫల్కుని తండ్రి సత్యకునిపినతండ్రి

పృషదుఁడు పా॥ సుజన్మకృత్తు కొడుకు ద్రుపదుని తండ్రి

## పె

పెద్దనార్యుఁడు ఒకతెనుఁగుకవి ఇతఁడు భద్రాపరిణయమును రచియించెను

## పై

పైలుఁడు (౧) రు॥ వ్యాసశిష్యులలో ఒకఁడు ఋగ్వేదాధ్యాపకుఁడు

(౨) రు॥ జాతకర్ణిశిష్యుఁడు

పైశాచి ప్రాకృతభాషాభేదము ఇది పైశాచి చూళికా పైశాచి అని రెండువిధములు కలది ఇది పిశాచదేశములయందు వాడఁబడునది కనుక దీనికి ఈపేరుకలిగెను

## పొ

పొట్నూరు ఆంధ్రదేశమునందలి ఒక సామంతరాజుయొక్క పట్టణము.

## పో

పోతన (బమ్మెర) ఆంధ్రభాగవతమును రచియించిన మహాకవి ఈయన ఆఱువేలనియోగి తండ్రి కేసన కుమారుఁడు మల్లన నివాసగ్రామము కడపకు సమీపమున ఉండెడు ఒంటిమిట్ట అనఁబరఁగిన ఏకశిలానగరము ఇతఁడు కడుపేదవాఁడు కృషివలన జీవించువాఁడు ఇతఁడు బాల్యమున పశువులను మేపుచు తమ ఊరిచేరువను కల కొండమీఁద సంచరించుచు ఉండి తనపురాకృత సుకృతవిశేషము వలన చిదానందుఁడు అను ఒక యోగీశ్వరుని కనుఁగొని ఆమహాత్మునికి నమస్కరించి స్వామీ మిరెవరో మహాత్ములు అని నాకు తోఁచుచు ఉన్నది ఇట్టిమహిమ పడయుటకు తగిన ఉపాయమును నాకు ఉపదేశించి నన్ను కడతేర్పుఁడు అని ప్రార్థించెను అదివిని ఆయన ఇతఁడు మిక్కిలి బుద్ధిశాలి అని మెచ్చుకొని తారకమంత్రమును ఉపదేశించి పోయెను అంతట పోతన గురువు ఉపదేశించిన చొప్పున నియమముతో తారక మంత్రజపము చేసి ఆజప మహిమవలన పరమజ్ఞానసంపన్నుఁడును మహాకవియును అయి ఆశ్రమములయందెల్ల గృహస్థాశ్రమము మేలు అయినది అని తెలిసి కులశీలవయోరూపముల తనకు తగిన ఒక కన్యకను పరిగ్రహించి సంతానమును పడసి లోకోపకారముగా ఒకపురాణమును తెనిఁగింపఁగోరి ఎల్లపురాణములయందును భాగవతము ఉత్తమము అని విచారించి దానిని తెనిఁగించుచు ఉండఁగా వేమభూపాలుని ఒద్ద ఆస్థానపండితుఁడును ఇతనికి అను బంధుఁడును అయిన శ్రీనాథుఁడు ఇతఁడు భాగవతమును తనయేలిన వానికి అంకితముగా చేయింపవలెను అని పల్లకిమీఁద ఎక్కి ఒంటిమిట్ట పొలిమేర చేరరాఁగా అచ్చట దున్నపోతులను కట్టిన అరకను పూని చేను దున్నుచు ఉన్న పోతరాజుకొడుకును ఆచేనిగనిమిమీద కూర్చుండి భాగవతము వ్రాయుచు ఉన్న పోతరాజును అతనికి కనఁబడిరి వారని చూచి తాను సరస్వతీ ఉపాసకుఁడు కనుక తన మహిమ పోతనకు తెలుపవలెను అని ఎంచి పల్లకి మోయుచు ఉన్న బోయీలను పిలిచి మిరు ఒక ప్రక్క పల్లకి కొమ్మను వదలి రండి అని చెప్పెను వారు అట్లే చేయఁగా దున్నుచు ఉన్న మల్లన ఒకతట్టుమాత్రము బోయీలు మోయఁగా వచ్చుచు ఉన్న పల్లకిని చూచి నాయనా ఇదియేమి వింతగా ఉన్నది అని తండ్రిని అడిగెను అప్పుడు పోతన అబ్బీ నీవును ఒకతట్టు కట్టిన దున్నపోతును విడిచి దున్నుము అని చెప్ప అతఁడు అట్లుచేసెను అది చూచి శ్రీనాథుఁడు రెండవ కొమ్మను గూడవదలి పల్లకీని అంతరమున విడుపుఁడు అని బోయీలకు ఉత్తరవు చేసెను అది మల్లన చూచి నాయనా రెండవతట్టును బోయీలులేక ఈపల్లకి ఉత్తబయల నడిచి వచ్చుచు ఉన్నది చూచితివా అనెను అట్లు అయిన నీవును రెండవదున్నను వదలి దున్నుము అని చెప్పెను అతఁడు ఆప్రకారము చేసెను అంతట శ్రీనాథుఁడు పోతన ఉన్నచోటికి దాపుగా వచ్చి హాలికులో అని పరిహాసించెను అదివిని పోతన "ఉ బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్, గూళల కిచ్చియప్పడుపు కూడుభుజించుటకన్న మేలుగా, హాలికులైన నేమి మఱియంతకునుఁ గావగ లేకయున్నకొ, హాలికులైననేమి నిజదారసుతాదిక పోషణార్థమై" అని ప్రత్యుత్తరము చెప్పెను అంతట శ్రీనాథుఁడు పల్లకి దిగివచ్చి పోతనకు నమస్క-

రించి బావా నీమహిమ నేనెఱుఁగనా బావమఱఁదులము కనుక కొంచెము మేలము చూపితిని అనెను అందులకు పోతనయు సరే అట్లు కాక ఇప్పుడు ఏమివిరుద్ధ ధర్మములు నడచెను అనుచు కొడుకును దుక్కి నిలిపి ఇంటికి పోయి అక్కతో శ్రీనాథ కవి మనయింట విందారగింపవచ్చెను వేగ వంటచేయుమని చెప్పుము అని చెప్పిపంపి తానును అతనిని వెంటఁబెట్టుకొని తనకుటీరమునకు పోయెను ఇట్లు శ్రీనాథుఁడు పోతన ఇంటికి పోయి మిక్కిలి శిథిలమై సంకుచితమై ఉన్న ఆపూరియింటిని చూచి బావా మహానుభావుఁడవు అగు నీవు ఈగుడిసెలో ఉండి ఈపేదతికమును అనుభవింపనేల ఎవరినేని గొప్పరాజులను ఆశ్రయించి సంపదలు పడయరాదా అని పలికెను ఇంతలో వంట అయినది స్నానమునకు యత్నము చేయుఁడు అని మల్లిన వచ్చి చెప్పెను అంత ఆయిరువురును స్నానముచేసి తమతమ అనుష్ఠానములు జరపుకొని భోజనము చేయ పోయిరి అప్పుడు మనుష్య స్త్రీరూపము ధరియించి పోతనకు కూఁతురు అనుపేర అతనియింట మెలఁగుచు ఉన్న సరస్వతీదేవి పళ్లెరమున అన్నమును కొనివచ్చి విస్తళ్లలో వడ్డించుచు కన్నుల నీళ్ల రాల్చెను అది చూచి పోతన "ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయింబడనేల యేడ్చెదో, కైటభరాజమర్దనుని గాదిలికోడల యోమదంబ యో, హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్లకర్ణాటకిరాత కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ" అని చెప్పెను అదివిని ఆమె శోకము మాని సర్వపదార్థములు వడ్డింపఁగా భోజనముచేసి తగినమర్యాదతో పోతరాజు పంపఁగా శ్రీనాథుఁడు తానేమి చెప్పుటకును ఎడములేక తనవచ్చినదారిని పోయెను ఇట్లు పరమ వైరాగ్యపరుఁడై రామాంకితముగ భాగవతమును సమగ్రముగా తెనిఁగించి ముక్తుఁడు అయ్యెను ఇది కాక వీరభద్రవిజయము అను దక్షాధ్వరధ్వంసకథ ఒకటి ఈయన రచించినట్లు తెలియవచ్చుచు ఉన్నది అదిమాత్రము నరాంకితము చేయఁబడి ఉన్నది అందులకు కారణము తెలిసినది కాదు ఇతఁడు శాలివాహన శకము వేయిని మున్నూఱు అగు కాలమున జనియించినవాఁడు

పోతురాజు ఒకానొకపురుషదేవత శంకరావతారమైన వీరభద్రుని ఈపేరితో గ్రామముల చావళ్లయందు ప్రతిష్ఠచేసి జనులు పూజింతురు

పోలేరమ్మ ఒకగ్రామదేవత పరశురాముల తల్లి అగు పరాశక్తి అవతారము అయిన రేణుకాదేవిని ఈనామముచే అనేకదేశములయందు పూజింతురు

## పౌ

పౌండ్రము (౧) భీముని శంఖము
(౨) ఓఢ్రదేశమునకును ఆంధ్రదేశమునందలి ఉత్తర భాగమునకును ప్రాచీననామము దీనికి బలికొడుకు అయిన పుండ్రుని వలన ఈనామము కలిగెను.

పౌరవి బాహ్లికుని కూఁతురు వసుదేవుని భార్య.

పౌరవులు పూరువంశస్థులు

పౌలోమి శచీదేవి పులోముని కూఁతురు. ఇంద్రుని భార్య

పౌలోములు వైశ్వానరుఁడు అను దానవుని కొమార్తె అగు పులోమకును పుట్టిన రాక్షసులు. వీరిని అర్జునుఁడు రూపులేక నాశము చేసెను.

పౌష్యుఁడు ఉదంకునికి కుండలములు ఇప్పించినరాజు

## ప్ర

ప్రఘసుఁడు రా॥ సుమాలి కొడుకు

ప్రచేతసులు ప్రాచీనబర్హికిని సముద్రుని కూఁతురు అగు శతధృతికిని పుట్టినవారు వీరు పదుగురు అన్నదమ్ములు తుల్యగుణ నామములు కలవారు మహాతపోధనులు వీరిభార్య మరీష

ప్రచేతస్సు గాంధారుని పౌత్రుని పౌత్రుఁడు ఇతనికి అనేకులు పుత్రులు కలరు వారు అందఱు మ్లేచ్ఛులు అయిరి

ప్రచేతసుఁడు } వరుణునికి నామము
ప్రచేతుఁడు

ప్రజాపతి బ్రహ్మకు నామాంతరము

బ్రహ్మపుత్రుఁడైన మనువు కొడుకు ప్రజాపతి అనియు అతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, రస, శ్వస, మనస్వినీ, శాండిలి, ప్రభాస అని ఏడుగురు పత్నులు కలరు అనియు వారికి అష్టవసువులు పుట్టిరి అనియు భారతమున చెప్పఁబడి ఉన్నది

ప్రజాపతిక్షేత్రము ఒకానొక పుణ్యక్షేత్రము ప్రయాగ మొదలు ప్రతిష్ఠాన పురము వఱకును వాసుకి హ్రదము మొదలు కంబళాశ్వతరబహుమూల పర్వతముల వఱకును కలదేశము ఇచట స్నానముచేసిన వారికి స్వర్గము లభించుటయె కాక పునర్జన్మము కూడ లేదు అందురు బ్రహ్మాదిదేవతలు ఈ క్షేత్రమును ఎల్లప్పుడు రక్షణచేయుచు ఉండెదరు ఇచటి పుణ్యతీర్థములను లెక్కింప అలవిగాదు వానిలోపల జాహ్నవి యమున ఈ రెండు నదులను సూర్యుఁడు రక్షించుచు ఉండును. ప్రయాగను పానిమండలమును అందు ఉండు వటవృక్షమును శివుఁడును, అందలి స్నానఫలమును దేవతలును రక్షింతురు ప్రయాగను స్మరించినమాత్రమున నే సకలదురితములు పాయును మఱియు ఈ ప్రయాగయొక్క దర్శనము స్పర్శనము మృత్తికాలేపనము వీనిచే పాపపరిహారము అగును

ప్రతర్దనుఁడు కా॥ నా॥ శత్రుజిత్తు ఋతధ్వజుఁడు దివోదాసునికొడుకు

ప్రతాపరుద్రీయము విద్యానాథకవిచే రచియింపఁబడిన అలంకారశాస్త్రము ప్రతాపరుద్రుఁడు అను రాజునకు అంకితముగా చేయఁబడుటచే దీనికి ఈ పేరు కలిగెను ఇది నాయకలక్షణ కావ్య నాటక రస దోష గుణ శబ్దాలంకార మిశ్రాలంకార ప్రకరణములు అనెడు నవప్రకరణములు కలిగియుండును దీనికి "రత్నాపణము" అను వ్యాఖ్యానము ఒకటి కలదు దీనికి సరి అయిన ఆంధ్రగ్రంథము నరసభూపాలీయము లేక కావ్యాలంకార సంగ్రహము

ప్రతిబాహువు (౧) య॥ కృష్ణుని వంశస్థుఁడు వజ్రుని కొడుకు

(౨) య॥ అక్రూరుని తమ్ముఁడు

ప్రతివింధ్యుఁడు ధర్మరాజుకు ద్రౌపదియందు పుట్టిన కొడుకు

ప్రతిష్ఠానపురము ఇది గంగాయమునాసంగమమునకు తూర్పున ఉండును ఈ పురి పురూరవునకు సుద్యుమ్నునిచే ఈయఁబడెను చంద్రవంశపురాజులకు ఇదియె తొలుతటి రాజధాని

ప్రత్యగ్రుఁడు కు॥ ఉపరిచరవసువు కొడుకు

ప్రత్యూషుఁడు అష్టవసువులలో ఒకఁడు

ప్రదీపుఁడు కు॥ భీమసేనుని కొడుకు భార్య సునంద కొడుకులు దేవాపి, శంతనుఁడు,

